# చతుర కతలు



## విపుల, చతురోక్తుల గని... చలసాని స్మృత్యర్థం

అసాధారణ అద్భుత వ్యక్తిత్వం
నిరాడంబర, నిగర్వ మనస్తత్వం
బాస్‌కీ, సబార్డినేట్‌కీ మధ్య గీత చెరిపిన సౌహార్దం
కుటుంబవ్యక్తిలా కలిసిపోయే స్నేహతత్వం
కలివిడిగా వుంటూనే కనుసన్నలతో
కమాండ్ చేసే హుందాతనం
పనిపట్ల బాధ్యతారాహిత్యాన్ని
భరించలేని కచ్చితత్వం
నియమబద్ధతకి నిర్వచనం
బహుముఖ ప్రజ్ఞకి ప్రతిరూపం
వెరసి మన చలసాని...
వర్ధమాన రచయితలకి చుక్కాని
అందర్నీ అలాగే వదిలి
ఇక సెలవంటూ వెడలిపోయిన అమరజీవికి
**వారి రచనలతోనే సాహితీ నివాళి.**

---

*ఈ నెల 'చతురకతలు' శీర్షికన కీర్తిశేషులు శ్రీ చలసాని ప్రసాదరావు హాస్య, వ్యంగ్య కథా సంకలనం '[illegible]' నుండి తీసుకున్న కథలను ప్రచురిస్తున్నాం.*

### ఇంటర్వ్యూ

"అలా కూర్చో" అన్నాడాయన కుర్చీ చూపుతూ.

ఆ స్వరంలో ధ్వనించింది ఆజ్ఞో, విజ్ఞాపనో అర్థంగాలేదు అప్పారావుకు.

కూర్చున్నాడు అప్పారావు మార్పులుక కుండా.

అప్పారావును తేరిపార జూచాడాయన.

తలొంచుకున్నాడు అప్పారావు ఆ చూపుల్ని తట్టుకోలేక.

చిరునవ్వు చిందించేడాయన.

సిగ్గుపడ్డాడు అప్పారావు.

ఆ సిగ్గుపడటం అత్తవారింట్లో అడుగెట్టబోతున్న కొత్త పెళ్ళికూతురును గుర్తుకు

తెచ్చిందాయనకు.

"నీ పేరు? " ప్రశ్నించేడాయన.

సందేహించేడు అప్పారావు.

క్షణమాగి "ఊ! నీ పేరు? " రెట్టించాడాయన.

తడబడ్డాడు అప్పారావు.

"అప్లికేషన్‌లోనే వ్రాశాను గదండీ!" అన్నాడు నోరు పెగుల్చుకుని.

జేబురుమాలు నోటికడ్డం పెట్టుకున్నాడాయన.

"ఏమని వ్రాశావు? "

"నా పేరు అప్పారావు అనే వ్రాశానండీ!"

ఆ క్షణంలో అప్పారావు కంఠంలో ధ్వనించిన నిజాయితీ ఆయన్నంతగా ఆకర్షించలేదు.

"అలాగా! నీవెప్పుడూ అబద్ధాలు వ్రాయవా ఏమిటి? " ప్రశ్నించాడాయన వింతగా అప్పారావు కళ్ళలోకి చూస్తూ.

"అవునండీ! వ్రాయకపోవడమేగాదు, అబద్ధాలాడనుకూడాను? " అన్నాడు అప్పారావు ఉత్సాహంగా.

"అనటానికీ, వ్రాయటానికీ తేడా ఉందా? " అన్నాడాయన సాగదీస్తూ.

"లేకేమండీ! చేత్తో రాస్తారు. నోటితో ఆడతారు" జవాబిచ్చాడు అప్పారావు.

"అదేమిటి? కాళ్ళతోనూ, చేతుల్తోనూ ఆడటం చూశానేగాని, నోటితో ఆడటం గురించి విననన్నా లేదే!" అన్నాడాయన ఆశ్చర్యాన్ని వ్యక్తపరుస్తూ.

"కాదండీ! కాళ్ళతోనూ, చేతుల్తోనూ ఆటలాడుతారు, నోటితో మాటలాడుతారు" వివరించాడు అప్పారావు.

"అలాగా" అన్నాడాయన.

ఆ క్షణంలో అప్పారావు కళ్లలో పరీక్షల్లో చిక్కులెక్కను సునాయాసంగా చేసేసిన విద్యార్థిలో రేగే ఉత్సాహం లాంటిది కొట్టవచ్చినట్లు స్పష్టంగా పొడగట్టిందాయనకు.

"బుద్ధిమంతుడవే!" అన్నాడాయన.





ఏ అర్థంలో ఆయనా మాటన్నదీ తెలీలేదు అప్పారావుకు.

"అందరూ అలాగే అంటారండీ!" అన్నాడు అప్పారావు క్షణమాగి.

"ఏమని? " కళ్లు చిట్లించేడాయన.

"ఇందాక మీరన్నట్లేనండీ! కాని..."

"ఊ... కానీ!"

"కానీ, మా మామయ్య మాత్రం తిడుతుంటాడండీ అస్తమానూ? "

"అలాగా! ఎందుకు? "

"నాకు అబద్ధాలాడ్డం చేతగాదట. బతకటం అసలే చేతగాదట. అందుకని"

"నీకు బ్రతకటం ఎందుకు చేతకాదు? "

"నిక్షేపంలాంటి ఉద్యోగం చేజేతులా పోగొట్టుకున్నావు. ఇంకెలా బ్రతుకుతావు అంటాడండీ మా మామయ్య"

"అయితే నువ్వింతకు ముందేమన్నా ఉద్యోగం చేశావా? " అన్నాడాయన ఆశ్చర్యపోతూ.

"అవునండీ చేశాను" అన్నాడు సగర్వంగా అప్పారావు.

"మరెందుకు పోయిందా ఉద్యోగం? " అనుమానంగా చూశాడాయన అప్పారావు కళ్ళలోకి.

గొంతు సవరించుకుంటూ క్షణమాగేడు అప్పారావు. "మేనేజరు పొమ్మన్నాడండీ!"

"ఎవరా మేనేజరు? "

"అరగంటకో పాన్ పరపరా నములుతుంటాడే, ఆయనేనండీ"

అప్పారావు కళ్లలో రోషం పల్చగా తొంగిచూసింది.

"అలాగా! ఆయనెవరికి మేనేజరు? ప్రశ్నించి జేబురుమాలు మళ్ళీ నోటికడ్డ పెట్టుకున్నాడాయన.

"నేనింతకు ముందు ఉద్యోగం చేసిన కంపెనీ మేనేజరండీ"

"మరి ఆయనెందుకు పొమ్మన్నాడు? "

"నేనెందుకూ పనికిరానట, అందుకని"

"ఏం, నీకే పనీ చేతగాదా? "

"చేతగాకేమండీ! అసలు నాకు చేతగాని

పనే లేదంటాడు మా మామయ్య"

"మరి...? "

"మరి వాళ్ళు లెక్కల్లో అబద్ధాలు వ్రాయా లన్నారు? "

"అయితే? "

"నేను వ్రాయలేనన్నాను"

"అప్పుడు...?"

"నువ్వు మాకక్కర్లేదు పొమ్మన్నారు"

"మరి నీవు అబద్ధాలాడవా? "

ఉలిక్కిపడ్డాడు అప్పారావు.

"అబద్ధాలా! ఆడటమేగాదు, వ్రాయనుకూ డానండీ" అన్నాడు ధీమాగా.

వాళ్లం. మాకు నీ బోటి సత్యహరిశ్చంద్రులు గాదు కావలసింది" నెమ్మదిగా వివరించాడా యన.

"అవునండీ. ఆ సంగతి మా మామయ్యా కూడా చెప్పాడండీ" వంత పలికాడు అప్పా రావు.

"ఏ సంగతీ? "

"మీరు చెప్పినట్లు వినాలనీ, ఉద్యోగం జాగ్రత్తగా చూసుకోవాలనీ చెప్పేడండీ మా మామయ్య"

"మరి అబద్ధాలాడనంటుంటివిగా!"విసు క్కున్నాడాయన. విసుక్కుంటూనే స్వింగ్



ఆ క్షణంలో మెరుస్తున్న అప్పారావు కళ్ల లోని వింత కాంతిని గమనించలేదాయన.

"అయితే నువ్వింక దయచెయ్యవచ్చు" అన్నాడాయన జేబురుమాలు నోటికడ్డంతీసి.

"ఎక్కడికళ్లడీ? " అడిగాడు అప్పారావు.

"మీ ఇంటికి" తీక్షణంగా జవాబిచ్చేడా యన.

బిత్తరపోయాడు అప్పారావు "మీ ఆఫీ సులో ఓ ఉద్యోగం ఖాళీగా ఉందని ప్రకటి స్తేనే గదాండి నేనిలా వచ్చింది" అన్నాడు తడబడుతూ.

"మా కంపెనీ దివాలా తియ్యాలని నీ ఉద్దేశ్యమా? " ప్రశ్నించాడాయన.

"ఎబ్బెబ్బే!" నసిగాడు అప్పారావు.

"అబ్బాయ్, మేం వ్యాపారం చేసుకొనే

డోర్స్ కిందుగా వరండాలో కనిపిస్తున్న పద మూడు పాంట్లనూ, మరన్ని జతల బూట్లనూ పరికించి నొసలు చిట్లించేడు.

"ఇకమీదట అదేం లేదండీ! మీరు చెప్పి నట్లు చేస్తానని మామయ్యకు హామీ ఇచ్చే వచ్చానుగదండీ" అన్నాడు అప్పారావు.

"సరే, నువ్వేం ప్యాసయ్యావు? "

"మెట్రిక్ చదివానండీ!" జవాబిచ్చాడు అప్పారావు.

"పాసయ్యావా? "

"ప్యాసవుతానండీ. మళ్ళీ మొన్న సెప్టెంబ రుకు వెళ్ళానుగదాండీ! ఈసారి తప్పక ప్యాసవుతానంటున్నాడండీ మా మామయ్య"



ఈసారి మరింత గట్టిగా విసుక్కుంటూ అప్పారావు కళ్లలోకి చూశాడాయన.

చూసి కొంచెం శాంతించాడు. "దయ చెయ్యి" అన్నాడాయన క్షణమాగి.

"ఎక్కడికండీ? " అడిగాడు అప్పారావు.

వేలెత్తి చూపించాడాయన.

అటు చూసిన అప్పారావుకు స్వింగ్‌డోర్స్ కిందుగా వరండా, ఆ వరండాలోని పదమూడు పాంట్లూ, మరన్ని జతల బూట్లూ రకరకాలవి అగుపించాయి.

"ఎందుకండీ? " ప్రశ్నించేడు అప్పారావు.

"ఎందుకంటే, అక్కడ పదముగ్గురు గ్రాడ్యుయేట్లు ఇంటర్వ్యూకు ఎదురుచూస్తూ కూర్చున్నారు గనుక" జవాబిచ్చాడాయన శాంతంగా.

ఆయన మాటల్లోని ఆంతర్యం అంతు చిక్కలేదు అప్పారావుకు.

"ఆర్డరు ఇప్పించండి వెళ్తాను" అన్నాడు అప్పారావు.

"ఏం ఆర్డరు? "

"ఉద్యోగపు ఆర్డరండీ! అది లేకుండా వెళ్తే తిడతాడండీ మా మామయ్య" జవాబిచ్చాడు అప్పారావు.

"అయితే గంగలో దూకండి!" మండిపడ్డాడాయన.

"ఎవరండీ!" అయోమయంగా చూశాడు అప్పారావు.

"నువ్వూ, మీ మామయ్యాను" గద్దించేడాయన లేస్తూ.

"అవునండీ! మా మామయ్య కూడా అలాగే అన్నాడండీ" వంత పలికేడు అప్పారావు.

తెల్లబోయాడాయన.

"ఏమని? " ప్రశ్నించేడాయన.

"ఇందాక మీరన్నట్లేనండీ!"

"అంటే? "

"ఇందాక నేను వచ్చేముందు మా మామయ్య అలాగే అన్నాడండీ!"

"ఎలాగని...? "

"నీకెందుకు నువ్వు ఇంటర్వ్యూకి వెళ్ళరా అబ్బాయ్! నేను చెప్పానుగా. నా మాట అంత తేలిగ్గా తీసెయ్యడులే. అంతపనీ జరిగితే ఆ వెధవని గంగలో ముంచుతాను" అన్నాడండీ.

"ఎవడా మామయ్య? "ఆగ్రహంతో నిలువెల్లా ఒణికిపోతూ గర్జించాడాయన.

"మీరు బాగా ఎరుగుదురట గదండీ"

"నేనా? "

"అవునండీ. నిన్న ఉదయం మీకు ఫోను చేశాడు కూడాను. ఆయన్నే ఎరగనంటారేం? " అన్నాడు అప్పారావు సందేహంగా ఆయన వంక చూస్తూ.

షాక్ తిన్నవాడిలా ఉలిక్కిపడి, కాలింగ్ బెల్ నొక్కబోతున్న వాడల్లా అమాంతం కుర్చీలో కూలబడ్డాడాయన.

"ఆయనా మీ మామయ్య" కంపిస్తున్న స్వరంతో ఆయనన్న ఆ మాట అప్పారావు చెవిదాకా వెళ్ళలేదు.

క్షణమాగి టేబుల్ మీదున్న డైరీలో తానంతకుముందు వ్రాసుకున్న నోట్ చదువుకుని తలెత్తి అప్పారావు వంక చూశాడాయన.

అసలే తెల్లగా ఉన్న ఆయన మొహం ఆ క్షణంలో మరింత తెల్లబడటానికి హేతువేమిటో తోచలేదు అప్పారావుకు.

కాలింగ్‌బెల్ మ్రోగించాడాయన.

ఉలిక్కిపడ్డాడు అప్పారావు.

బంట్రోతు వెంట మరో గదిలోకి వెళ్లిన అప్పారావు అరగంట తర్వాత ఆర్డరు కాగితం మడిచి జేబులో పెట్టుకుంటూ ఉత్సాహంగా వరండాలోకి వచ్చాడు.

వరండాలోకి వచ్చిన అప్పారావుకు అంతకుముందక్కడ కూర్చున్న వాళ్ళలో పన్నెండుగురే అగుపించారు.

పదమూడోవాడు తానంతకుముందు కూర్చున్న కుర్చీలో ఆ ఆఫీసరు కభిముఖంగా కంఠశోష పడుతూ కూర్చునున్న సంగతి తెలీదు అప్పారావుకు. (1960)




# విజ్ఞుడు

'ఛీ' అనుకున్నాడు ఆనందరావు.

కొందరు అనుకున్న మాటల్లా పైకి అనెయ్యలేరు ఒక్కొక్కప్పుడు.

అలాగే ఆనందరావూ అనలేదు, అనలేదు కూడా.

అందుకని...

అసహ్యంతో మొహం పక్కకి తిప్పుకున్నాడు.

కానీ... కానీ

అరెరె... అదేమిటి? అక్కడ ఆ పక్కన కూర్చున్నవాడు కూడా వీడిలాగే...

పల్లెటూరి బైతులా...

ఒకటో క్లాసు కుర్రెధవలా...?

అయితే ఇందాకటంత గట్టిగా అనుకోలేదు ఆనందరావు.

మాసిన పొట్టి నిక్కరూ, బనియనూ తొడుక్కుని జిడ్డోడుతున్న కుర్రాడొకడు వచ్చి ఆ నీళ్ళతో నిండిన ప్లేట్లు తీసి టేబుల్ తుడిచి లోపలికి పోతున్నాడు.

వాడు టేబుల్ తుడవడానికుపయోగించిన గుడ్డను చూస్తేనే డోకు వచ్చేట్టుందనుకున్నాడు ఆనందరావు.

కాని, ఎప్పుడూ అనుకున్నదల్లా జరగనట్లుగానే ఇప్పుడూ ఆనందరావు డోక్కోలేదు.

'ఏబ్బే, ఏం మనుషులు వీళ్ళూ' అనుకున్నాడు ఆనందరావు ఆ హోటల్లో తింటూ తాగుతూ వున్నవాళ్ళలో తనని తప్ప అందర్నీ కలియజూస్తూ.

"వీళ్ళకేం తాము చేస్తున్న పనులు



ఆరోగ్య సూత్రాలేమీ తెలియని... అజ్ఞానిలా...

వాడూ వీడిలాగే ప్లేటులోనే చేయి కడుక్కుంటున్నాడు.

దోసెలో నంజుకోగా మిగిలిన కాస్త పచ్చడీ, చేతిలోకి తీసుకొని, వేళ్లసందున నలిపి చేతికంటుకున్న నూనె వదిలించుకుని మరీ కడుక్కుంటున్నాడు.

"ఛీ" అనుకున్నాడు ఆనందరావు మళ్ళీ వాణ్ణీ, తనెదురుగా కూర్చుని జేబురుమాలుతో చేయి తుడుచుకుంటూ తృప్తిగా త్రేనుస్తున్న వీణ్ణీ అసహ్యంగా చూస్తూ.

మంచివి కావని తోచదా వీళ్లింత మూర్ఖులా?"

అలా అనుకోవటంతో తాను వాళ్ళందరికన్నా ఓ మెట్టు పైనున్నట్లనిపించింది ఆనందరావుకు.

ఈ ప్లేటు తీసుకెళ్ళిన కుర్రాడు వాటిమీద ఓ నాలుగు చుక్కల నీళ్లు జల్లి ఆహా ఎంత బాగా శుభ్రం చేశాను అనుకుంటాడు. అనుకుని, వాటిని సర్వరుకందిస్తాడు. వాడందులో ఓ దోసో, రెండిడ్లీలో వేసి తన బోటి

వాళ్ళ ముందుంచుతాడు. తామేమో లొట్టలు వేసుకుంటూ మింగి ఊరుకుంటారు, మడ్డి సంగతీ, జిడ్డు సంగతీ చూడకుండానే.

అయినా వీళ్ళకు బుద్ధి లేకపోతే, వాడికన్నా ఉండనక్కర్లేదా.

అందరూ వీళ్ళలాంటి వెధవాయలేనా? తనబోటి అన్నీ తెలిసినవాళ్ళు లేరా?

ఆ సంగతి వాడు గమనించవద్దా?

అనుకుంటూనే తలెత్తాడు ఆనందరావు.

గోడమీది బోర్డును చూసి ఉలిక్కిపడ్డాడు.

"దయచేసి ప్లేట్లలో చేతులు కడగకండి"

హోటలు వాడిని అనవసరంగా తిట్టుకున్నందుకు తనమీద తనకే జాలి వేసింది ఆనందరావుకు. పాపం హోటల్‌వాడి తప్పేంలేదు. వీళ్ళకే... ఈ తిని, కడిగి, తాగేవాళ్ళకే బుద్ధిలేదు. లేకపోతే గోడమీది ఆ బోర్డు అంతగా మొత్తుకుంటున్నా చూడకుండా పట్టించుకోకుండా ఈ గలీజేమిటి?

సర్వర్ తెచ్చి ముందుంచిన ప్లేటులోని దోసెలోంచి వేడి ఆవిరి మొహాన తగలటంతో ఆలోచనలు ఆగిపోయాయి ఆనందరావుకు.

దోసె చాలా రుచిగా ఉందనుకున్నాడు ఆకలిగా ఉన్న ఆనందరావు, మూడు ముక్కలు నమిలాక.

అయినా అయ్యరుగాడు వండటమూ, అవి బాగుండకపోవడమూ ఏమిటి? ఇడ్లీ వండితే వాడే వండాలి. దోసె చేస్తే వాడే చెయ్యాలి. సాంబార్ కలిపితే వాడే కలపాలి. 'వింటే భాగవతమే వినాలి, తింటే అయ్యరిడ్లీయే సాంబర్తో సహా తినాల'ని సామెత ఊరికే పుట్టిందా మరి. అందుకే వందల మైళ్లు దాటివచ్చినా ఇక్కడ ఇలా హాయిగా టేబుల్ ముందు కాళ్ళు బారజాపుక్కూర్చుని రెండు చేతులా సంపాదిస్తున్నాడు.

అయ్యరు అదృష్టాన్ని మెచ్చుకుంటూ దోసె తినటం ముగించి, కాఫీకి ఆర్డరిచ్చి వాష్‌బేసిన్ వైపు నడిచేడు ఆనందరావు.

వాష్‌బేసిన్‌ను సమీపిస్తూ 'నో అడ్మిషన్!' బోర్డు కిందున్న ద్వారం గుండా కనిపించిన దృశ్యాన్ని చూసి మళ్ళీ "ఛీ!" అనుకున్నాడు ఆనందరావు.

లోపలంతా మసిబారిన నల్లగోడలూ, చెమటోడ్చే మురికి మనుషులూ, పొగతో నిండిన వేడిగాలి.

తానిందాక తిన్న దోసె ఈ మురికికూపంలోనేనా తయారయింది? తాను తాగబోతున్న కాఫీ వీళ్ళ చేతుల్లోనేనా తయారవుతున్నది?

ఆనందరావు మనసు చివుక్కుమంది.

మొహం తిప్పుకుని వాష్‌బేసిన్ వద్దకు చేరుకుని, అందులో చేయిపెట్టి, రెండో చేత్తో పంపు తిప్పాడు ఆనందరావు. కాని అందులోంచి నీళ్ళు రాలేదు. రెండోవైపునున్న పంపు తిప్పేడు. అదీ అంతే.

విసుగ్గా, కోపంగా కౌంటరు ముందున్న అయ్యరు వంక చూసేడు. కాని అయ్యరు దృష్టి ఇటు లేదు. బిల్లులు చూసుకుంటూ చిల్లర డబ్బు లెక్కపెట్టుకుంటున్నాడు తాపీగా.

యధాస్థానానికొచ్చి కూర్చుని, అప్పుడే ప్లేటూ, గ్లాసూ తీసి టేబుల్ శుభ్రం చేయబోతున్న కుర్రాడినాపి, గ్లాసులో మిగిలిన కాసిని నీళ్ళతో ఆ ప్లేటులోనే చేయి కడుక్కుని, కాఫీ తాగేశాడు ఆనందరావు.

కాఫీ మహారుచిగా వుంది. కాఫీ ఇలా వుండాలని తాను ఇంట్లో ఎన్నిసార్లు చెప్పినా లాభం లేకపోయింది. ఇంట్లో తాగుతున్నప్పుడు అసలు కాఫీ తాగుతున్నట్లే ఉండదు తనకు. ఏదో వెలితిగానే ఉంటుందెప్పుడూ.

బహుశా ఈ హోటలువాళ్ళ దగ్గర ఏదో చిట్కా ఉండి ఉండాలి. లేకపోతే ఇంత రుచి ఎలా వస్తోంది?

ఆనందరావు లేచి బిల్లు చెల్లించి, బయటికి వచ్చి పాన్‌షాపు వేపు నడిచాడు.

పాన్‌షాపు ముందు మూగిన వాళ్ళలోంచి కాస్త సందు చేసుకుని పాన్‌కు ఆర్డరిచ్చి యధాలాపంగా పాన్ కట్టేవాణ్ణీ, వాడు కడు





తున్న తీరూ చూసి గతుక్కుమన్నాడు ఆనందరావు.

వాడు పాన్ నములుతూ బాసింపట్టు వేసుక్కూర్చుని ముందు పరచిన గుడ్డమీద ఆకులు పరచి ఒక్కసారిగా అరడజను పానులు చకచకా తయారుచేస్తున్నాడు.

అయితే ఆనందరావు గతుక్కుమన్నది వాడి నైపుణ్యాన్నిగాని, అతగాడి పెదవుల మధ్య నృత్యం చేస్తున్న పాన్ తాలూకు రక్తం లాంటి నురగనుచూసి కాని కాదు. అది బాగా పరిచయమైన మొహమేనాయె.

వాడు ఆకులు పరచిన గుడ్డను చూసి, "ఛీ" అనుకున్నాడు ఆనందరావు.

వాడా గుడ్డను ఎన్నాళ్ళనుంచి వాడుతున్నాడోగాని అది సగం ఎర్రగా, సగం నల్లగా అలుముకుపోయి ప్రస్తుత స్థితిలో చూట్టానికి మసిపాతలా వుంది.

అయితే ఆనందరావు "ఛీ" అనుకున్నది ఆ గుడ్డ అంత అందంగా, ఆధునిక కళాఖండంలా ఉండటాన్ని చూసి భరించలేకగాదు.

మరో క్షణంలో తన నోట్లోకి పోబోతున్న పాన్ ఆ మాసిన మరకల మురికిగుడ్డమీద తయారవటాన్నే సహించలేకపోయాడు ఆనందరావు.

పాన్ కోసం అక్కడ మూగిన నలుగుర్నీ పరకాయించాడు. వాళ్ళెవరూ ఆ సంగతి గమనించినట్లే లేదు. కళ్ళు తెరుచుకుని చూస్తూనే మురికిని మింగటానికి సిద్ధపడుతున్నారు వాళ్ళు.

"ఎబ్బే ఏం మనుషులు" అనుకున్నాడు ఆనందరావు.

అలా అనుకోవటంతో "వెధవ పాన్! వేసుకోకపోతేనేమి! వెళ్ళిపోదామా" అనిపించింది.

కాని, అంతకుముందే డబ్బు వాడి ఎదాన కొట్టిన సంగతి గుర్తుకొచ్చి ఆగిపోయేడు.

వెధవది, తాను ముందుగానే డబ్బెందుకివ్వాలి! ఇదో పాత అలవాటైపోయింది. ఇప్పుడు పాన్ అక్కర్లేదు, ఆ పైసలు ఇచ్చెయ్యమంటే పిచ్చాణ్ణి చూసినట్లు చూస్తారు నలుగురూ. కనుక ఇప్పుడు మర్యాదగా ఆ పాన్ పుచ్చుకుని తర్వాత ఏ చెత్తకుండీలోనో పడేస్తే సరి! మళ్ళీ ఇటు రాగూడదు" అనుకున్నాడు ఆనందరావు.

అనుకుంటూనే షాపువాడందించిన పాన్ పుచ్చుకుని నాలుగడుగులు ముందుకు వేశాడు.

"గుడీవ్నింగ్!" అంటూ ఎదురయ్యేడు స్నేహితుడు సూర్యనారాయణ చేయి చాపుతూ. చేయందించబోయి చేతిలోని పాన్‌ను చూసి దాన్నే అందించబోయేడు ఆనందరావు.

"ఎబ్బే! నాకు అలవాటు లేదు. అయినా పాన్ వంటికి ఏమంత మంచిదిగాదంటారు. దానివల్ల గుండెజబ్బులు, కాన్సర్ గట్రా వచ్చే అవకాశముందటగా" అన్నాడు సూర్యనారాయణ.

అని, చేతిలోని బరువైన సంచీని పట్టుకోమని ఆనందరావుకిచ్చి జేబులోంచి సిగరెట్టు తీసి ముట్టించేడు.

సూర్యనారాయణ మాటలకు మండుకొచ్చింది ఆనందరావుకు.

'పీడి బొంద! కాకపోతే సిగరెట్లలో అమృతముంది కాబోల్ను! అది మాత్రం గుండెలకు బలం గాబోల్ను' అనుకుంటూనే కోపంగా చేతిలోని పాన్‌ను చూసి, అమాంతం నోట్లో వేసుకుని సూర్యనారాయణనే నమిలివేస్తున్నట్లు పరపరా నమలసాగాడు.

"ఏమిటి కబుర్లు? " ప్రశ్నించేడు సూర్యనారాయణ.

"ఏముంది? ప్రపంచమంతా అధ్వాన్నంగా తగలబడుతోంది" అన్నాడు ఆనందరావు పాన్‌నూ, పాన్ షాపువాణ్ణీ, హోటలువాణ్ణీ నెమరువేస్తూ.

"అవును, తగలబడుతూంది!" వంత పలికాడు సూర్యనారాయణ 'ఈ సంచీలో చూడు' అన్నాడు.

ప్రపంచం ఇందులోనే తగలడుతోందేమోననుకుంటూ సంచీలోకి చూసిన ఆనందరావుకు



అందులో తెల్లగా, తియ్యగా మెరుస్తూన్న పంచదార తప్ప మరేం అగుపించలేదు.

"ఏముంది! పంచదారా" అన్నాడు ఆనంద రావు, సంచీని సూర్యనారాయణనూ మార్చి మార్చి చూస్తూ,

"అవును. పంచదారే! ఇంత తెల్ల వస్తువు కూడా నల్లమార్కెట్లో తప్ప దొరకటంలేదు. ఇప్పుడక్కణ్ణుంచే కొనుక్కొస్తున్నాను. అంటే ప్రపంచం ఎంత నల్లగా తగలడుతూందో ఆలోచించు" అన్నాడు సూర్యనారాయణ.

అని, "ఇలా ఎక్కడికి బయలుదేరేవు? " అని ప్రశ్నించేడు ఆనందరావుని.

"ఎబ్బే! అలా కాస్త సినిమా చూసొద్దా మని" నసిగేడు ఆనందరావు. వీడు కూడా వస్తానంటాడేమోనని భయపడుతూ.

"కాస్తేం ఖర్మ! పూర్తిగా చూడు. టైమయి పోతున్నట్టుంది. త్వరగా వెళ్ళు, నాకు మార్కెట్లో పనుంది" అంటూ వెళ్ళిపోయాడు సూర్యనారాయణ.

"వెధవ!" అనుకున్నాడు ఆనందరావు. పూర్తిగా చూడాలట. ఆ సంగతి వీడు చెప్పాలి గాబోల్ను! అయినా వీడిలాంటి చవటలుండ బట్టే పంచదారలాంటి తెల్ల వస్తువులు కూడా నల్ల మార్కెట్లోకి జారుకుంటున్నాయి. లేక పోతే ఓ వారంపాటు కాఫీ మానుకోగూ డదూ! అప్పుడు పంచదారా, దాని తాతా కూడా తెల్ల మార్కెట్లోకి రాకేం చేస్తాయి! అసలు బ్లాక్ మార్కెట్లో కొనే వీడిలాంటి మనుషులే ఆ వ్యాపారాన్ని ప్రోత్సహిస్తు న్నారు. ఛీ! ఛీ! ఎబ్బెబ్బే! ఏం మనుషులు"

అనుకుంటూనే థియేటరు వద్దకు చేరుకుని వాచీ చూసుకున్నాడు ఆనందరావు.

టైం దాటిపోయిందనుకుంటూ బుకింగ్ వద్దకు వెళ్ళి మూసివున్న కిటికీ చూసి తెల్లబో యాడు.

ఫస్టు క్లాసు బుకింగ్ మాత్రం తెరచివుంది.

జేబులు తడుముకొని తన దగ్గర అంత డబ్బు లేదని తేల్చుకున్నాడు ఆనందరావు.

అమాంతం సూర్యనారాయణ మీదా, వాడి నల్ల మార్కెటు కబుర్లమీదా కోపం ముంచు కువచ్చింది.

వెధవ! వాడు దార్లో ఎదురవకపోతే ఇంత ఆలస్యం జరక్కపోను!

అయినా కొత్త పిక్చరు. జనం బాగా ఉంటా రని తెలిసి కూడా కాస్త ముందుగా బయలు దేరాల్సింది తను.

కాని... కాని... ఎబ్బే! తన తప్పేంలేదు. తాను సకాలానికే బయలుదేరాడు. కాని, ఆ సూర్యనారాయణగాడివల్లనే... ఆ నల్ల మార్కెట్ మహారాజ పోషకుడి వల్లనే తనకీ ఆలస్యమూ, ఆశాభంగమూనూ.

మండుతున్న కోపంతో ఎదురుగా లేని సూర్యనారాయణను ఏం చెయ్యటానికీ వీలు లేక నోట్లోని పాన్‌ను మరింత గట్టిగా నమిలి తుపుక్కున ఊసి ఇంటిముఖం పట్టాడు ఆనం దరావు.

కాళ్ళీడ్చుకుంటూ, సిన్మాహాలు కాంపౌండ్ లోంచి బయటికి నడుస్తున్న ఆనందరావుకు "టిక్కెట్ కావాలాండీ!" అన్న మాట సూర్యనా రాయణ సంచిలోని పంచదారలా తియ్యగా తోచి వెనక్కి తిరిగాడు.

"సెకండ్ క్లాస్ టిక్కెట్టు సార్!" అంటూ చేతిలో ఓ టిక్కెట్టు ఆడిస్తూ నిల్చునున్నాడు ఒకడు.

"ఎంత? " అనడిగేడు ఆనందరావు సందే హంగా.

"ఓ రూపాయిన్నర ఎక్కువిస్తే చాలు సార్! బుక్కింగ్ మూసేశారు గదాండీ! ఇదే ఆఖరు టిక్కెట్టు" అన్నాడు వాడు టిక్కెట్టు ఊపుతూ.

క్షణమాగి ఆలోచించాడు అప్పారావు.

ఆలోచిస్తూ దీపాల కింద మెరుస్తూన్న రంగురంగుల పోస్టర్లలోని తన అభిమాన తారల మొహాల్ని పరికించేడు.

మారు మాట్లాడకుండా జేబులోంచి డబ్బు తీసిచ్చి టిక్కెట్టు పుచ్చుకున్నాడు.

పుచ్చుకుని రీవీగా, దర్జాగా థియేటర్లోకి నడి చాడు ఆనందరావు.

(1972)

# చలసాని ప్రసాదరావు రచనల నుంచి



★ ఏ రచన అయినా సమకాలీన యదార్థజీవితాన్ని ఆలోచనాత్మకంగా చిత్రించాలి. అది విప్లవాత్మకంగా. లేకున్నా కనీసం వెనకచూపుతో తిరోగమన ధోరణిలో ఆలోచింపచేసేలా, నిరాశా నిస్పృహలను బలపర్చేలా కాకుండానూ, ధైర్యంగా ముందుచూపుతో ఆలోచింపచేసేదిగా ఉండాలి.

★ రచనలు వ్యక్తిగత రాగద్వేషాలకి అతీతంగా ఉండాలి.

★ హాస్యం అరుదైపోలేదు, దాని నాడిని స్పృశించి, నూతన సృజన చేయగల వారరుదయిపోయారు.

★ భావుకుడు తాత్వికునిగా పరిణితి చెందడం అత్యంత సహజం. తాత్వికుడు భావుకుడు కూడా అయి వుండకపోతే ఆ తత్వచింతనకు అర్థమే ఉండదు.

★ రాసేదాంట్లో 'చిత్తశుద్ధి' వుంటే, తప్పని సరిగా మీకు తెలియకుండానే ఆ కథల్లో 'జీవితం' కనబడి తీరుతుంది. అది సీరియస్ రచనే కానక్కర లేదు, హాస్య రచన అయినా కూడా.

★ చదవడం, మంచి రచనలు చదవడం అనేది సర్వకాలాల్లోనూ ఉండాల్సిన గుణం. రచయితలయినవారి మనసుకి, హృదయానికి, మేధకీ ఇదొక వ్యాయామం లాంటిది.

★ మన అవసరానికే భాష. భాష కోసం మనం కాదు.

★ అనువాదం అనేది మూలానికి ఏమాత్రం భేదించకుండా, అన్యాయం చేయకుండా ఉండాలి.

★ "శ్రోతలు కోరిన పాటలు" లాగా పాఠకులు ఎగబడి చదివే రచనలు వేయడానికి ఎడిటర్లే అక్కర్లేదు, ప్రూఫ్‌రీడర్లు చాలు. తాము మంచివని భావించిన రచనల్ని పాఠకులు కూడా ఆమోదించేలా 'పాలిష్' చేసి అందించడానికే ఎడిటర్స్ అనేవాళ్లు ఉన్నారు, ఉండాలి.

సేకరణ: వెనిగళ్ల వెంకటరత్నం

# చతుర ప్రపంచం

## అబ్బాయా? అమ్మాయా!?

పుట్టబోయేది అబ్బాయా? అమ్మాయా? అనేది పూర్తిగా జన్యుసంబంధమైనది. 'ఎక్స్ - ఎక్స్' క్రోమోజోమ్స్ అయితే అమ్మాయి, 'ఎక్స్ - వై' క్రోమోజోమ్స్ అయితే అబ్బాయి పుట్టడం జరుగుతుందన్నది మనందరకు తెలిసిన విషయమే.

కానీ జర్మనీకి చెందిన 'అలెగ్జాండర్ లెర్చల్' అనే శాస్త్రవేత్త ఓ ఆసక్తికరమైన విషయాన్ని తెలియచేస్తున్నారు. ఆయన చెప్పేదేమిటంటే వాతావరణం వేడిగా ఉన్నప్పుడు అబ్బాయిలు, చల్లగా ఉన్నప్పుడు అమ్మాయిలు ఎక్కువగా పుడుతున్నారట.

'అలెగ్జాండర్ లెర్చల్' చెప్పేదాని ప్రకారం ఏప్రిల్ నుంచి జూన్ నెలలోపున అబ్బాయిల మాసాలు అయితే, అక్టోబర్ నుంచి జనవరి వరకు అమ్మాయిల మాసాలు. అంటే ఆయా నెలల్లో వారి సంఖ్య ఎక్కువగా ఉంటోందన్నమాట.

1946-1995 సంవత్సరాల మధ్య అంటే దాదాపు నలభై తొమ్మిది సంవత్సరాల కాలంలో జరిగిన జననాల రికార్డులు, వారు పుట్టిన నెలలు అన్నింటిగురించి సవివరంగా అధ్యయనం జరిపారు. ప్రయోగశాలల్లో ఎలుకలు, గబ్బిలాలమీద కూడా ప్రయోగాలు జరిపారు. దీనిని బట్టి తేలిందేమంటే సెక్స్‌ని నిర్ధారించడంలో వాతావరణం కూడా ఎంతో ప్రభావం చూపుతుందట.

ఈ టెంపరేచర్ సిద్ధాంతం చెప్పేదేమిటంటే వాతావరణం వేడిగా వున్నప్పుడు ఎక్కువసార్లు రతిలో పాల్గొనడం వల్ల స్పెర్మ్‌లో వుండే 'వై' క్రోమోజోమ్ 'ఎక్స్' క్రోమోజోమ్ కంటే వేగంగా అండాశయం వైపుకు ప్రయాణం చేస్తుంది. ఈ కారణంగా 'ఎక్స్-వై' క్రోమోజోమ్స్ కలిస్తే అబ్బాయి పుట్టడం జరుగుతుంది. కాబట్టి వాతావరణంలో ఉష్ణోగ్రత ఎక్కువగా ఉంటే అబ్బాయిల సంఖ్య పెరుగుతుందన్నమాట. దీనిని బట్టి భవిష్యత్తులో గ్లోబర్‌వార్మింగ్ కారణంగా అబ్బాయిలే ఎక్కువగా పుట్టే అవకాశం ఉన్నట్టు తెలుస్తోంది. ఈ పరిశోధన జరిగింది జర్మనీలో కానీ మనదేశంలో ఇప్పటికీ గర్భస్థ స్త్రీ పిండాల్ని హత్య చేయడం మూలంగా అబ్బాయిల సంఖ్య పెరిగిపోయింది. ఇక భవిష్యత్తులో గ్లోబల్ వార్మింగ్ కూడా తోడైతే అమ్మాయిల సంఖ్య ఇంకా తగ్గిపోయే అవకాశం ఉంది.







# మనీ వద్దన్న మహనీయులు

ఎందరో శాస్త్రవేత్తలు జీవితమంతా పరిశోధనలో గడిపి ఎన్నో విషయాలు కనుక్కున్నారు. ఫలితంగానే నేడు మనం ఎంతగానో ఎంజాయ్ చేస్తున్న టెక్నాలజీ అభివృద్ధి చెందింది. టెలిస్కోప్‌ను గెలీలియో కనుక్కున్నాడన్న సంగతి మనకు తెలిసిందే. టెలీస్కోప్‌తో రోజుల తరబడి విశ్వంలోని నక్షత్రాలను గమనిస్తూ కళ్ల దెబ్బతిని చూపు కోల్పోయాడు. పొటాషియం సైనేడ్ రుచి చూసి కార్ల్‌విలియం స్కీవ్ అనే స్వీడన్ శాస్త్రవేత్త ప్రాణాలు కోల్పోతే, మాడమ్ క్యూరీ తాను కనిపెట్టిన 'రేడియం' మనిషి శరీరంపై ఎలాంటి ప్రభావం కలిగిస్తుందో తెలుసుకునే ప్రయత్నంలో ప్రాణం కోల్పోయి శాస్త్ర పరిశోధనలకు తన జీవితాన్ని అంకితమిచ్చింది. మాడమ్ క్యూరీ రేడియం తయారీపై హక్కులు తీసుకోవడానికి నిరాకరించి తనకు 'మనీ' మీద ప్రేమ లేదని చెప్పింది. 'రేడియం' మానవాళికి ఉపయోగపడాలని, దానిపై ఎవ్వరికీ హక్కు ఉండరాదనీ ప్రకటించి మాడమ్ క్యూరీ మహనీయుల జాబితాలో చేరిపోయింది.

ఎక్స్‌రే కనుగొన్న శాస్త్రవేత్త కూడా ఈ కోవలోని వ్యక్తే. 1895 లో ఎక్స్‌రేని కనుగొని ఓ విప్లవం సృష్టించిన శాస్త్రవేత్త పేరు విల్ హెల్మ్ కొనార్ట్ రానట్జెన్. ఈయన జర్మన్ దేశపు భౌతిక శాస్త్రవేత్త. తాను కనుగొన్న ఎక్స్‌రే కి సంబంధించి హక్కుల కోసం దరఖాస్తు పెట్టడం కానీ తద్వారా ఆర్థికపరమైన లాభం పొందాలనిగానీ విల్ హెల్మ్ అనుకోలేదు. కొంతమంది ఆయన దగ్గర ఈ ప్రస్తావన తీసుకు వచ్చినా ఆయన సున్నితంగానే తిరస్కరించారు. నోబెల్ బహుమతి పొందినా దుర్భర పేదరికంలోనే ఆయన కన్ను మూశారు.

భారతదేశానికి చెందిన ప్రముఖ వృక్షశాస్త్రవేత్త జగదీశ్ చంద్ర బోస్ కూడా తాను కనిపెట్టిన అంశాలకు సంబంధించిన ఎలాంటి పేటెంట్ హక్కునూ కోరలేదు.

ఓ ప్రముఖ శాస్త్రవేత్త అప్పుల పాలైన సంగతి తెలుసుకుంటే అయ్యో అనిపించక పోదు. అమెరికాకు చెందిన ఆ శాస్త్రవేత్త పేరు ఛార్లెస్ గుడ్‌యియర్. వల్కనైజ్ రబ్బర్‌ను కనుగొన్న ఛార్లెస్ పుణ్యమా అని పారిశ్రామిక వేత్తలెందరో కోట్లు గడించారు. కానీ ఛార్లెస్ మాత్రం అప్పులతో జైలు పాలయ్యాడు.




నాటి శాస్త్రవేత్తలు మానవాళి సంక్షేమమే ముఖ్యమని భావించారు,కానీ డబ్బు గురించి ఆలోచించలేదు. మరి నేడు?

✤

# చతుర

సంపుటి: 25 సంచిక: 7 ఆగస్ట్: 2002 295వ సంచిక

ఆమె ఒక మహావృక్షంలాంటిది.

మైళ్ళుమైళ్ళు మండుటెండలో నడిచిన బాటసారిని సేదదీర్చి, స్వాంతననిచ్చే దట్టమైన వృక్షచ్ఛాయలా... జీవనపథంలో ఎదురు దెబ్బలు తిన్న ఎందరో దుఃఖిత, పీడిత స్త్రీలను వెన్నుతట్టి ప్రోత్సహించిన దయామయి... ధీశాలి.

అలాంటి మహావృక్షం ఒక మామూలు తుపానుకి తట్టుకోలేక కదిలి, కలత చెందిన తరుణంలో... ఏం జరిగింది?

ఒక డాక్టరుగా, స్త్రీగా, ముఖ్యంగా మానవతా వాదిగా... విశిష్ట వ్యక్తిత్వంతో అలరారిన ఆమె జీవితంలో... సంచలనం సృష్టించిన... శక్తి ఎలాంటిది?

చివరికి ఆమె జీవితం ఏ మలుపు తిరిగింది? ఆసక్తికరంగా చదివించే

అత్తలూరి విజయలక్ష్మి రచన

## 'మహావృక్షం'

ఈ నెల చతుర

సమగ్ర నవల



త్రి పది గంటలు కావస్తోంది.

ఉస్మానియా జనరల్ హాస్పిటల్, కులీకుతుబ్‌షా భవంతిలోని కార్డియాలజీ వార్డ్‌లోంచి బైటికి వచ్చింది డాక్టర్ అనూష.

కారిడార్‌లోంచి హుందాగా నడుచుకుంటూ, కిందికి దిగి, ఆవరణలోంచి నడిచి తన కారు పార్క్ చేసిన చోటుకి వచ్చింది.

బ్యాగ్‌లోంచి కారు తాళంచెవులు తీస్తుండగా గుర్తొచ్చింది డాక్టర్ వసుధని ఇంటి దగ్గర డ్రాప్ చేయాలన్న సంగతి. కారు స్టార్ట్ చేసి, కుడిచేతి వైపుగా తిప్పి, ముందుకు పోనిచ్చింది. కొన్ని క్షణాల్లో హాస్పిటల్ మరో గేటులోకి కారు దూసుకు వెళ్లింది.

అనూష కారు పోర్టికోలో ఆపి, దిగి నడుచుకుంటూ టెలిఫోన్ ఎక్స్ఛేంజి ఎదురుగా ఉన్న ద్వారంలోంచి లోపలికి నడిచింది.

ఓ పక్క మేల్ జనరల్ వార్డు, మరోపక్క ఫీమేల్ జనరల్ వార్డు.... నవాబుల కళా హృదయాన్ని చాటి చెపుతోన్న ఎత్తయిన కట్టడం. సున్నపురాయితో నిర్మించబడిన బలిష్టమయిన నిర్మాణం. రెండుపక్కలా పైన గోడలకి తగలించిన హాస్పిటల్ నిర్మాతలైన నవాబుల నిలువెత్తు చిత్రాలు.

అనూష ఫీమేల్ వార్డు వైపు నడిచింది. కొందరు పేషెంట్స్ నిద్ర పోతున్నారు. కొంచెం ఓపిక ఉన్నవాళ్లు వాళ్ల బంధువులతోనూ, డ్యూటీ నర్సులతోనూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

అనూష వసుధ గదివైపు నడిచింది.

అప్పుడే బ్యాగ్ సర్దుకుంటూన్న వసుధ ఆమెను చూడగానే చిరునవ్వుతో విష్ చేసింది.

“రెడీయా? వెడదామా?” అడిగింది అనూష.

“అల్లాగే” ఇద్దరూ కలిసి బయటికి వచ్చారు.

కారు ధగ్గరికి సమీపిస్తుండగా అంది వసుధ “నాకిప్పుడు అలవాటైపోయింది మేడమ్! భయం లేదు. వంటరిగా వెళ్లిపోగలను. మీకింక శ్రమ ఇవ్వడం భావ్యం కాదు గదా!”

“మంచిదేగా. వెళ్లగలగాలి, కానీ ఇప్పుడు కాదు. వెహికిల్ కొనుక్కున్నాక అలాగే వెళుదువుగాని” కారులో కూర్చుని డోర్ వేయబోతూండగా వినిపించింది వార్డులోంచి హృదయవిదారకమైన ఏడుపు.

పేషెంటు ఎవరికో కాలం చెల్లింది.

ఒక్కక్షణం ఇద్దరూ చలనం లేనట్టు ఆగిపోయారు.

గాలికి ఊగుతున్న పొడవాటి అశోక చెట్లు, గుడ్డిగా వెలుగుతూన్న విద్యుద్దీపాలు, నిశ్శబ్దంగా ఉన్న వాతావరణం.... ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ గుండెల్ని మెలికతిప్పేలా ఏడుపు....

“మేల్ వార్డులో ఒకతను సాయంత్రం సీరియస్‌గా ఉన్నాడు. డాక్టర్ ఛటర్జీ కేసు. బహుశా అతనే పోయుంటాడు” కొంచెం భయం ధ్వనిస్తూన్న స్వరంతో చెప్పింది వసుధ.

ఆ అమ్మాయి మొహంలో కనిపిస్తోన్న భయం చూసిన అనూషకి జాలేసింది. ఇంకా మృత్యువును చూడ్డానికి అలవాటు పడని కొత్త డాక్టర్. చిన్న పిల్ల.... ఇలాంటివి తన అనుభవంలో ఎన్నో... నెమ్మదిగా ఆమె భుజం మీద చేయి వేసి “టేకిటీజీ” అంది.

వసుధ డోర్ వేసింది. కారు స్టార్ట్ చేసింది అనూష.

చావుపుట్టుకలు ఎంత సహజమైనా బతుకుకోసం పడే తపన, ఆరాటం ముందు మరణాన్ని తేలికగా జీర్ణించుకోగల ధైర్యం ఎంతమందికుంటుంది?

కారు మెయిన్‌రోడ్‌మీదకి వచ్చింది. సిద్దంబర్‌బజార్ మీదుగా నాంపల్లివైపు తిరిగింది.

ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు. ఎవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు.

అనూష వృత్తిపట్ల చాలా అంకితభావం

గల డాక్టరు. డబ్బుకోసం మానవత్వాన్ని కూడా మర్చిపోయి, పవిత్రమైన వైద్యవృత్తిని కమర్షియల్ చేస్తున్న డాక్టర్లున్న ప్రస్తుత సమాజంలో అనూషలాంటివాళ్ళు చాలా అరుదు. ఉస్మానియా మెడికల్ కాలేజీలో విజిటింగ్ ఫేకల్టీగా, హాస్పిటల్‌లో మంచి కార్డియాలజిస్టుగా అటు విద్యార్థుల దగ్గరా, ఇటు సీనియర్ డాక్టర్స్ దగ్గరా మంచి పేరు సంపాదించింది. రోగుల సంగతైతే చెప్పక్క ర్లేదు. ఆమె ఒక దేవత. స్టూడెంట్స్‌క్కూడా వైద్యవృత్తిలో ఉన్న పవిత్రతని గురించి వివ రిస్తూ, డాక్టర్లు వృత్తిపట్ల అంకితభావం కలిగి ఉండాలని చెప్తుంది. అందుకే ఆమె అంటే అప్పుడే వైద్యవృత్తిలోకి వస్తున్న డాక్ట ర్లకి ఎంతో గౌరవం, అభిమానం. అప్పుడ ప్పుడే వికసిస్తోన్న మొగ్గలు. కాబట్టి వాళ్ళ నింకా డబ్బు అనే వైరస్ అంటలేదు.

అలాంటివాళ్ళ కోవకు చెందిందే డాక్టరు వసుధ. చిన్నప్పటినుంచీ తెలిసినవాళ్ళ అమ్మాయి వసుధ. అనూష గైడెన్స్‌లోనే రెండేళ్ళక్రితం హౌస్‌సర్జన్సీ పూర్తిచేసింది. ఆ హాస్పిటల్లో ఉద్యోగం లభించి ఐదారు నెల లవుతోంది. తల్లీ, తండ్రీలేని వసుధ పెద నాన్న దగ్గర ఉండి చదువుకుంది. అతను చాదస్తుడవడంచేత వసుధని నైట్ డ్యూటీ లకి పంపించడానికి ఇష్టపడలేదు.

ఉద్యోగం అన్నాక ఏ డ్యూటీ అయినా చేయాలి. 'వసుధకి కాస్త అలవాటు అయ్యే దాకా నేనొచ్చి దిగబెడతాను' అని 'అనూష ప్రామిస్ చేయడంతో ఆయన కొద్దిగా సంతృ ప్తిపడ్డాడు.

ధైర్యం, సాహసం ఊపిరిగా బతికే అనూష తోడు వసుధకి ఎంతో స్ఫూర్తిని స్తుంది.

అనూష తన బాధ్యతనీ, కర్తవ్యాన్నీ ఎట్టి పరిస్థితుల్లోనూ మర్చిపోదు. తిండి తినడం అయినా మర్చిపోతుంది కానీ... బాధ్యత మర్చిపోదు. ఒకరికి సాయం చేయడం కూడా తన బాధ్యత అనే అనుకుంటుంది. ఎంత రాత్రి అయినా తన పేషెంట్స్ అంద రినీ పేరుపేరునా పలకరించిగానీ ఇంటికి వెళ్ళదు.

చెదరని చిరునవ్వు, కరుణ నిండిన కళ్ళు ఆభరణాలుగా నిరాడంబరంగా, హుందాగా ఉండే అనూషకోసం పేషెంట్లు కూడా ఎదు రుచూస్తుంటారు.

కారు ఆదర్శనగర్ సమీపించింది. ఓ మేడముందు కారాపింది. వసుధ డోర్ తీసు కుని దిగి, "థాంక్యూ మేడమ్... గుడ్‌నైట్" అంది.

"గుడ్‌నైట్" అని అనూష కారు స్టార్ట్ చేసింది. సెక్రటేరియట్ ముందునుంచి, లుంబినీపార్క్ మీదుగా కారును పోని స్తోంది.

అడపాదడపా కార్లు, స్కూటర్లు రయ్యిన దూసుకుపోతున్నాయి. కుడిపక్క విద్యుద్దీ పాల కాంతిలో మెరిసిపోతోన్న హుసేన్‌సా గర్, ఎడంపక్క అందంగా నగిషీలు దిద్దు కుంటున్న ఎన్టీఆర్ ఘాట్‌ని పరికిస్తూ నింపాదిగా డ్రైవ్ చేయసాగింది.

ట్యాంక్‌బండ్‌ని పర్యాటక కేంద్రంగా, అందంగా తీర్చిదిద్దిన ఎన్టీఆర్‌కి మనసులోనే అంజలి ఘటించింది.

కారు నెక్లెస్ రోడ్డువైపు తిప్పింది. కొత్త సంవత్సరానికి స్వాగతం చెప్పడానికి, పెళ్ళి కూతురిలా ముస్తాబు చేసుకున్న ఆ రోడ్డు ఇంకా పెళ్లికూతురులాగే కళకళ్లాడుతోంది. అక్కడక్కడా యువజంటలు ప్రపంచాన్ని మరిచిపోయి, హత్తుకుని కూర్చున్నారు. కొన్ని కార్లు మెల్లిగా తిరుగుప్రయాణం మొదలుపెట్టాయి.

రోడ్డుకి ఎడంపక్క గుబురుగా పెరిగిన పిచ్చిచెట్ల వెనకాల రైలుపట్టాలు. ఇంకా ఈ రోడ్డులో తగినంత సెక్యూరిటీ అరేంజ్ మెంట్లు ఎందుకు చేయలేదో అనుకుంది. ఈ పిల్లలంతా ఇంత రాత్రివేళ ఇలా తిరుగుతు న్నారంటే దీనిని నాగరికత అనాలా? విచ్చ లవిడితనం అనాలా? అని నిట్టూర్చింది.

## సచిత్ర విచిత్రం







# మరో మయూరి

జెన్నిఫర్ బ్రికర్‌కి పుట్టుకతోనే కాళ్ళులేవు. 2 అడుగుల, 4 అంగుళాల ఎత్తుండే 11 ఏళ్ళ జెన్నిఫర్ కాళ్ళున్న వాళ్ళుకూడా చెయ్యలేని అద్భుత విన్యాసాలు చేస్తుంది. స్కేటింగ్ బెర్డ్‌లని అమర్చుకుని చక్కగా నేలమీద, ఐస్‌మీద స్కేటింగ్ చేస్తుంది. స్విమ్మింగ్‌పూల్‌లోకి బోర్డ్‌మీంచి దూకి నీళ్లల్లో కొద్దిసేపు ఈదులాడుతుంది. ఈమె కోసం ప్రత్యేకంగా తయారుచేసిన కారుని డ్రైవ్ చేస్తుంది. పరుగు పందెంలో తలకిందులుగా చేతులతో పరుగెత్తి కాళ్ళున్న వారినే ఓడిస్తుంది.

తనకీ అందరిలా కాళ్ళుండి వుంటే ఇన్ని ఘనకార్యాలు సాధించేదాన్ని కాదని, తన అవసరం తనలో రేపిన కసితో ఇవన్నీ నేర్చుకుని చేస్తున్నాననీ అంటుంది ఆస్ట్రేలియాకు చెందిన జెన్నిఫర్.

కాస్సేపు కారాపి ఆమెకి కూడా అక్కడ కూర్చోవాలనిపించింది. ఓ పక్కగా కారాపి, లాక్ చేయబోతుండగా వినిపించింది ఏదో శబ్దం. ఉలిక్కిపడింది. ఏవిటా శబ్దం? పిచ్చి చెట్ల మధ్యలోంచి వస్తోంది. కొంచెం జాగ్రత్తగా వింది. అది పసిపిల్ల ఏడుపులా అనిపించింది. మళ్ళీ చెవులు రిక్కించి వింది పసిపిల్ల ఏడుపే, సందేహంలేదు.

అనూష కారుదిగి అటువైపుకి నడిచింది. ఏడుపు వినిపిస్తోన్నవైపు అయిదారడుగులు వేసింది. కాళ్ళకేదో మెత్తగా తగిలింది. చటుక్కున కాలు వెనక్కి తీసుకుని తల వంచి కిందకు చూసింది. పసిబిడ్డ...

మై గాడ్! మతిపోయినట్టుగా అనిపించింది. చలికి వణుకుతూ సన్నగా ఏడుస్తోంది బిడ్డ.

ఇంకా కళ్ళు కూడా తెరవని పసిగుడ్డు. ఎవరీ రాక్షసులు? ఇంత నిర్దాక్షిణ్యంగా వదిలి ఎలా వెళ్ళారు? ఈమధ్య చెత్తకుండీలో పసిబిడ్డ, రోడ్డుపక్కన పసిబిడ్డ, డ్రైనేజి పైపుల్లో పసిపిల్లల శవాలు ఇలాంటి వార్తలు విపరీతం అయిపోయాయి. విచ్చలవిడిగా తిరగడం, కాలుజారడం, ఎంత ఆధునికత పెరిగినా ప్రకృతితో సవాలు చేయలేరుకదా. ఫలితంగా ఇలాంటి దారుణాలు చేయడం. అనూషకి ఆ క్షణంలో ఆ పసిబిడ్డని అక్కడ వదిలివెళ్ళిన వాళ్ళమీద విపరీతమైన కోపం వచ్చింది. వంగి బిడ్డని అందుకుంది. వెచ్చగా ఆమె గుండె మధ్యకి చేరిన బిడ్డ చటుక్కున ఏడుపు ఆపేసింది.

అనూష బిడ్డకి సంబంధించిన వాళ్ళెవరన్నా కనిపిస్తారేమోనని చుట్టూచూసింది. దగ్గర్లో ఎవరూలేరు. అందరూ కూడా పచ్చికమీద కూర్చుని హుస్సేన్‌సాగర్‌వైపు చూస్తూ కబుర్లతో చుట్టుపక్కల పరిసరాలను పట్టించుకోవడంలేదు. తను ఎత్తుకుని పారిపోతోందని ఎవరైనా వస్తే! అనూష ఐదు నిమిషాలు అక్కడే నిలబడిపోయింది. ఎవరూ కనిపించలేదు. ఆమెనెవరూ గమనించలేదు. ఎవరిగోల వారిదే అన్నట్టుగా తిరుగుతున్నారు. నెమ్మదిగా వెనక్కి తిరిగింది. అప్పుడు వినిపించింది కాళ్ళకింద నలిగిన ఎండుటాకుల శబ్దం. గిరుక్కున మళ్ళీ చెట్లవైపు తిరిగింది. శబ్దం ఆగిపోయింది. అనూషకి కొద్దిగా భయం కలుగుతున్నా కంట్రోల్ చేసుకుంటూ ఎవరక్కడ? అంది గట్టిగా.

సన్నగా వెక్కిళ్ళ శబ్దం వినిపించింది. అనూష ఆలస్యం చేయకుండా ముందుకు అడుగేసింది. మళ్ళీ ఎండుటాకుల శబ్దం వినిపించింది. ఈసారెవరో పరుగెడుతున్నట్టుగా పాదాల చప్పుడు, అనూష కొంచెం వేగంగా నడిచి, శబ్దం వచ్చినవైపు తిరిగింది ఒకే ఒక్క క్షణం... ఆ క్షణం అనూషది కాకపోయి ఉంటే ఆ అమ్మాయి పారిపోయి ఉండేది. గాలికి ఎగిరిన ఆమె చీరచెంగు పట్టుకుంది. ఆ అమ్మాయి చివ్వున వెనక్కి తిరిగి, నీరసంగా అంది "ప్లీజ్ వదలండి నన్ను... మీకు దణ్ణం పెడతాను"

అనూష వదల్లేదు. ఆ చీరచెంగు అలాగే పట్టుకుని, ఆమె దగ్గరగా నడిచి చేయిపట్టుకుంది. "ఎవరు నువ్వు? ఏం చేస్తున్నావిక్కడ? "

ఆమె మాట్లాడలేదు. ఏడవసాగింది. అనూష ఇంక తాత్సారం చేయకుండా అంది "రా నాతో ఊ త్వరగా"

ఆమె కదలలేదు. అనూష చేయిపట్టి లాగింది. అప్పటికే బాగా అలసిపోయి ఉన్నట్టున్న ఆమె చటుక్కున తూలింది. అనూష గట్టిగా పట్టుకుని, చేయిపట్టి లాక్కొచ్చినట్టే గబగబా కారు దగ్గరకి వచ్చి డోర్ తీసి ఆమెని సీటుమీదకి తోసింది. బిడ్డని ఆమె ఒడిలో పడుకోబెట్టి, డోర్ వేసేసింది. స్టీరింగ్ దగ్గర కూర్చుని ఒక్క ఉదుటున కారు స్టార్టు చేసింది. కారు విమానాశ్రయం వెనకవైపు ఉన్న ఓ కాలనీలో ఉన్న బిల్డింగు ముందు ఆగింది.

అప్పటిదాకా అనూష ఏమీ మాట్లాడ

లేదు. కారు శబ్దం విన్న వాచ్‌మేన్ పరుగెత్తుకొచ్చి గేటు తీశాడు. కారు గేటులోపలికి తీసుకెళ్ళి ఆపింది. వాచ్‌మేన్ ఇంటి తలుపు తాళం తీశాడు. బైట వరండాలో, హాల్లో లైట్లు వేశాడు. అనూష ఆ అమ్మాయి భుజంమీద చేయివేసి "దిగు" అంది. ఆమె పలకలేదు. ఆమె భుజం పట్టి కుదిపింది. అయినా సమాధానం లేకపోవడంతో పల్స్ చూసింది. ఆమె బాగా అలసిపోయినట్టుంది. దాదాపు స్పృహ తప్పినట్టు ఉంది. కళ్ళు మూసుకుంది కానీ పూర్తిగా అపస్మారకంలో లేదు. మాట్లాడడానికి, లేవడానికి శక్తి లేనిదానిలా సీటులో వెనక్కివాలి పడుకుంది. ఆమె చేతులు మాత్రం ఒళ్ళో ఉన్న బిడ్డమీద ఆప్యాయంగా చుట్టుకుని ఉన్నాయి.

అనూష వాచ్‌మేన్‌ని పిలిచి సాయంపట్టమని ఆమెని, బిడ్డనీ తీసుకొచ్చి బెడ్‌రూమ్ వైపు నడిచింది. పాపని పడుకోబెట్టి ఆమెని కూడా మంచంమీదకి చేరుస్తూ చూసింది. ఆమె చీర పూర్తిగా పాడైపోయి ఉంది. ఆమెకి విషయం అర్థమైంది. వాచ్‌మేన్‌ని కారు పోర్టికోలో పెట్టమని చెప్పి పంపించేసింది. ఆ అమ్మాయిని బలవంతంగా లేపి, చీర మార్చింది. పల్స్‌చూసి అప్పటికప్పుడు ఇవ్వాల్సిన మందులు తన కిట్‌లోంచి తీసింది. ఆమెని మంచంమీద పడుకోబెట్టి కిచెన్‌లోకి వెళ్ళి పాలు వెచ్చబెట్టి తీసుకొచ్చింది. మళ్ళీ లేపి మందులు వేసి, పాలు తాగించింది. పాలు పూర్తిగా తాగకుండానే ఆమె తిరిగి మంచంమీద వాలిపోయింది.

ఆమెని సరిగా పడుకోబెట్టి, దుప్పటికప్పి, లైటార్పి, బెడ్‌లైట్ వేసి, తలుపువేసి తన బెడ్‌రూంవైపు వెళ్ళింది.

పావుగంటలో ఫ్రెషప్ అయి డైనింగ్ టేబిల్ దగ్గరకి నడుస్తూ గోడగడియారం వైపు చూసింది. పదకొండున్నర అయింది.

పదకొండులోపల డిన్నర్‌చేసి ఎంతకాలమైంది? ఇంకో అరగంట దాటితే రోజు గడిచినట్లే. డైనింగ్‌టేబిల్ మీద డిష్‌లు మూతలు తీసి చూసింది. చపాతీలు, ఆకుకూరతో కూర, పెరుగుపచ్చడి ఉన్నాయి. బాగా ఆకలిగా వుంది. ఒక్క చపాతీ తిని, మళ్ళీ అన్నిటిమీదా మూతలుపెట్టి లైటార్పి తన గదిలోకి వెళ్ళిపోయింది.

పెళ్ళికాని తల్లి... డెలివరీ అయి బహుశా ఇరవైనాలుగ్గంటలన్నా అయిందోలేదో అనిపిస్తోంది వాలకం చూస్తోంటే... పిల్లని పొదల్లో వదిలేస్తే ఎవరన్నా తీసుకెడతారనుకుందా? ఆ పొదల్లోంచి ఏ పామో, విష జంతువో వచ్చి ఉంటే ఒక్కసారిగా ఆమె ఒళ్ళు జలదరించింది. ఎంత ధైర్యం ఈ అమ్మాయికి, పిల్లని వదిలేసి, పక్కన నుంచుని ఏం జరుగుతుందో గమనిస్తున్నట్లుంది. ఆ బిడ్డని తను ఎత్తుకోగానే వెళ్ళిపోవడానికి ప్రయత్నించి పట్టుబడింది. వెళ్ళి ఏం చేయాలనుకుంది? చచ్చిపోదామనుకుందా? ధైర్యంలేనివాళ్ళు తప్పుడు పనులెందుకు చేస్తారు? ఈమె ఒక్కతే వచ్చిందా? ఈమెకి సంబంధించిన వాళ్ళెవరన్నా కూడా అక్కడికి వచ్చి ఉంటారా? వచ్చి ఉంటే తను వీళ్ళిద్దరినీ తీసుకొస్తుంటే ఊరుకుంటారా? తెల్లవారాక వీళ్ళని ఏం చేయాలి? ఆమె కదిలే పరిస్థితిలోలేదు. అసలు కదిలించకూడదు. ఆమె తెగింపు ఇక్కడిదాకా తీసుకొచ్చింది కానీ, డెలివరీ అయి రెండురోజులు కూడా కాకుండా ఇలా నడవడం, పరుగెత్తడం, చలిలో... బాప్‌రే..., దీని పర్యవసానం ఏమిటో? తెల్లవారితే తనముందు చాలా కాలానికి మరో సమస్య. అనూష ఆలోచిస్తూ పడుకుండిపోయింది. చాలాసేపటికిగానీ నిద్రపట్టలేదు.

ఫోన్ గణగణ మోగుతోంటే మెలకువ వచ్చింది అనూషకి. అప్పటికి ఆరుగంటలైంది.

బలవంతంగా లేచి, ఫోన్ దగ్గరకి వెళ్ళి రిసీవర్ ఎత్తి, "హలో అనూష హియర్" అంది బద్ధకంగా.





"హలో అనూ! నేను మణిని" అవతలి నుంచి మణి స్వరం కంగారుగా వినిపించింది.

అనూష బద్ధకం వదిలిపోయింది. "హలో మణీ! ఏంటి? ఈ వేళప్పుడు. అప్పుడే తెల్లారిందా? "

"తెల్లవారటంకాదు కొంపలంటుకున్నాయి" ఆందోళనగా అంది మణి.

"ఏం జరిగింది? "

"నువ్వివాళ పేపర్ చూడలేదా? "

"ఏం పేపర్? "

"న్యూస్ పేపరు. ప్రభుత్వ ప్రసూతి ఆసుపత్రినుంచి ఓ తల్లి శిశువుతో సహా పరారీ" మణి హెడ్డింగ్ చదివి వినిపించింది.

"ఎప్పుడు? " అనూష సాలోచనగా అడిగింది.

"ఎప్పుడేంటి? నా తలకాయ... నిన్న సాయంత్రం ఎప్పుడు పారిపోయిందో, ఆ హాస్పిటల్ మాదే. నా ఖర్మగాలి ఆ పేషెంట్ నా పేషెంటే. డెలివరీ అయి నలభై గంటలు ఇప్పటికి. నా ఉద్యోగం ఇంతటితో సరి... మా చీఫ్ నాకు ప్రత్యేకంగా అంటగట్టిన కేసది. నాకు భయంగా వుంది అనూ. ఇంకాసేపట్లో మా చీఫ్ ఫోన్ చేస్తాడు. నా మొహం వాచేలా చివాట్లు పెడతాడు. నా ఉద్యోగం పీకేస్తాడు. బుద్ధి తక్కువై, నిన్న సంజయ్ వాళ్ళ మ్యారేజ్ డే అని పార్టీ ఇస్తే వెళ్ళాను"

"మణీ! కంగారుపడకు. విషయం కొంచెం వివరంగా చెప్పు. పేషెంట్ ఎవరు? ఆమె తాలూకు మనుషులెవరూ లేరా? ఐ మీన్ ఆమె తల్లి, భర్త"

"భర్తా... పాడా? కాలుజారిన బాపతు. తల్లి కూడా లేదు. ఎవరో ఇద్దరు మగవాళ్ళు తీసుకొచ్చి అడ్మిట్ చేశారు రెండురోజుల క్రితం. వాళ్ళెవరో బాగా కలిగినవాళ్ళనుకుంటా. రాజకీయవర్గంలో మంచి పలుకుబడి ఉన్నవాళ్ళలా కూడా ఉన్నారు. డైరెక్టుగా మా చీఫ్‌ని కలిసి 'పేషెంటు జాగ్రత్త... మేం తిరిగి వచ్చేదాకా డిశ్చార్జ్ చేయద్దు. ఆమెని మీ కస్టడీలో వదిలేసి వెళ్తున్నాం' అని చెప్పారు. ఆయన వాళ్ళ ఎదురుగానే నన్ను పిలిచి ఆ పిల్లని నాకు అప్పగించి 'జాగ్రత్త, జాగ్రత్త' అంటూ పాటపాడాడు. ఇంకో విషయం తెలుసా? " స్వరం తగ్గించి చెప్పింది మణి. "పుట్టిన పిల్ల ఎవరైనా సరే అనాథ శరణాలయంలో ఇచ్చేయమన్నారట. ఆ ప్రయత్నాలేవో వాళ్ళే చేసుకుంటారులే అని ఊరుకున్నాం. తీరా ఇదిగో ఇలా ఆమె పారిపోయింది"

"ఆ అమ్మాయి ఎలా ఉంటుంది? " అడిగింది అనూష.

"సన్నగా, తెల్లగా, కొంచెం పొట్టిగా, వయసు ఇరవైలోపే ఉండచ్చు, పెద్దకళ్ళు"

"పుట్టింది పాపా, బాబా? "

"బాబే"

"పేరేంటి? "

"నీరజ"

"నువ్వేం కంగారుపడకు. నీ పేషెంటు నా దగ్గరే వుంది"

"వాట్? " గట్టిగా కేకపెట్టింది మణి. "నీ దగ్గర ఉందా? ఎలా వచ్చింది? " అనడిగింది.

"అంతా వివరంగా చెపుతాను. నువ్వు వెంటనే మన ఆశ్రమానికి వచ్చేయ్. నేను కూడా ఆమెని తీసుకుని అక్కడికే బయలుదేరతాను"

"ఆశ్రమానికి ఎందుకు? నాకప్పగించెయ్. వాళ్ళవాళ్ళు ఇవాళో రేపో వచ్చేస్తారు"

"వాళ్ళు ఆమెకి ఏమవుతారో తెలుసా? "

"మేనమామ అని ఏదో చెప్పాడు"

"వచ్చినవాళ్ళు ఆమె శ్రేయోభిలాషులైతే ఆ అమ్మాయి ఎందుకు పారిపోతుంది? డెలివరీ అయి ఇరవైనాలుగ్గంటలు కూడా కాకుండా ఆమె పిల్లాడిని తీసుకుని పారిపోయిందంటే సిట్యుయేషన్ ఎంత భరించరానిదై ఉంటుందో ఊహించు. ఇలాంటి స్థితిలో ఆమెని వాళ్ళెవరికో అప్పగించడం

ఒక డాక్టరుగానే కాదు, సోషల్ వర్కర్‌గా కూడా నాకు ఇష్టంలేదు. అది ధర్మం కూడా కాదు. ప్రస్తుతానికి ఆశ్రమానికి తీసుకెడదాం. తరువాత ఇద్దరం వెళ్ళి మీ చీఫ్‌తో మాట్లాడదాం. అవసరాన్ని బట్టి పేపర్‌వాళ్ళతో కూడా మాట్లాడదాం. నీ ఉద్యోగానికికానీ, నీక్కానీ ఏ భయంలేదు. ఎవరొచ్చినా, ఎవరు ప్రశ్నించినా నా పేరు చెప్పు ఓ.కే..."

"అంతేనా, అనవసరంగా రిస్కు తీసుకుంటున్నావేమో. ఆ అమ్మాయి ఎందుకు పారిపోయిందో! వాళ్ళకీ వాళ్ళకీ ఉన్న గొడవ లేంటో తెలీకుండా ఎందుకు?"

"మణీ! జీవితంలో అనేకరకాల అనుభవాలను, అనేక రకాల జీవితాలను చూసిన దాన్ని. నాకు తెలీదా ఎవరు ఏ పరిస్థితుల్లో ఎలా ప్రవర్తిస్తారో? నువ్వన్నట్లు ఆ అమ్మాయిదే తప్పు అయితే నచ్చచెప్పి పంపించేద్దాం. అంతేగానీ విపత్కర పరిస్థితుల్లో నాకు తారసపడిన ఆమెనలా వదిలేయడం నా ఆదర్శానికే విరుద్ధంకాదా?"

"అవుననుకో. కానీ..."

"నో కానీ... నథింగ్... నువ్వు రెడీ అవు. ఈలోగా మీ చీఫ్ ఫోన్ చేస్తే ఆమెని నేను తీసుకెళ్ళానని చెప్పు. తరువాత వచ్చి పర్సనల్‌గా మాట్లాడతానని చెప్పు. ఫరవా లేదు. ఆయన చాలా మంచివారు. పెద్దవారు. అర్థం చేసుకుంటారు. నా ఉద్దేశం ఆయనకీపాటికి సిట్యుయేషన్ అర్థమయ్యే ఉంటుంది. కాకపోతే... బలీయమైన కారణం ఏదో ఆయనని భయపెడుతోందనుకుంటా నువ్వు చెప్పిన విషయం వింటుంటే. ఎనీవే నువ్వు మాత్రం ఆశ్రమానికి వచ్చేయ్. మీ ఇంటికి దగ్గరగానే ఉంది ఆశ్రమం"

"ఓ.కే... నువ్వు చెప్పాక కాదని ఎలా అంటాను? ఉంటానుమరి"

"అలాగే, ఆ చూడు. ఆ అమ్మాయికి ప్రస్తుతం వాడాల్సిన మందులు తీసుకునిరా"

"ఓ.కే." అని మణి రిసీవర్ పెట్టేసింది.

కాస్సేపలాగే సోఫాలో కూర్చుండిపోయింది ఆలోచిస్తూ. ఆ అమ్మాయి పేరు తెలుసుకుంటే మణి పేషెంటు ఈమె అని కన్‌ఫర్మ్ అవుతుంది. సోఫాలోంచి లేచి, ఆమె పడుకున్న గది దగ్గరకి వెళ్ళి తలుపు తోసింది. గాఢంగా నిద్రపోతోందామ్మాయి. పక్కనే దుప్పటిలో బాబు తెల్లగా ఉన్నాడు. గుప్పిళ్ళు మూసుకుని, కళ్ళు మూసుకుని ఉన్నవాడినలాగే తదేకంగా చూస్తూ నిలబడిపోయింది అనూష.

దైవానికి మారురూపాలంటారు పసిపిల్లలు. లేత గులాబీల్లా ముద్దొచ్చే పిల్లల్ని నిర్దాక్షిణ్యంగా చెత్తకుండీల్లో, డ్రైనేజీపైపుల్లో ఎలా వదిలేస్తారు? ఈమధ్య భర్తమీద కోపంతో పిల్లల్ని కాల్చిచంపిన తల్లి వార్త చదివింది పేపర్లో. ఎలా చేస్తారీ దారుణాలు? మనిషి ఒక్కోదశలో మృగంలా మారతాడంటారు. అలా మృగంలా మారిన దశలో జరిగే దారుణాలా ఇవి?

ఆమె ఇంక ఆలోచించలేకపోయింది.

అక్కడినుంచి కదిలి తన గదిలోకి వెళ్లిపోయింది. అరగంటలో కాలకృత్యాలు, స్నానం వగైరా ముగించి వచ్చేటప్పటికి వంటమనిషి భారతమ్మ వచ్చి దోసెలు వేస్తోంది.

ఆమెను చూడగానే "భారతమ్మగారూ! ఇంట్లో ఓ పసిపిల్లాడు, ఓ బాలింతరాలూ ఉన్నారు. నేను వాళ్లని తీసుకుని ఆశ్రమానికి వెళ్లాలి. ఆమెకి ఇవ్వాల్సిన ఆహారం ఏమిటో మీకు తెలుసు కదా. ఆ ప్రయత్నాలు చేయండి" అని చెప్పింది.

"ఎవరమ్మా? బంధువులా?" అని అడిగింది భారతమ్మ.

"నాకు ఈ ప్రపంచంలో అందరూ బంధువులే కదండీ" అంటూ నవ్వింది అనూష.

'అవునమ్మా? అభాగినులను ఆదుకోడానికి ఆ భగవంతుడు తనకు మారుగా పంపించిన దూతవి నువ్వు' అనుకుంది ఆవిడ మనసులో.




అనూష ఆ అమ్మాయిని నిద్రలేపే అవసరం లేకుండానే పసివాడు లేచి సన్నగా ఏడుపు మొదలుపెట్టాడు. ఆమె తుళ్లిపడి లేచింది. అనూష గబుక్కున లేవబోతూన్న ఆ అమ్మాయిని పట్టుకుని "నెమ్మదిగా లేచి కూర్చో వేణ్ణీళ్లు తెచ్చిస్తాను. మొహం కడుక్కో. బాబు సంగతి నేను చూస్తాను" అంటూ ఆమెను లేపి తలగడ వీపుకింద పెట్టి మంచంమీద వెనక్కి జారగిల కూర్చో పెట్టింది. బాబు పక్కబట్టలు మార్చి వాడిని ఎత్తుకుంది.

భారతమ్మ వేడినీళ్ళు తీసుకొచ్చి ఆమె మొహం కడిగించి, వేడి కాఫీ ఇచ్చింది.

కాఫీ తాగి గ్లాసు అందించిన ఆ అమ్మాయి మొహంలోకి చూస్తూ అడిగింది అనూష, "నీ పేరేంటి? "

కళ్ళు వాల్చుకుని నీరసంగా చెప్పింది "నీరజ"

"ఈ బాబు నీ బాబేనా? " కన్‌ఫర్మ్ చేసుకోడానికన్నట్టుగా అడిగింది.

తల ఊపింది నీరజ.

"సరే... భారతమ్మగారు బట్టలు మార్పిస్తారు. మార్చుకో. ఇదిగో ఈ చీరా, జాకెట్టూ తీసుకుని వేసుకో. తరువాత బాబుకి పాలివ్వు. మనం బైటకి వెళ్దాం"

"ఎక్కడికి? " భయంగా చూసింది.

"భయపడకు... నువ్వు సేఫ్‌గా ఉండేచోటికి" మృదువుగా చెప్పింది.

"ఏంభయంలేదు తల్లీ ఈ దేవత చేతుల్లో పడ్డాక" చెప్పింది భారతమ్మ.

అనూష బాబునెత్తుకుని హాల్లోకి వెళ్ళిపోయి, వేణ్ణీళ్ళలో గుడ్డ ముంచి వాడి ఒళ్ళంతా తుడిచింది. వాడి ఒంటిమీద ఉన్న జుబ్బానే మళ్ళీ తొడిగి, పాత బట్ట చింపి, లంగోటీలాగా కట్టింది.

అరగంట తరువాత అనూష, భారతమ్మ కలిసి నీరజని చెరోచేత్తో పట్టుకుని నడిపిస్తూ కారులో కూర్చోబెట్టారు. బాబుని వెచ్చగా బ్లాంకెట్‌లో చుట్టి, నీరజ ఒళ్ళో పడుకోబెట్టి, స్టీరింగ్ ముందు కూర్చుంది అనూష.



నగరానికి 30 కిలోమీటర్ల దూరంలో ప్రశాంతంగా ఉన్న ఓ విశాలమైన ప్రాంగణం... ఆ ప్రాంగణంలో ఓ పక్కగా ఉన్న తెల్లటి బిల్డింగు మంచులో తడిసిన బొండుమల్లె చెండులా వుంది. ప్రధాన ద్వారానికి పెద్దగేటు. ఆ గేటు తీసుకుని లోపలికి వెళ్ళగానే ఓ పక్క నుంచి కరచాలనం చేస్తూ రంగురంగుల గులాబీలు స్వాగతం చెబుతోంటే, మరోపక్కనుంచి చిరునవ్వులు చిందిస్తూ క్రోటన్స్ కుశలమడుగుతుంటాయి. ఆ ప్రాంగణంలో ఉన్న రకరకాల పెద్దచెట్లమీంచి గాలి సంగీతం పాడుతూ ఉంటుంది.

ముందుకి వెడితే కుడిపక్క బిల్డింగు బాధితులను ఆదుకొని అక్కున చేర్చుకోడానికి నేనున్నానన్నట్లు ఠీవిగా కనిపిస్తూ ఉంది. ఎడంపక్క పెద్దనీటిపంపు... కొంచె ఎడంగా రకరకాల కూరగాయల పాదులు, అవి దాటి వెళితే సన్నటి సందు బిల్డింగు వెనక భాగానికి తీసుకెళుతుంది. వెనకభాగంలో కూడా కరివేపాకు చెట్లు, జామచెట్లు, మరికొన్ని కూరగాయల పాదులున్నాయి. ఓ మూలకి

నీళ్ళకోసం కట్టిన సిమెంటు తొట్టి, దానిపక్క నుంచి నడిచివెళితే బిల్డింగ్‌కి మరోపక్క ద్వారం, కొంచెం ఎడంగా అయిదారు బాత్ రూములు, లావెట్రీలు, బట్టలు ఉతుక్కోడానికి వీలుగా సిమెంటుతో కట్టిన గచ్చు సంపు ఉన్నాయి.

పదేళ్ళ క్రితం తండ్రి తనకోసం కొన్న రెండువందల గజాల స్థలంలో రెండుగదులు వేసి, జీవితంలో దగాపడి ఆత్మహత్యలు చేసుకోబోయిన ఇద్దరు ఆడపిల్లలని కాపాడి, ఆ రెండుగదులు వాళ్ళకి నివాసంగా మలచింది అనూష.... ఆ ఇద్దరులో ఒకరు సుశీల.

మధ్యతరగతి కుటుంబంలో మూడో ఆడపిల్లగా పుట్టిన సుశీలని పదోతరగతి దాకా చదివించారు. కట్నం వద్దన్నారు కదాని ఒక బస్సు కండక్టరుకిచ్చి పెళ్ళిచేశాడు తండ్రి. పెళ్ళికాగానే విజయనగరంనుంచి భర్తతో కలిసి హైదరాబాద్ వచ్చింది సుశీల. సనత్ నగర్ బస్సు డిపోకి దగ్గరగా ఓ చిన్నగదిలో వాళ్ళ కాపురం ప్రారంభమైంది. రెండునెలలు గడిచాక రోజూ రాత్రిళ్ళు డ్యూటీ వుందని చెబుతూ ఇంటికి రావడం మానేశాడు భర్త.

అమాయకురాలైన సుశీల అతని మాటలు నమ్మి, అతను ఇంటికి ఎప్పుడు వస్తే అప్పుడే మహాభాగ్యంగా భావించి సేవలు చేసేది. ఏడాది గడిచాక మగపిల్లాడికి జన్మనిచ్చింది. పురిటికి పుట్టింటికివెళ్ళి తిరిగివచ్చిన సుశీలకి తను అతనిని పెళ్లిచేసుకునేటప్పటికే అతనికి భార్యా, ఇద్దరు పిల్లలు ఉన్నారన్న విషయం ఆనోటా, ఈనోటా తెలిసింది. అలా అన్యాయం ఎందుకు చేశావని, నిలదీసింది. ఫలితంగా ఆమెను ఇంటినుంచి వెళ్లగొట్టాడు భర్త. అయినా మొండిగా తిరిగి అతని దగ్గరకేవెళ్లి తనకి, పిల్లాడికి వేరేదారి చూపించి వదిలేయమని, చెడి పుట్టింటికి వెళ్లలేనని చెప్పింది. ఆ మొండితనానికి మండిపడ్డ అతను ఇంటికి రావడం మానేయడంకాక వాళ్ల తిండీ, తిప్పలు కూడా చూడడం మానేశాడు. దాంతో జీవితంమీద విరక్తిచెందిన సుశీల విషం తాగింది. ఆమె కేకలకి పక్కింటివాళ్లు ఆమెని దగ్గర్లో ఉన్న ప్రవేటు హాస్పిటల్లో అడ్మిట్ చేశారు. ఆ హాస్పిటల్‌లో పనిచేసే డాక్టరు ఉదయ అనూషకి స్నేహితురాలు... ఉదయ ద్వారా సుశీల గురించి తెలుసుకున్న అనూష హాస్పిటల్‌నుంచి సుశీలని డిశ్చార్జి చేశాక, బాబుతో సహా తనింటికి తీసుకొచ్చింది. తనింట్లోనే ఓ గది ఇచ్చింది.

అలాంటి విధివంచితే శారద. ప్రేమించి పెళ్లిచేసుకుంటానని నమ్మించి, కాదన్న తల్లిదండ్రులను కూడా వదిలేసి తన దగ్గరకు వచ్చిన శారదని ఏడాదిపాటు అనుభవించి, ఆ తరువాత కంటికి కనిపించకుండా పారిపోయాడు. అలాంటి స్థితిలో అటు కన్నవాళ్ళ దగ్గరకి వెళ్లలేక, ఇటు వంటరిగా సమాజంలో అవమానాలు భరిస్తూ బతకలేకా నలిగి, చివరకు తెగించి బతకడం నేర్చుకుంది. కర్ణాటక సంగీతంలో డిప్లొమా సంపాదించుకున్న శారద ఆ సర్టిఫికెట్‌నే జీవనోపాధికి ఉపయోగించుకుని, పిల్లలకి సంగీతం పాఠాలు చెప్పడం మొదలుపెట్టింది. ఒక గది అద్దెకి కావాలని వచ్చిన శారదని చేరదీసి, సుశీలకి తోడుగా సుశీలకిచ్చిన గదిలోనే శారదని ఉండమన్నది.

అప్పుడే అనూషలో బాధిత స్త్రీలకు తానే దన్నా చేయాలన్న ఆలోచన కలిగింది. వెంటనే ఖాళీగా పడివున్న తన ప్లాట్‌లో ఇలాంటి వాళ్లకోసం ఒక బిల్డింగ్ కట్టిస్తే ఎలా ఉంటుందన్న ఆలోచన కలిగింది. కలిగిందే తడవుగా అప్పటి తన ఆర్థికస్తోమత దృష్టిలో పెట్టుకుని, తనే ప్లాన్‌గీసి, ముందు రెండు గదులు, బాత్‌రూము కట్టించి సుశీలను, శారదను, సుశీల కొడుకును, తన దగ్గర పనిచేసే అయిలయ్యను ఆ రెండు గదుల్లోకి పంపించింది.

కొన్నాళ్ళ తర్వాత శ్యామల ఎదురైంది.





శ్యామల భర్తకి హార్ట్ ఎటాక్ రావడంతో ఉస్మానియా హాస్పిటల్లో అడ్మిట్ చేశారు అతని తమ్ముడు, శ్యామల కలిసి. దురదృష్ట వశాత్తూ అప్పటికి ఓపెన్ హార్ట్ సర్జరీ చేసి బతికించే అవకాశం కూడా దాటిపోయింది. అతని భార్య శ్యామల అనూష కాళ్ళావేళ్ళా పడి బతిమాలింది ఎలాగైనా భర్తని బతికించమని. కానీ అనూష మానవత్వం ఉన్న మనిషేకానీ, దైవంకాదుకదా! అతను పోవడంతో పిల్లలు కూడా లేని శ్యామల ఒంటరిదైంది. మామగారిచ్చిన ఒకే ఒక ఇంట్లో మరిది, అతని భార్యాపిల్లల దయాదాక్షిణ్యాలపైన ఆధారపడి బతకడం ఇష్టంలేని శ్యామలని సుశీల, శారదలకి పెద్దదిక్కుగా వాళ్ళ దగ్గరకి పంపించింది అనూష.

ఆ తరువాత ఈ ప్రపంచంలో తన అవసరం ఉన్న స్త్రీలు చాలామంది ఉన్నారని భావించిన అనూష ప్రభుత్వానికి అర్జీలు పెట్టి, కలెక్టరుని కలుసుకుని, కొన్ని సంస్థలను కలిసి, తాను ప్రారంభించిన బాధిత మహిళల హోమ్‌కి ఆర్థికసాయం అర్థించింది. తన స్వంత స్థలంలో తను కట్టించిన రెండుగదులు చూపించి, అది అభివృద్ధి చెందాలంటే ప్రభుత్వం చేయూత ఎంత అవసరమో వివరించింది. ఆమెలోని సేవా భావానికి, ముగ్ధుడైన కలెక్టరు ఆమె స్థలానికి సమీపంలోనే ఇంకా కొంత ప్రభుత్వస్థలాన్ని విరాళంగా ఇచ్చాడు. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు ఆర్థికసాయం అందించాయి. ఫలితంగా రెండుగదులు, ఇప్పుడు పది పడకగదులతో ఒక పెద్ద హాలు, కిచెన్, డైనింగ్ హాలు, ఐదారు బాత్‌రూంలు, లావెట్రీలు వగైరా వాటితో పకడ్బందీగా రూపుదిద్దుకుంది. న్యూస్‌పేపర్ల ద్వారా, పాంప్లెట్‌ల ద్వారా తను స్థాపించిన సంస్థకి పబ్లిసిటీ ఇచ్చింది అనూష. రెండేళ్ళలోపలే అక్కడ పాతికమంది స్త్రీలు చేరారు.

స్వల్పకాలంలో ఎక్కువ ప్రగతి సాధించిన ఆమెని చూసిన కొన్ని దుష్టగ్రహాలు ప్రభుత్వం విరాళంగా ఇచ్చిన లాండ్ తమదని కేసులుపెట్టి గొడవచేశాయి. ఆ గొడవలని ఎదుర్కోడానికి అనూష లాయర్ వీణని కలుసుకుంది. డైనమిక్, డాషింగ్ లాయర్ వీణ ఆ సమస్యని దూదిపింజలా తీసేసి, ఆ సంస్థ అభివృద్ధికి తనవంతు సాయంగా లీగల్ కేసులన్నీ చూసుకోవడానికి అనూషతో కలిసి తన సేవలు ప్రారంభించింది.

అలా ప్రారంభమైన ఆ సంస్థ ఇప్పుడు ఎందరికో ఆశ్రయం అయింది. అందుకే దాన్ని ఆశ్రమం అనడం ప్రారంభించారు. అక్కడ ఉన్నవాళ్ళ ఆసక్తికి తగినవిధంగా వాళ్ళకి కొన్ని వ్యాపకాలు కల్పించారు వీణ, అనూష ఇద్దరూ కలిసి. కొందరికి వయోజన విద్యాకేంద్రం, కొందరికి చేతివృత్తుల్లో శిక్షణ, మరికొందరికి కుట్టుమిషన్లు కొనిచ్చి వారికి ఉపాధి అవకాశాలను కూడా కల్పించారు.

కొంతకాలంపాటు ఆశ్రమం అభివృద్ధికి చాలా సమయం కేటాయించి, అటు వృత్తికీ, ఇటు ప్రవృత్తికీ కూడా అన్యాయం జరక్కుండా రెండింటినీ సమన్వయపరుచుకుంటూ నిరంతరకృషి చేసింది. ఇప్పుడు ఆ ఆశ్రమంలో ఉన్న శ్యామలా, శారదా, మృదులా, సుశీలా ఆమె బాధ్యతని చాలావరకు తమ భుజాలమీదకి ఎత్తుకున్నారు.

అందుకే ఈమధ్య నెలలో ఒకటో రెండో సార్లు వచ్చి అక్కడ జరిగే విషయాలన్నీ పర్యవేక్షించి వాళ్ళ ఇబ్బందులు తెలుసుకుని కావాల్సిన సాయంచేస్తూ ఉంటుంది. ఇప్పుడు నిస్సహాయ స్థితిలో ఉన్న స్త్రీలు ఎవరు అయినాసరే, వయసుతో నిమిత్తం లేకుండా ఆ ఆశ్రమానికి నేరుగా వచ్చేస్తారు. వాళ్ళకున్న దాంట్లో ఎంతోకొంత నెలకింత అని చెల్లించేవాళ్ళు కొందరైతే, ఏమీ లేనివాళ్ళకి ఉచితంగానే అక్కడ ప్రవేశం లభిస్తుంది. అక్కడ వాళ్ళందరికీ అనూష దేవత. నిద్రలేచి వాళ్ళు కొలిచేది, పూజించేది

ఆమెనే. అక్కడ ఉన్నవాళ్ళందరిలో ఎంతో క్రమశిక్షణ. టైమ్‌కి అన్నిపనులూ అందరూ కలిసి చేసుకుంటారు. సుశీల, శ్యామల కలిసి వంటచేస్తారు. మిగతావాళ్ళు మిగతా పనులు చేసుకుంటారు.

★ ★ ★

రోజూలాగే ఆరోజు కూడా ఉదయాన్నే లేచి అందరూ ఎవరిపనుల్లో వారు నిమగ్న మైనారు.

సందడిగా, ఆహ్లాదంగా ఉన్న ఆ ఆశ్రమం గేటులోకి దూసుకుని వచ్చింది డాక్టర్ అనూష కారు.

"మేడమ్ వచ్చారు, మేడమ్ వచ్చారు" ఒక్కసారిగా అనేక కంఠాలు పలికాయి.

కారు దిగి, చేతిలో పసిపిల్లాడితో లోపలికి వస్తోన్న అనూషని ఆప్యాయంగా కౌగలించుకుని, బాబువైపు ప్రశ్నార్థకంగా చూసింది శ్యామల.

అటుగా పరిగెత్తుకొచ్చిన మృదులనీ, శారదనీ చూస్తూ, "కారులో వున్న అమ్మాయిని జాగ్రత్తగా లోపలికి తీసుకురండి" చెప్పింది అనూష. ఇద్దరూ కారు దగ్గరకి పరిగెత్తారు.

సుశీల చేతిలో కాఫీ కప్పుతోవచ్చి, అనూషకి నమస్కరించింది.

చేతిలో బాబుని శ్యామల అందుకుంది. కాఫీ కప్పు అనూషకిచ్చి, శ్యామల చేతుల్లోంచి బాబుని సుశీల అందుకుంది. శ్యామల, మృదుల ఆసరాతో లోపలికి వస్తోన్న నీరజని చూసిన వాళ్లకి పరిస్థితి కొంచెం అర్థమైంది. శ్యామల అక్కడేవున్న ఒక స్త్రీతో "ఆ అమ్మాయికి గదిలో మంచం, పక్కా రెడీ చేయమ్మా గౌరమ్మా" అంది

గౌరమ్మ వడివడిగా లోపలికెళ్లింది.

పది నిముషాల్లో నీరజని మంచంమీద పడుకోబెట్టి శారదా, మృదులా అనూష దగ్గరకి వచ్చారు నీరజ కథ వినాలన్న కుతూహలంతో.

అప్పటికే ఆశ్రమంవాళ్లు చాలామంది వచ్చి అనూషని పలకరించి వెళ్లారు.

"నువ్వు ఇక్కడికి వచ్చి నెల దాటుతోంది అనూషా! మళ్లీ ఈ అమ్మాయి వలన రాగలిగావా? "

"లేదుశ్యామలా! ఈమధ్య రెండుసార్లు ఢిల్లీ వెళ్లాల్సి వచ్చింది. పైగా హాస్పిటల్లో కేసులెక్కువైనాయి. జీవితంలో పెరిగిన వేగానికి, వత్తిళ్ళకేమో వయసుతో సంబంధం లేకుండా ప్రతివాళ్లకీ హార్ట్‌ఎటాక్‌లు వస్తున్నాయి"

"నిజమే మేడమ్! టెన్షన్ ఎక్కువౌతోంది రోజురోజుకి" శారద అన్నది.

"ఇంతకీ ఎవరీ అమ్మాయి? " శ్యామల ప్రశ్నిస్తుండగా మణి కారు వచ్చింది. మణి హడావుడిగా వచ్చి, "ఏదీ ఆ అమ్మాయి? " అంటూ కూర్చుంది ఆయాసంగా.

"నువ్వు ముందు కొంచెం రిలాక్స్ అవు".

"రిలాక్సా పాడా! అబ్బ ఈ టెన్షన్ భరించలేకపోతున్నాననుకో, ఈ ఉద్యోగంచేసేకన్నా హాయిగా ఇంట్లో కూర్చుంటే బాగుండనిపిస్తోంది... అన్నీ ఇవే కేసులు... ఈమధ్య పెళ్లి అయినవాళ్లు తక్కువైనారు... డెలివరీ కేసులన్నీ ఈ బాపతే, అమ్మాయ్ సుశీలా! నీచేత్తో మంచి స్ట్రాంగ్ కాఫీ ఇవ్వమ్మా" గబగబా మాట్లాడింది మణి.

"నీకసలే బీపీ కదా! ఎందుకంత హైరానా పడతావు? " మందలించింది అనూష.

సుశీల క్షణంలో కిచెన్‌వైపు వెళ్లి పెద్ద స్టీలు గ్లాసులో కాఫీ తెచ్చింది. "ఆహా! నీచేతి కాఫీకి మంచి పరిమళం. ఈ పరిమళానికే కాఫీ తాగిన తృప్తి కలుగుతుంది".

మణి మాటలకి అందరూ నవ్వారు.

ఐదు నిముషాల తరువాత మళ్లీ అందరూ కలిసి, నీరజ పడుకున్న గదిలోకి వెళ్లారు. ఆ సందడికి కళ్లు తెరిచింది నీరజ. మణిని చూస్తూనే ఆమె కళ్లల్లో భయం నిండిపోయింది... చూస్తుండగానే కళ్లల్లో నీళ్లు తిరిగి, ఏడుపు ప్రారంభించింది.

"ఎందుకేడుస్తావు? చేసిన వెధవపని చాలక...ఏమ్మా నా ఉద్యోగం ఊడగొట్టా





లనా? ఎందుకు పారిపోయావు? ఏం ఉద్ధరించావు?" కోపంగా అంటోన్న మణిని వారించి, "ముందు ఆ అమ్మాయికి మందులేం వాడాలో రాసివ్వు" అంది అనూష.

"రాసివ్వడం దేనికి? తీసుకొచ్చాను" అంటూ బ్యాగ్‌లోంచి మందుల పాకెట్టు తీసి, సుశీలవైపు తిరిగి "కాచి చల్లార్చిన నీళ్లతో ఈ టాబ్లెట్టు వేయమ్మా" అంది. నీరజ చేయి అందుకుని, పల్స్ చూస్తూ "అసలు ఈ స్థితిలో అలా రోడ్లమీద ఎలా తిరిగావమ్మాయి? మతిపోయిందా? అవ్వ! బాలింతరాలివి పదిరోజులన్నా మంచం దిగ కూడదే, నీకంత తెగింపు ఎలా వచ్చింది?" ఆశ్చర్యంగా ఒక్కో మాటా మాట్లాడుతూ ఇంజక్షన్ చేసింది.

"ఈ ఇంజక్షన్ రోజూ ఒకటి చేయాలి, బికాంప్లెక్స్. మృదులా నీకు ఇంజక్షన్ చేయడం వచ్చుగా?" అడిగింది మృదులని. మృదులకి ఇంజక్షన్ చేయడం అనూషే నేర్పింది. చిన్నచిన్న వైద్యాలు కూడా నేర్పింది అవసరానికి ఎమర్జెన్సీలో ఉపయోగపడచ్చు అని... మృదుల "వచ్చు మేడమ్" అంది.

మృదులకీ, సుశీలకీ నీరజకి ఇవ్వాల్సిన మందులు, ఆహారం, ఇంజక్షన్లు అన్నీ వివరంగా చెప్పి బైటికి వచ్చారు అనూష, మణి. మిగతా వాళ్లు వాళ్లని అనుసరించారు.

అయిలయ్య, రాజు అనూష దగ్గరికి వచ్చి దణ్ణం పెట్టారు. రాజు తన చేతిలో ఉన్న రెండు గులాబీలు అనూషకొకటి, మణికొకటి ఇచ్చాడు.

"ఆరోగ్యం బాగుందా అయిలయ్యా? జాగ్రత్తగా మందులు వాడుతున్నావా? ఏరా రాజూ బాగా చదువుతున్నావా?" ఆప్యాయంగా ఇద్దర్నీ పలకరించింది అనూష.

అంతకన్నా, ఆప్యాయంగా వినయంగా ఇద్దరూ సమాధానం చెప్పారు.

"శ్యామలా! పరిస్థితి అర్థమైందిగా నీరజకి డెలివరీ అయి కేవలం కొన్ని గంటలు... కొంచెం క్రిటికల్ కేసు... వివరాలు ఇంకా తెలీదు. ముందు నీ సంరక్షణలో వదిలేస్తే నా పనులు నేను ప్రశాంతంగా చేసుకోవచ్చని ఇక్కడికి తీసుకొచ్చాను. ఆమెనేం వివరాలు అడక్కండి, ఈ స్థితిలో ఆమె ఏడవటం మంచిదికాదు, నేను మళ్లీ రేపో, ఎల్లుండో వస్తాను. అందాకా జాగ్రత్త...మేమిప్పుడు మణీవాళ్ల చీఫ్‌ని కలవాలి. చాలా అర్జంటు. ఈ అమ్మాయి ఇక్కడికి వచ్చినట్టు అప్పుడే బైట వాళ్లకి తెలియనివ్వకండి... ఓకే"

అనూష మాటలకి చిరునవ్వు నవ్వింది శ్యామల. "నువ్వింతగా చెప్పాలా అనూషా? నీక్కానీ, మేడమ్‌గారిక్కానీ ఎలాంటి మాటా రానివ్వను సరేనా?"

"థాంక్యూ, మరి మేము వెళ్లమా? ఆ అన్నట్టు వీణ ఫోనేమన్నా చేసిందా?"

"ఆ నిన్న చేశారు...మీరు కలవలేదుట ఫోనులో. ఇక్కడకి చేశారు. రేపు బయలుదేరి వచ్చేస్తానని చెప్పమన్నారు".

"హమ్మయ్య" నిశ్చింతగా నిట్టూర్పు విడిచింది అనూష. వీణ వస్తే, ఈ అమ్మాయి సంగతి తనకి వదిలేసి నిశ్చింతగా ఉండచ్చు అనుకుంది.

అందరికీ చెప్పి అనూష, మణి బయలుదేరారు.

మణీ వాళ్ల చీఫ్ హరిశ్చంద్రప్రసాద్‌ని కలిసి, నీరజ ఏ పరిస్థితుల్లో తనకి తారసపడిందో వివరించి "ఆ అమ్మాయి వాలకం చూస్తుంటే చాలా కష్టంలో ఉన్నట్టు అనిపిస్తోంది సార్, అందుకే తిరిగి హాస్పిటల్‌కి పంపించదల్చుకోలేదు. వాళ్లవాళ్లువస్తే నేను మాట్లాడతాను మీరనుమతిస్తే" అంది అనూష.

"నాక్కూడా వాళ్ల మాటలు, పద్ధతి నచ్చలేదమ్మా. కానీ ఏం చేయను? మా మేనకోడలు అని వాళ్లు అంటోంటే కాదు అని చెప్పడానికి నా దగ్గర రుజువేం ఉంది? ముఖ్య

మంత్రి చుట్టాలం అన్నారు. రాజకీయం అంతా మా గుప్పిట్లోనే ఉంది అన్నట్టు మాట్లాడారు. ఆఫ్‌కోర్స్ నేను కూడా కొంచెం గట్టిగానే ఉన్నాననుకో కానీ, గవర్నమెంటు డాక్టర్లం ఏంమాట్లాడినా, ఏంచేసినా తప్పే కదా! ఎనీవే, ఒక పనిచేద్దాం, నేనెలాగూ ఈరోజు సాయంత్రం మెడ్రాస్ వెళుతు న్నాను. వాళ్లు గనక వస్తే మణిగారిని కలు స్తారు. ఆవిడ నీ అడ్రసు ఇస్తారు. నేను వచ్చేలోగా మాటర్ సెటిల్ అవుతుంది అనుకుంటున్నాను, యామ్‌ఐ ష్యూర్?" అడి గాడాయన.

"యస్ సార్... ష్యూర్" కాన్ఫిడెంట్‌గా చెప్పింది అనూష.

"గుడ్. మీమీద నాకు నమ్మకం ఉంది. మీరు చేసే సర్వీసు రియల్లీ గ్రేట్" మన స్ఫూర్తిగా మెచ్చుకున్నాడాయన.

"థాంక్యూసర్" అనూష, మణి ఆయన దగ్గర సెలవు తీసుకుని వచ్చేశారు.

"అబ్బ భయంకరమైన సమస్యని చిటికెలో సాల్వ్ చేశావు అనూ, థాంక్స్ ఎలాట్"

మణి మాటలకి నవ్వింది అనూష. "సమస్య మనం రిసీవ్ చేసుకోవడంలో భయంకరమైనదా? చిన్నదా? పెద్దదా? అని తెలుస్తుంది. మణీ! మన ఖంగారు, భయం, సమస్యలొచ్చినపుడే కంట్రోల్ చేసు కోవాలి. అప్పుడే వాటిని సునాయాసంగా దాటిపోగలం"

మణి అబ్బురంగా అనూవైపు చూసింది. "ఇంత చిన్న వయసులో ఇంత మనోని బ్బరం, ఈ ధైర్యం ఎలా వచ్చాయి ఈమెకి?" అనుకుంది. మణికన్నా అనూష పదేళ్ళు చిన్నది. మణికి పెళ్లి అయిన కొడుకు సంజయ్ కాక మరో కొడుకు ఉన్నాడు. కానీ ఆవిడకి ఆడపిల్లలంటే ఇష్టం. అందుకే అనూషంటే ఆమెకి ప్రాణం.

ఎనిమిదేళ్ళక్రితం లయన్స్‌క్లబ్ వాళ్ళు గాంధీ జయంతి సందర్భంగా ఏర్పాటుచేసిన మెడికల్ క్యాంప్‌లో అనూషతో పరిచయం ఏర్పడింది. అప్పటినుంచీ ఇద్దరూ ఒకరికొ కరు ప్రాణస్నేహితులయ్యారు. ఏ సమస్య వచ్చినా అనూషకి చెప్పుకోకపోతే సాంత్వన లభించదు మణికి. ఇద్దరు మగపిల్లల తత్వాలు రెండు రకాలు. భర్త చాలా నెమ్మ దస్తుడు. నోట్లోంచి మాటే రాదాయనకి. భిన్న మనస్తత్వాల మధ్య మణికి ఇంట్లోవా ళ్ళని, హాస్పిటల్లో ఇలాంటి కేసులని మేనేజ్ చేయడం దినదిన గండంగా అనిపిస్తుం టుంది.

"ఏమిటి ఆలోచిస్తున్నావు? నేను వెళ్ళనా? ఇప్పటికే బాగా ఆలస్యం అయింది" అనూష మాటతో ఆలోచనల నుంచి తేరుకుని "ఓ.కే". అంది.

అనూష కారు మెడికల్ కాలేజీవైపు బయ లుదేరింది.

మరునాడు వీణ వచ్చేసింది ఢిల్లీనుంచి. వస్తూనే అనూషా వాళ్ళింటి దగ్గర ఆటో దిగింది.

గట్టిగా అనూషని కౌగలించుకుని "నీకో గుడ్ న్యూస్ చెప్పనా డియర్" అంది.

"నువ్వు సుప్రీం కోర్టులో గెలిచావా?" నవ్వింది అనూష.

"మనం గెలిచాం... కానీ కోర్టులో కాదు పోరాటంలో"

అనూష సందేహంగా చూసింది.

వీణ అనూషని వదిలి, సోఫాలో వాలి పోయి, "సుశీల కొడుక్కి అతని తండ్రి సంపాదనలో, ఆస్తిలో భాగం వస్తుంది" అంది.

"ఈజిట్" అనూష కళ్ళల్లో వెలుగు కని పించింది.

"అవును... రామేశ్వరి అనే మహిళ భర్త చనిపోవడంతో తనకి కూడా భర్త మరణా నంతరం వచ్చే పెన్షను, గ్రాట్యుటీ డబ్బులో వాటా ఇవ్వాల్సిందిగా న్యాయస్థానాన్ని కోరింది. హిందూ వివాహ చట్టప్రకారం రెండోపెళ్లి చెల్లదు కాబట్టి ఆమెకి ఆ డబ్బు

చెందే ప్రసక్తిలేదని కేసు కొట్టేశారు. అయితే అతని సంతానానికి మాత్రం వాళ్ళకు మైనారిటీ తీరిందాకా ఆ డబ్బులో వాటా ఇవ్వవలసిందని తీర్పు చెప్పారు సుప్రీంకోర్టు జడ్జిగారు. అంటే మనం కూడా సుశీల విషయంలో మెయింటెనెన్స్ కోసం వేసిన కేసు, గెలిచే అవకాశం హండ్రెడ్ పర్సెంట్ ఉంది. ఆమె పెళ్ళి సంప్రదాయకంగా జరిగినా ఆమెని రెండో భార్యగా పరిగణించి కేసు కొట్టేస్తారుగా మన జడ్జీగారు. ఇప్పుడు సుప్రీంకోర్టు జడ్జిమెంట్ ఆధారంగా సుశీల కొడుకు రాజుకి అతని తండ్రి ఆస్తిలోగానీ, సంపాదనలోగానీ భాగం కోరచ్చు"

"అంటే పిల్లలని లీగల్‌గా కన్సిడర్ చేసినట్టేనా? "

"రెండో భార్య పిల్లలకి సామాజిక గౌరవం ఎప్పుడైతే కల్పించిందో అప్పుడే వాళ్ళని లీగల్ చిల్డ్రన్‌గా కన్సిడర్ చేసిందని అర్థం అవునా! అలాంటప్పుడు మనం ఈ కేసు ఎందుకు వదిలేయాలి? "

"కానీ... అది తండ్రి మరణానంతరం కదా!"

"ఏం? మరణానంతరం అయితే ఒకటి, బతికి ఉన్నప్పుడైతే ఒకటా? ఇప్పుడు రాజు మంచి చదువు చదువుకుని ఒక ఉన్నత స్థానం పొందాలంటే డబ్బు కావాలి. తండ్రి ఉండగా వాడు దిక్కులేని వాడిలా ఎవరు దానం ఇస్తారా అని ఎదురుచూడాల్సిన అవసరం ఏమిటి చెప్పు? మరణానంతరం వచ్చే పెన్షను, గ్రాట్యుటీ సంగతెలా ఉన్నా, ఆ జడ్జిమెంట్ ఆధారంగా బతికి ఉన్నప్పుడే అతని సంపాదనలో భాగం అడగచ్చుకదా. అతను పోయిందాకా ఈ పిల్లాడు చదువు లేకుండా ఉండగలడా? అతనెప్పుడు పోతాడా అని ఎదురుచూస్తాడా? నీకెందుకు నేను ఎట్టి పరిస్థితుల్లోనూ వాడికి వాళ్ళ నాన్న సంపాదనలో భాగం ఇప్పించి తీరతాను" స్థిరంగా అంది వీణ.

అనూష ఆమె చేయందుకుని అంది, "కనీసం మహిళా న్యాయవాదులన్నా అందరూ నీలాగా ఆలోచిస్తే ఈ సమాజంలో దగాపడిన స్త్రీలకు ఎంత న్యాయం జరుగుతుందో కదా! రెండోపెళ్ళి చేసుకున్న మగవాడు ఏవిధంగా నష్టపోడుకానీ, స్త్రీమాత్రం అన్నివిధాలా నష్టపోతుంది. మగవాళ్ళు గౌరవించని చట్టాన్ని ఆడవాళ్ళు మాత్రం ఎందుకు గౌరవించాలి? "

"అన్నీ - అవే బాగుపడతాయి. స్త్రీలకు మంచిరోజులు వస్తాయి. ఆ నమ్మకం నాకుంది" ధృఢంగా అంది వీణ.

"లే, ఇక లేచి స్నానం అదీ కానివ్వు... టిఫిను చేద్దాం" అంది అనూష.

వీణ సోఫాలోంచి లేచి "ఈ విషయం నీకు ఎప్పుడెప్పుడు చెబుదామా అని తహతహలాడుతూ వచ్చాను, అందుకే రాగానే చెప్పాను" అంది జుట్టు ముడేసుకుంటూ.

"నీకు ఇంకో బాధ్యత తగిలింది"

"ఏంటది? "

"చెబుతాను... నువ్వు రెడీ అవ్వు. మనం వెళ్ళేటప్పుడు దారిలో చెబుతాను. నిన్ను హైకోర్టు దగ్గర డ్రాప్‌చేసి వెళతాను"

"ఓ...కే..." వీణ తయారవడానికి వెళ్ళిపోయింది.

★ ★ ★

నలభై నిమిషాల తరువాత కారులో వెళుతుండగా అనూష నీరజ సంగతి వివరించింది వీణకి.

"ఇంతకీ వాళ్ళెవరో వచ్చారా? " అంతా విన్నాక అడిగింది వీణ.

"లేదు ఇంకా రాలేదు ఏ క్షణాన్నైనా రావచ్చు లేదా రాకపోవచ్చు ఆ అమ్మాయిని వదిలేసే ఉద్దేశం ఉంటే మాత్రం రారనుకుంటున్నాను"

వీణ సాలోచనగా తల పంకించింది. అంతలో హైకోర్టు సమీపించడంతో కారు ఆపింది అనూష.

"ఓకే, వాళ్లు వస్తే నాకు ఫోన్ చేయి సెల్‌కి. నేను సాయంత్రం ఇంటికి వెళ్లిపో

తాను. రేపు వచ్చి బ్యాగు తీసుకుంటాను" వీణ దిగిపోయింది.

అనూష కారు హాస్పిటల్‌వైపు తిప్పింది. ఆ రోజు ఆమె ఒక ఆపరేషన్ చేయాల్సి ఉంది.

★ ★ ★

నీరజని ఆశ్రమంలో చేర్పించి వారం దాటింది. ఈలోగా అనూష, వీణ రెండు సార్లు వెళ్లి ఆమె పరిస్థితి చూసి వచ్చారు. నీరజని హాస్పిటల్‌కు తీసుకొచ్చిన మేనమామ వగానీ మరెవరూగానీ ఇంతవరకూ రాలేదు. పేపరులో వచ్చిన వార్త కూడా జనం మర్చిపోయారు. రోజూ అలాంటివార్తలు అనేకం వస్తుంటాయి. చదివి అయ్యో అనుకొని ఎవరి దినచర్యలో వారు పడిపోతారు. పక్క ఇంట్లో ఏం జరిగినా పట్టించుకోటానికి తీరికలేని జనాలు ఎక్కడో ఏదో జరిగితేఎలా గుర్తుంచుకుంటారు? గుర్తుంచుకుని ఏం చేస్తారు? ఇవన్నీ మామూలైపోయాయి ఈ రోజుల్లో అనుకుంది అనూష.

ఆశ్రమంలో కూడా నీరజని ఆమె కథేంటి అని ఎవరూ అడగలేదు. ఆమె కూడా చెప్పలేదు. ప్రతిక్షణం ఎక్కడ తనని తీసికెళ్లడానికి ఎవరు వస్తారో అని ఆమె గదిలోంచి బైటికి రావడంలేదు. శ్యామల, సుశీల తల్లీ పిల్లాడిని కంటికి రెప్పల్లా చూసుకుంటున్నారు. బాబుకి పాలు ఇవ్వడం తప్ప వాడి ఆలనాపాలనా అంతా సుశీలే చూసుకుంటోంది. అక్కడ అందరికీ బాబు కాలక్షేపం అయ్యాడు. అందరూ కూడా మనవళ్లనీ, మనవరాళ్లనీ గుర్తుకు తెచ్చుకుని వాడిలో వాళ్లని చూసుకుంటూ వాడిమీద మమకారం పెంచుకోసాగారు. అది చూసిన నీరజకి ఆనందంతో కళ్లు చెమ్మగిల్లాయి. ఇక్కడ ఎంత ప్రశాంతంగా, హాయిగా ఉంది? అనుకుంది. రోజూ ఉదయం, సాయంత్రం అందరూ కలిసి భజనలు చేస్తారు. శారద వీణ వాయిస్తుంటుంది. ఎంతో శ్రావ్యంగా హాయిగా ఉండే ఆమె వీణానాదం కోసం ఎదురుచూడడం నీరజ దినచర్యలో భాగమైంది. తను పడుకున్న మంచం ఫక్కన కిటికీలోంచి బైట కనిపించే పూల మొక్కలని చూస్తుంటే కంటికింపుగా మనసుకి శాంతిగా ఉంటోంది. ఎప్పుడెప్పుడు తను మామూలుగా అందరిలా తిరగ్గలదా అని ఎదురు చూడసాగింది. శ్యామల తల్లిలాగా చూసుకుంటోంది. బాలింతరాలు ఏం ఆహారం తీసుకోవాలో అన్నీ తయారుచేసింది. ఆయుర్వేదం షాపులోంచి కాయం తెప్పించింది. తెలగపిండి తెప్పించింది. ఇదంతా చూసిన నీరజ 'భగవంతుడా నన్నిక్కడినుంచి ఎప్పటికీ తీసికెళ్లకు' మనసారా వేడుకుంది.

★ ★ ★

ఆ రోజు అనూష ఇంటికి త్వరగా వచ్చేసింది. ఫ్రెషప్ అయి, టీ తాగుతూ టీవీ ఆన్ చేసింది. ఇంతలో మణి ఫోన్ చేసింది.

"అనూ! వాళ్లొచ్చారు. పెద్దపెద్ద కేకలు పెట్టారు. నాకు కాళ్లూ చేతులూ ఆడలేదు. అక్కడికీ దబాయించాను. మీరు పదేసి రోజులు కనిపించకుండా పోతే పేషెంటుని ఏం చేయాలి? మిగతా పేషెంట్స్ వస్తే బెడ్స్ ఖాళీ లేవు అందుకే మా ఫ్రెండ్ దగ్గర సేఫ్‌గా ఉంచాను అని నీ పేరు చెబితే 'ఆమె ఎవరు? ఆమెకేం సంబంధం మా అమ్మాయితో? ఎందుకు పంపించారు?' అని గొడవ. నీ ఫోన్ నెంబరు ఇచ్చాను. బహుశా ఇప్పుడు వాళ్లు ఫోన్ చేయచ్చు"

"ఇంటి నెంబరు ఇచ్చావా? " నిదానంగా అడిగింది అనూష.

"ఆ ఇంటి నెంబరే, హాస్పిటల్‌కు వస్తామన్నారు వద్దన్నాను"

"ఓకే నేను చూసుకుంటాలే నువ్వేం ఖంగారుపడకు"

అనూష ఫోన్ పెట్టేసి టీవీ చూస్తూ కూర్చుంది.

కాస్సేపటికి ఫోన్ మోగింది.

"హలో నేను వామనమూర్తిని మాట్లాడు





తుండా. మా పిల్ల నీరజ మీ దగ్గర ఉందం టగా. మేము వస్తున్నాం. పిల్లను రెడీగా ఉంచండి. తీసికెళ్లిపోతాం" అన్నాడు అవ తలి వ్యక్తి.

ఎవరు రిసీవ్ చేసుకున్నారో మాట్లాడేది ఎవరో, ఏవిటో తెలీకుండా తను చెప్పా ల్సింది చెప్పేస్తున్న అతని మాటలకి అడ్డుప డుతూ అడిగింది "మీరెవరు మాట్లాడుతు న్నారు? "

"చెప్పాగా నా పేరు వామనమూర్తి. మీ ఇంటి అడ్రసు చెప్పండి ఎట్టా రావాల? "

"వామనమూర్తి అంటే నాకెలా తెలుస్తుం దండి? "

"ఏంటమ్మా తెలిసేది. మా అమ్మాయి నీరజ నీ దగ్గర ఉందంటగా. మేము వస్తుండాం. అడ్రసు చెప్పు డాక్టరమ్మా"

"హమ్మయ్య తను డాక్టరు అనూష అని అర్థమైందన్నమాట" నిట్టూర్చింది అనూష.

"ఇప్పుడు చీకటిపడింది కదండీ... రేపు మార్నింగ్ రండి" అంది.

"కాదు ఇప్పుడే వస్తాం. మళ్లీ మేము మా ఊరికి వెళ్లిపోవాలి"

"ఓకే నోట్ చేసుకోండి" వాళ్లకి అడ్రసు చెప్పి ఫోన్ పెట్టేసి వాళ్లకోసం ఎదురు చూస్తూ కూర్చుంది.

కొంచెం సేపటికి ఇద్దరు మగవాళ్లు వచ్చా రని వచ్చి చెప్పాడు వాచ్‌మాన్. లోపలికి పంపించమని చెప్పింది అనూష.

ఎత్తుగా, లావుగా, తెల్లటి ఖద్దరు బట్టలు, రెండు చేతుల వేళ్లకీ ఉంగరాలు, మెడలో బంగారు గొలుసు, చూడగానే దర్పంగా, ధన వంతుడిలా, రాజకీయనాయకుడిలా ఉన్న ఒక నలభై ఐదు ఏళ్ల వ్యక్తి, నల్లగా, గడ్డంతో గోధుమరంగు ఖద్దరు చొక్కా, తెల్ల ప్యాంటు వేసుకున్న ఓ 30 ఏళ్ల వ్యక్తి లోపలికి వచ్చారు.

"నమస్కారం, నా పేరు వామనమూర్తి" అన్నాడు తెల్లబట్టలు వేసుకున్నాయన.

"నమస్కారం కూర్చోండి" చిరునవ్వుతో సోఫా చూపించింది.

వాళ్లిద్దరూ ఓసారి హాలు పరికించి చూసి సోఫాల్లో కూర్చున్నారు.

"మా అమ్మాయిని మీరెందుకు తీసుకొ చ్చారు? మీకేం పరిచయం? " అడిగాడు వామనమూర్తి.

"మీ అమ్మాయితో నాకేం పరిచయం లేదు..."

"మరి హాస్పిటల్ నుంచి డిశ్చార్జి చేయించి ఎందుకు తీసుకొచ్చారు? "

అనూష అడ్డంగా తలాడిస్తూ అంది "నేను హాస్పిటల్ నుంచి డిశ్చార్జి చేయించి తీసుకురాలేదు. ఆ అమ్మాయే హాస్పిటల్ నుంచి పారిపోయి వచ్చి ఆత్మహత్య చేసుకో బోయింది. నేను కాపాడి మా ఇంటికి తీసు కొచ్చాను"

వామనమూర్తి భృకుటి ముడిపడింది. కొంచెం కళవెళపడ్డాడు. వెంటనే భావాలు కనిపించకుండా "మరి ఈ సంగతి ఆ డాక్ట రమ్మ చెప్పలేదేంటి? ఆ ఆస్పత్రిలో అంత బాగా చూసుకుంటుండారా పేషెంట్లని? ఆ పిల్ల పారొచ్చిందాకా ఏం చేసినారు? " అన్నాడు.

"డాక్టర్లు అస్తమానం ఒకే పేషెంటు దగ్గర కూర్చుని ఆమెని కాపలా కాస్తుం టారా? రోజుకి ఎన్నో కేసులు వాళ్లు అటెండ్ అవాల్సి ఉంటుంది. పేషెంటు దగ్గర మీ ఆడవాళ్లని తప్పనిసరిగా ఉంచాలి. మీరెందుకు ఉంచలేదు? "

అనూష స్వరంలోని కరుకుదనానికి కొంచెం ఖంగారు పడ్డాడు. వెంటనే సర్దుకుని "ఎవరుండారు దానికి? అమ్మలేదు, అయ్య లేదు. అక్కాలేదు, చెల్లీలేదు. నేనే మేనమా వని అయిన పాపానికి దాని పాపం కడిగిం చేసి ఏ అయ్యనో చూసి గుట్టుచప్పుడు కాకుండా ముడి పెట్టేద్దామనుకుండా. అందుకే ఆస్పత్రిలో చేర్పించి నాకు పనుండా దని బొంబాయి పోయినాను. ఇంతలోకే ఇంత రబసా? అమ్మో" అన్నాడు.

"మీ భార్య లేరా? "

"ఉంది దాని ఆరోగ్యం బాగాలేదే"

"ఓహో! సరే ఇప్పుడు ఆ అమ్మాయిని తీసికెళ్లి ఏం చేస్తారు? "

"చెప్పాగా పెళ్లి చేస్తా... ఎవుడో ఒకడు దొరక్కపోడుగా"

"ఏం చదువుకుంది ఆ అమ్మాయి? "

"బి.ఎ సదువుతా ఎర్రిమొర్రి ఏషాలు ఏసి కడుపు తెచ్చుకుంది"

అనూష సన్నగా నిట్టూర్చి అంది "వామనమూర్తిగారూ! పెళ్లి సెకెండరీ. జరిగిందేదో జరిగింది. ఆ అమ్మాయికి చదువు చెప్పించి ఏదన్నా ఉద్యోగం చూపించి తన కాళ్లమీద తను నిలబడేలా చేయండి. మీరిప్పుడు అబద్ధం చెప్పి పెళ్లిచేస్తే నిజం తెలిశాక ఆ అబ్బాయి వదిలేస్తే మళ్లీ ఆమెగతి అధోగతేగా. ఏమంటారు? "

వామనమూర్తి మొహంలో రంగులు మారాయి. అనూష మాటలకి అయిష్టత అతని మొహంలో లిప్తపాటు కనిపించి మాయం అయింది.

"చూద్దాంలెండి. అమ్మాయిని పిలవండి మేము వెళ్లాల" అన్నాడు మాట దాటేసి.

"అమ్మాయి ఇక్కడ లేదండి... నేను హాస్పిటల్‌కి వెళ్లిపోతే ఆమెని, బాబునీ చూడడానికి ఎవరూ లేరని మా ఆశ్రమంలో ఉంచాను. అక్కడ చాలా మంది ఉన్నారు. అందరూ ఆడవాళ్లే. వాళ్లు నీరజని కంటికి రెప్పలా కాపాడుకుంటున్నారు"

"ఏంటీ ఆ పిల్లకాయని అనాథాశ్రమంలో ఇచ్చేయమని అండానే! ఎంటేసుకుని తిరుగుతుందా? " కోపంగా అన్నాడు.

"తల్లికదా ఎలా వదిలేస్తుంది? పసిపిల్లలు ఎవరి సంతానమైనా ఎలాంటివారైనా తల్లికి ప్రాణమేకదా!"

వామనమూర్తి కళ్లల్లో ఎరుపుజీర, మొహంలో మారుతున్న రంగులు స్పష్టంగా గమనిస్తోంది అనూష. మాట్లాడుతూనే అతని స్వభావాన్ని అతనికీ నీరజకీ ఉన్న సంబంధాన్ని అంచనా వేయడానికి ప్రయత్నిస్తోంది. అతని మాటల్లో నిజాయితీకోసం వెతుకుతోంది. అదే ఆమె స్పెషాలిటీ.

"ఆ ఆశ్రమం యాడుంది? పోదాం పదండి కారుంది" అన్నాడు.

"కారు నాకూ ఉంది. కానీ ఇది సమయం కాదు. ఇంత చీకటిలో ఆ అమ్మాయిని మీతో పంపించలేము. రేపు మార్నింగ్ రండి వెడదాం. ఎలాగా రేపు ఆదివారం కూడా" అంది.

"వీల్లేదు... మీకు రావడానికి కుదరకపోతే అడ్రసు చెప్పండి మేము వెడతాం" కొంచెం కోపంగా అన్నాడు.

మూర్ఖుడులా ఉన్నాడే అనిపించింది అనూషకి. టైము చూసింది. ఎనిమిది అవుతోంది. అరగంట పడుతుంది వెళ్లడానికి.

"ఓకే వెడదాం పదండి" అనూష లేచి వాచ్‌మాన్‌ని పిలిచి కారు బైటికి తీయమని చెప్పింది.

"ఒక్క క్షణం" అంటూ లోపలికి వెళ్లి వీణ సెల్‌కి ఫోన్ చేసింది. "వీణా! వాళ్లొచ్చారు. నువ్వేం చేస్తున్నావు? "

"ఏం లేదు. రెస్టు తీసుకుంటున్నాను. మొన్న ఢిల్లీలో ఒకతను పరిచయం అయ్యాడు. చాలా హ్యాండసమ్ ఫెలో. ఇవాళ మా ఇంటికి వస్తున్నాడు. వుయ్ వాంట్ టు ఎంజాయ్"

"నీకసలు బుద్ధిలేదు. ఎవడో కొంచెం పరిచయం అవగానే ఈవేషాలేమిటి? ఆశ్రమానికి రాకూడదూ!"

"ఇప్పుడా దేనికి? "

"దేనికేంటి? నీరజ మేనమామ వచ్చాడు. ఇవాళ ఆమెని తీసికెళ్లిపోతాట్ట"

వీణ నవ్వింది. "మతిపోయిందా? ఇంత రాత్రివేళ పంపిస్తావా? "

"వినేట్టులేదు. గట్టిగా మాట్లాడితే మనం ఆ అమ్మాయిని కిడ్‌నాప్ చేశామనుకుని కేసుపెట్టేట్టున్నాడు. సేఫ్‌గా ఆ అమ్మాయి ఉందని చూపిస్తే ఆ తరవాత పంపించే

# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటు తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టలోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాల్లలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్గిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన ఆయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అంధజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో, రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

ఆగస్టు చతుర నవల మహావృక్షం ..................

సమీక్షకుని పేరు : ..................

చిరునామా : ..................

..................

..................

..................

విషయం ఆలోచిద్దాం అనుకుంటున్నాను"

"సరేలే ఆ అమ్మాయి వెళ్లినప్పటి సంగతి కదా! ముందు వాళ్లు నిజంగా ఆమె బంధువులా కాదా పరీక్షచేయి. ఆమె రానంటే వాళ్ల రియాక్షన్ చూడు. అవసరం అయితే అక్కడ పోలీసు స్టేషన్‌లో రిపోర్ట్‌చేయి. అక్కడ సర్కిల్ ఇన్‌స్పెక్టరు నాకు బాగా తెలుసు. నేను ఫోన్ చేస్తాను అతనికి. ఆ తరవాత మరీ అవసరం అనుకుంటే నాకు ఫోన్ చేయి. రెక్కలు కట్టుకుని నీ ముందు వాలతాను ఓకే!"

"ఇప్పుడు అతనికోసం ఎదురు చూడడం అంత అవసరమా? "

"చాలా అవసరం. నన్ను ప్రేమిస్తున్నాట్ట. ఎంత గాఢంగా ప్రేమిస్తున్నాడో చూడాలని"

"ఛ నీకసలు సిగ్గులేదు. సరేలే నేను వెడుతున్నాను కానీ సెల్ ఆఫ్ చేయకు"

"చేయనురా"

అనూష ఫోన్ పెట్టేసి తిరిగి హాల్లోకి వచ్చింది.

ఐదు నిమిషాల్లో రెండుకార్లు బయలుదేరాయి.

అరగంట తరవాత ఆశ్రమం గేటులోకి దూసుకొచ్చిన రెండుకార్లని చూసి ఆవరణలో గుండ్రంగా కూర్చుని భజన చేస్తున్న స్త్రీలంతా ఒక్కసారిగా నిశ్శబ్దం అయిపోయారు.

కారు దిగిన వామనరావు అతని అనుచరుడు ఆ స్త్రీలని చూస్తూ ఆశ్రమాన్ని పరికిస్తూ హుందాగా నడుస్తూ వస్తోంటే అనూష చకచకా లోపలికి వెళ్లి సుశీలని పిలిచి రెండుకుర్చీలు బైట వరండాలో వేయమంది. సుశీల కుర్చీలు తీసికెళ్లి వరండాలో వేసి వస్తూ వామనమూర్తిని, అతని అనుచరుణ్ణి చూసి కూర్చోమని చెప్పి లోపలికి వచ్చేసింది. క్షణంలో సగంసేపు వాళ్ల మొహంలోకి చూసిన సుశీలవాళ్ల చూపుల్లోని వాడికి బెదిరిపోయింది.

"ఎవరు అనూషా వాళ్లు? ఈ టైమ్‌లో వచ్చావేంటి? " శ్యామల అడిగింది.

"నీరజ మేనమావట నీరజని తీసికెళ్లడానికి వచ్చారు. ఏం చేస్తోంది తను? "

"ఇప్పుడే భోజనం చేసి కాస్సేపు ఇక్కడ కూర్చుని పడుకుంటానని వెళ్లింది. ఇవాళ పదో రోజుగా స్నానం చేయించాను. అది సరే ఇలారా" శ్యామల అనూషని పక్కకి తీసికెళ్లి రహస్యంగా చెప్పింది "నిన్నరాత్రి బాగా అనునయించి అడిగితే చెప్పింది. తనని హాస్పిటల్లో చేర్పించినాయన మేనమావ కాదుట, తనది ఈ ఊరు కాదుట. వాళ్ల వాళ్లంతా నెల్లూరులో ఉంటారుట"

"మేనమావ కాదా మరి? "

అనూష సందేహంగా చూసింది. "ఇంకా ఏం చెప్పింది? "

"ఏం అడిగినా ఏడుస్తోంది. వెక్కిళ్లు తప్ప మాట రావడంలేదు నోట్లోంచి"

"అలాగా! ఓకే నేను చెప్పిందాకా ఆ అమ్మాయిని డిస్టర్బ్ చేయకండి"

"అలాగే"

అనూష వరండాలోకి వెళ్లి వాళ్లతో అన్నది "నిద్రపోతోంది. కొంచెంసేపు కూర్చోండి. కాఫీ తీసుకుంటారా? "

"కాఫీ వద్దు. ఏం వద్దు. ఇదేంది వృద్ధాశ్రమమా? " అడిగాడు వామనమూర్తి అటూ ఇటూ తిరుగుతోన్న స్త్రీలను చూస్తూ.

"కాదండీ వృద్ధులకోసం మాత్రమే కాదు, ఎవరూ లేని వాళ్లెవరైనా ఇక్కడ ఆశ్రయం పొందచ్చు. మగవాళ్లకి మాత్రం ప్రవేశం లేదు ఒక వాచ్‌మాన్, ఒక పనిచేసే వృద్ధుడు, ఈ ఆశ్రమానికి మొదటగా వచ్చిన ఒకామె కొడుకు ఉంటారు అంతే"

సుశీల కాఫీ కప్పులున్న ట్రేతో వచ్చింది. అనూష వాళ్లిద్దరికీ చెరోకప్పు అందించి తనొకటి తీసుకుంది.

"అమ్మాయిని ఇంక లేపండి. మళ్లీ చీకటి పడిపోతుంది" అన్నాడు వామనమూర్తి లోపలికి వెడుతోన్న సుశీలనుద్దేశించి.

సుశీల అనూషవైపు చూసింది.

అనూష "చూడు లేచిందేమో వాళ్ల మావయ్యా వచ్చారని చెప్పు" అంది.

సుశీల లోపలికి వెళ్లిపోయింది. ఆమెకి వాళ్ల ముందు నిలబడాలంటే నిప్పుల మీద నిల్చున్నట్టు అనిపించింది. వాళ్ల చూపులు సూదుల్తో గుచ్చుతున్నట్టుగా అనిపించాయి.

శ్యామలతో చెప్పింది నీరజని పిలుస్తున్నారని.

శ్యామలా, సుశీలా కలిసి నీరజ గది దగ్గరకి వెళ్లి తలుపు తోశారు. నీరజ మంచం మీద లేదు. "నీరజా" పిలిచింది శ్యామల. "బాత్‌రూమ్‌కి వెళ్లిందేమో" సుశీల గది వెనుకవైపు తలుపులు తీసి ఉండడం చూసి అంది.

"ఇంత చీకట్లో ఒక్కతీ ఎందుకు వెళ్లింది? " శ్యామల అంది.

ఇద్దరూ కాసేపు అక్కడే ఎదురు చూశారు. చీరతో కట్టిన ఉయ్యాల్లో బాబు నిద్రపోతున్నాడు. రోజూ నలుగుపిండితో స్నానం చేయిస్తున్నందుకేమో నునుపు తేలుతున్నాడు. తలుపు తీయడంతో చల్లగాలి వీస్తోంది.

పది నిమిషాలు గడిచినా నీరజ రాకపోవడంతో సుశీల వెనక తలుపుగుండా పెరట్లోకి నడిచింది.

అనూష "శ్యామలా" అని పిలుస్తూ వచ్చింది. "ఏదీ నీరజ" అడిగింది.

"మంచంమీద లేదు బాత్‌రూమ్‌కి వెళ్లిందేమో అని చూశాను. రాలేదు ఇంకా. సుశీల అటువెళ్లింది" అంది.

సుశీల ఆదుర్దాగా వస్తూ "నీరజ ఎక్కడా కనిపించడంలేదు అంది.

శ్యామల కంగారుగా చూసింది. "కనిపించడంలేదా? ఎక్కడికెళ్లి ఉంటుంది? చూడు వాచ్‌మాన్‌ని పిలువు"

అనూష, శ్యామల మిగతా గదులన్నీ చూశారు. చదువుకుంటోన్న శారదా, నిద్రపోతున్న వాళ్లు అందరూ కూడా ఈ గలాభాకి అక్కడికి వచ్చేశారు. అందరూ కలిసి ఖంగారుగా అన్ని గదులూ, బాత్‌రూములు వెతికారు. నీరజ కనిపించలేదు. ఈ సంగతి బైట కూర్చున్న వామనమూర్తికి తెలిసింది. దుడుకుగా లోపలికి దూసుకొచ్చారిద్దరూ "ఏంటమ్మా ఏం చేశారు ఆ పిల్లని. ఏంటి నా దగ్గర నాటకాలు ఆడుతుండారా? " అంటూ రంకెలు వేయసాగాడు. అప్పటి దాకా అతను తెచ్చిపెట్టుకున్న పెద్దమనిషి తరహా, మర్యాద ఏమయ్యాయో రౌద్రంగా మారిపోయి తిట్టడం ప్రారంభించాడు. "ఏంటి ఇక్కడ మీరు చేసేది సమాజసేవా? పరాయి పిల్లల్ని తీసుకొచ్చి యాపారమా? "

అనూష తీవ్రంగా అంది "మర్యాదగా మాట్లాడండి. ఆ అమ్మాయి నిజంగా మీ అమ్మాయే అయితే ఎక్కడికీ పోదు. పారిపోయినా ఎంత దూరం పోతుంది? "

అతను మండిపడ్డాడు. "ఏంటి నీ ఉద్దేశం. మా అమ్మాయి కాకపోతే ఇంత దూరం ఎందుకొస్తాను? నా టైమ్ ఎంత వేస్టు చేశావు ఇవాళ. చచ్చిపోబోతున్న పిల్లని కాపాడావని కృతజ్ఞతతోగాదా! కాపాడినట్టు కాపాడి దాన్ని దాచేస్తావా... ముందు నా పిల్లని తీసుకురా"

"చూడండి మీరన్నది నిజం అయితే ఆ అమ్మాయి ఎక్కడికీ పోదు. కిలో మీటరు దూరం నడిస్తేగాని బస్సులు కూడా దొరకవు. ఇంత రాత్రివేళ ఎక్కడికి పోతుంది? ఇదేం సిటీయా? చూడండి ఒక్కసారి ఎంత నిర్మానుష్యంగాఉందో! కొంచెం ఓపిక పట్టండి మావాళ్లు వెతకడానికి వెళ్లారు. అసలు ఆ అమ్మాయి ఎందుకు పారిపోయిందో నాకర్థం కావడంలేదు"

"దానికి ఒళ్లు పొగరెక్కి పారిపోయింది? దొరకనీ కాళ్లూ కీళ్లూ ఇరగ్గొడతా"

అతని రౌద్ర రూపం చూసి శ్యామల అనూషని పక్కకి లాగింది.

అనూష అతడిని రెచ్చగొట్టడం వలన లాభం లేదనుకుంది. స్వరం మృదువుగా మార్చి అంది, "మీకు కలిగించిన ఇబ్బందికి

నన్ను క్షమించండి. మీ అడ్రసు ఇవ్వండి, రేపు ఉదయానికల్లా మీ అమ్మాయి ఎక్కడ ఉన్నా వెదికి తెచ్చి మీకప్పగిస్తాను"

"ఈల్లేదు. దానిని తీసుకుని కానీ ఈథ నుండి కదిలేదిలేదు"

"ఇంత రాత్రివేళ మిమ్మల్ని ఇక్కడికి తీసుకురావడమే నేను చేసిన పొరపాటు. మీరిక్కడ ఉండిపోయే అవకాశం లేదు. దయచేసి వెళ్లిపొండి. నా మీద నమ్మకంతో వెళ్లండి ప్లీజ్"

అనూష స్వరంలోని మృదుత్వానికి, ఆ ప్రాధేయపడుతున్న తీరుకి ఏమనుకున్నాడో "సరే! రేపు ఉదయం ఆరులోగా హోటల్ వైస్రాయికి అది రాకపోయిందో జాగ్రత్త" చుట్టూ చూస్తూ "ఈ ఆశ్రమాన్ని, ఈళ్లందరినీ, నిన్నూ నామరూపాల్లేకుండా చేస్తా. ఈ వామనమూర్తి అంటే ఏమనుకుంటున్నావో! రారా" పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ బైటికి వెళ్లిపోయాడు. అందరూ బిక్కచచ్చి నిలబడిపోయారు.

అతని కారు వెళ్లిపోయిన వెంటనే అనూష పోలీసు స్టేషన్‌కి ఫోన్ చేసింది. అదృష్టవశాత్తూ సర్కిల్ ఇన్‌స్పెక్టర్ గోపాల్ ఫోన్ తీశాడు.

"సి.ఐ గారూ! నేను డాక్టరు అనూషని. ఇక్కడ మా ఆశ్రమం నుంచి మాట్లాడుతున్నాను. మా దగ్గర నుంచి నీరజ అనే ఒక మ్మాయి పారిపోయింది. ఆ... ఓ అరగంట అయి ఉంటుంది. అదే వెతికిస్తున్నాను. ఎందుకైనా మంచిదని మీక్కూడా చెబుతున్నాను. నిజమే బస్సులు లేవు కానీ వెహికల్ ఏదన్నా వస్తే లిఫ్టు అడిగి వెళ్లి ఉండచ్చుకదా! ఆ ఓకే" ఫోన్ పెట్టేసి కుర్చీలో కూలబడి అంది. "ఈ అమ్మాయి చాలా ప్రాబ్లమాటిక్ అయిందే. వామనమూర్తి వచ్చాడని చెప్పారా? "

"లేదు ఎవరంచెప్పలేదు"

"మనం మాట్లాడేటప్పుడు వినిపించే అవకాశం లేదుగా పడుకుందన్నావుగా!"

"ఏమో!" శ్యామల నీరసంగా అంది కింద చతికిలబడుతూ.

"ఈ టైమ్‌లో పారిపోతే ఎక్కడికి వెళ్లాలని? నాకేం తోచటం లేదు" వాచీ చూసుకుంటూ అంది అనూష.

వాచ్‌మాన్ వచ్చాడు "మేడమ్! ఆమె కనపడలేదు" అన్నాడు.

అనూష వీణ సెల్‌కి ఫోన్ చేసింది. వెంటనే లైను దొరికింది. "వీణా! నేను అనూషని. మళ్లీ పిల్ల పారిపోయింది" అంది.

"అవునా! మైగాడ్ పోలీస్ రిపోర్టు ఇచ్చావా? "

"ఆ..."

"వామనమూర్తి సంగతేంటి? "

"చాలా బతిమాలితే రేపుఉదయం ఆరులోగా హోటల్ వైస్రాయికి తీసుకొచ్చి అప్పగించమన్నాడు. లేకపోతే కడపనుంచి బాంబులు తెప్పిస్తానని వార్నింగ్ ఇచ్చి వెళ్లాడు. ఆశ్రమం పేల్చేస్తాట్ట"

వీణ నవ్వింది. "ఆత్మీయత, సేవాదృక్పథం, మానవత్వంతో కట్టిన ఆశ్రమాన్ని బాంబులు పేల్చేయలేవు అని చెప్పకపోయావా? "

"అంత కూల్‌గా మాట్లాడేంత ఓపిక లేకపోయింది"

"ఓకే నేనిప్పుడే గోపాల్‌కి ఫోన్ చేస్తాను. మళ్లీ నీకు చేస్తాను"

అందరూ మౌనంగా ఎక్కడి వాళ్లక్కడ కూర్చుండిపోయారు. నయం పిల్లాడిని తీసి కెళ్లలేదు అనుకుంది సుశీల.

శ్యామల చటుక్కున ఏదో గుర్తొచ్చిన దానిలా అంది. "గుళ్లో ఏమన్నా దాక్కుందేమో!"

వాచ్‌మాన్ వెంటనే అన్నాడు "లేదమ్మా. ఆడకూడ చూసిన"

శ్యామల నిరాశగా కూర్చుండిపోయింది.

అనూషకి ఏం చేయాలో తోచలేదు. అప్పటికే పది గంటలు అవుతోంది. ఈ



అమ్మాయి ఎక్కడికి వెళ్లినట్లు? ఈ వామన మూర్తి ఎవరు? నీరజకీ, అతనికీ ఏంటి సంబంధం? ఆమెకెందుకతనంటే భయం? మాటిమాటికీ ఎందుకు పారిపోతోంది?

"అనూషా! భోజనం చేయకూడదూ" శ్యామల అడిగింది.

"వద్దు శ్యామలా! నాకేం తినాలని లేదు. ఇప్పుడు ఆమె దొరక్కపోతే మనకీ మణికీ కూడా సమస్యే. ఇతను ఎవరినీ వదిలి పెట్టడనిపిస్తోంది. నేను ఒక హోదాలో ఉన్నాను కాబట్టి తెచ్చిపెట్టుకున్న మర్యాదతో మాట్లాడాడు. ఇందాకటి నుంచి ఆ విషయం నేను గమనిస్తూనే ఉన్నాను. కాక పోతే ప్రభుత్వాన్నించి ఇతర సంస్థల నుంచీ మనకెంత సహకారం ఉందో అతనికి తెలి యాలని అన్ని విషయాలు చెప్పాను. మనిషి మాత్రం చాలా ప్రమాదకరమైన వ్యక్తిలాగే ఉన్నాడు"

అయిలయ్య అన్నాడు "భయమేం లేదమ్మా మేమంతా లేమూ! మీమీద ఈగ వాలనిస్తామా? "

అనూష నవ్వింది "భయం కాదు అయి లయ్యా! అనవసరంగా మీ అందరి ప్రశాం తత పాడు చేస్తాడేమో! అనిపిస్తోంది. ఈ అమ్మాయి కనిపిస్తే అతడిమీద యాక్షన్ తీసుకోవచ్చు. కనిపించకపోతే ప్రమాదం"

అలా మాట్లాడుకుంటూండగానే రెండు గంటలు గడిచిపోయాయి.

శ్యామల, సుశీల, శారద, అయిలయ్య తప్ప మిగతావాళ్లంతా నిద్రలోకి జారిపో యారు. వాచ్‌మాన్ ఇంకా అక్కడక్కడా వెతుకుతూనే ఉన్నాడు రాజు సాయంతో

"మృదుల ఏది? కనిపించలేదు" అడి గింది అనూష.

"వాళ్ల స్నేహితురాలింటికి వెళ్ళింది, రేపు వస్తానంది" చెప్పింది శారద.

అనూష ఆశ్చర్యంగా అడిగింది, "స్నేహి తురాలా? ఇదేంటి చిత్రంగా ఉంది. మనకి తెలీని స్నేహితురాలెవరు? "

"బ్యాంకులో పరిచయం అయిందిట. బాగా క్లోజ్‌గా ఉంటుందని చెప్పింది"

మృదుల ఆశ్రమానికి సంబంధించిన బ్యాంకు ట్రాన్సాక్షన్స్ చూస్తుంటుంది.

నీరజ ఎక్కడికి వెళ్ళిందో అనే ఆలోచ నతో తెలతెలవారుతుండగా అందరూ నిద్రలు పోయారు.



**తూ**ర్పుకొండలమీంచి ఓ సూర్యకిరణం భూమ్మీద సర్వేకి బయలుదేరింది. చలికి ముణగదీసుకుని పడుకున్న ప్రకృతి ఆ వెచ్చ దనానికి కళ్ళు తెరిచి బద్ధకంగా ఒళ్లు విరు చుకుంది. ఆ కదలికకేమో గూళ్లలోని పక్షు లన్నీ తుళ్ళిపడి ఒక్కసారిగా లేచి, రెక్కలు టపటపలాడిస్తూ రివ్వున ఎగిరిపోయాయి. రెక్కలు విప్పుకున్న పూమొగ్గలు ప్రకృతిమీద స్ప్రే చేసినట్టుగా పరిమళాలను వెదజల్లాయి.

అలవాటు ప్రకారం ఐదింటికి లేవాల్సిన శ్యామల ఆలస్యంగా పడుకోవడంచేత అప్పుడే నిద్రలేచింది. ఎక్కడి వాళ్ళక్కడ నిద్రలు పోతున్నారు. ఎవరికీ నిద్రాభంగం కలక్కుండా లేచి, బైటికి నడిచింది. టూత్‌పేస్టు బ్రష్ తీసుకుని, వాష్‌బేసిన్ దగ్గ రకి వెళ్ళి పంపు తిప్పింది. నీళ్ళు రాలేదు. నిన్న హడావుడిలో మోటారు వేయలేదె

వరూ శ్యామల మోటారు ఆన్ చేయడానికి స్విచ్ బోర్డు దగ్గరికి నడిచింది. బిల్డింగు వెనకవైపు సిమెంటు తొట్టి గోడకి పైన ఉంది మీటరు... అది ఆవిడకి అందదు. అప్పుడే రాజు లేచి వస్తున్నాడు.

"రాజూ! మోటారు వేయి నీళ్లు లేవు" అంది.

రాజు అటుగా వచ్చి స్విచ్ బోర్డువైపు నడిచాడు. అప్పుడు వినిపించింది సన్నటి మూలుగు సిమెంటు తొట్టిలోంచి. రాజు వెనక్కి తిరిగి శ్యామలని పిలుస్తూ, "పెద్దమ్మా ఈ తొట్టిలో ఏంటో చప్పుడౌస్తోంది" అన్నాడు.

"పిల్లులు పడుకుంటున్నాయిరా" అంది శ్యామల.

"కాదు పెద్దమ్మా ఎవరో మూలుగుతున్నారు"

శ్యామల అనుమానంగా పరిగెత్తుకొచ్చింది. ఇంకా చీకటి పూర్తిగా విడిపోలేదు "బైట లైటు వేసిరా" అంది శ్యామల. రాజు పరిగెత్తుకెళ్ళి లైటు వేశాడు. ఇద్దరూ కలిసి సిమెంటు తొట్టిలోకి తొంగిచూశారు. చలికి ముడుచుకుని ఓ మూటలా పడుకుని ఉంది నీరజ.

"నీరజా!" గట్టిగా అరిచింది శ్యామల ఉత్సాహంగా. రాజు గబగబా వెళ్ళి శారదనీ, అయిలయ్యనీ లేపేశాడు. క్షణంలో ప్రశాంతంగా ఉన్న వాతావరణం రణగొణధ్వనులతో నిండిపోయింది. నలుగురు సాయం పట్టి తొట్టిలోంచి నీరజని పైకిలేపారు. ఒళ్ళు కాలిపోతోంది. స్పృహలో లేదు. అలాగే పట్టుకుని తీసుకొచ్చి మంచంమీద పడుకోబెట్టారు. అనూషకి ఏం జరుగుతోందో కాస్సేపటిదాకా అర్థంకాలేదు. అర్థమయేటప్పటికి నీరజకి నూటనాలుగు డిగ్రీల జ్వరం వచ్చిందని తెలిసింది.

అనూష ముందుగా వీణకి ఫోన్ చేసి చెడామడా తిట్టింది. వెంటనే బయలుదేరి "ఆశ్రమానికి రా" అని చెప్పింది. తరువాత మణికి ఫోన్‌చేసి నీరజ పరిస్థితి క్లుప్తంగా వివరించి వెంటనే రమ్మంది. ఆ తరువాత కొన్ని మందులు రాసిచ్చి వాచ్‌మన్‌ని కారు తీసుకుని వెళ్ళి ఎక్కడ దొరికినా ఆ మందులు తెమ్మని చెప్పింది. ఇంతలో బాబు లేచి ఏడుపు మొదలుపెట్టాడు. సుశీల బాబునెత్తుకుని అవతలికి వెళ్ళిపోయింది.

ఆశ్రమ వాతావరణం అంతా గంభీరంగా మారిపోయింది. రాత్రంతా విపరీతమైన మానసికాందోళనకి గురిచేసిన నీరజ పొద్దైపోయిన సిమెంటుతొట్టిలో కనిపించడం, రాత్రంతా మంచులో తడిసిపోవడం, తెల్లారి జ్వరంతో ఎవరికీ కాళ్లూ చేతులూ ఆడడం లేదు. అప్పుడే వామనమూర్తి ఫోన్ చేశాడు.

"మీ అమ్మాయి ఎక్కడికీ వెళ్ళలేదండీ అనవసరంగా ఖంగారుపడి మమ్మల్ని ఖంగారుపెట్టారు. జ్వరంగా ఉందని, వేరేగదిలో వెచ్చగా ఉంటుందని వెళ్ళి పడుకుని నిద్రపోయిందట. ఇప్పుడే లేచింది. నేను పరీక్షచేస్తున్నాను. మీరేం ఖంగారుపడకండి. మేము తీసుకొచ్చి దింపేస్తాం కాస్సేపయాక" ఆపద దాటడానికి అందంగా, సులభంగా అబద్ధం చెప్పింది అనూష.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

అదృష్టవశాత్తూ, వాచ్‌మన్ కుకట్‌పల్లిలోనే ఓ నర్సింగ్‌హోమ్‌లో ఉన్న మెడికల్ షాపులో మందులు దొరికాయని తీసుకొచ్చాడు. అనూష ఇంజక్షన్ చేసింది నీరజకి.

సరిగ్గా గంట తరువాత మణి, వీణ వచ్చారు. మణి నీరజని పరీక్షచేసి, అనూష రాసిన మందులే కంటిన్యూ చేయమని చెప్పింది.

జరిగిన సంగతంతా శారద, శ్యామల చెబుతోంటే విన్న మణి అనూష తీసుకున్న శ్రద్ధకి పడిన టెన్షనుకి ఎలాగో అయిపోయింది. 'ఎందుకే ఇంత శ్రమ తీసుకున్నావు? " అంది అనూషని దగ్గరకి తీసుకుని "ఏనాటి ఋణానుబంధమే ఆ పిల్లకీ నీకూ"

వీణ మాట్లాడలేదు. అనూష కొంచెంసే

పటి తరువాత బాత్‌రూమ్‌కి వెళ్ళడానికి బైటికి వెళ్లడం చూసి, ఆమె వెనకే వెళ్ళింది.

"సారీ అనూ! వెరీ సారీ. రాత్రి నువ్వు ఫోన్‌చేసినప్పుడు మూడ్‌లో లేను. కొంచెం డ్రింక్ చేశాను" అంది పశ్చాత్తాపంతో.

అనూష తీవ్రంగా చూసి అంది. "ఎందుకిలా భ్రష్టురాలివైపోతున్నావు? చేతులారా బంగారంలాంటి జీవితం నాశనం చేసుకుంటున్నావు. ఇంక ఎంజాయ్ చేసింది చాలు. ఇంకోసారి ఇలాంటి దరిద్రపు పనులు చేయకు"

వీణ తమాషాగా నవ్వింది. "బంగారంలాంటి జీవితం... నాది..."

"ఏం? ఏం తక్కువైంది నీకు? పెద్ద పేరున్న లాయర్‌వి. డబ్బుంది. అంతో ఇంతో అందం ఉంది. స్వంత ఇల్లుంది. కారుంది ఇంకా ఏం కావాలి?"

"అన్నీ ఉన్నాయి అనూషా! లేనిదేమిటో చెప్పినా నీకర్థంకాదులే"

"మనిషికి తృప్తి అనేది ఉంటే అన్నీ ఉన్నట్టే తెలిసిందా?" అనూష బాత్‌రూమ్ వేపు వెళ్ళిపోయింది.

ఆరోజు ఆదివారం కావడంతో అందరూ అక్కడే ఉండిపోయారు. గంటగంటకీ నీరజని ఇద్దరు డాక్టర్లు చూసుకుంటూ మ దులు ఇస్తుండడంతో మధ్యాహ్నానికి కొంచెం తేరుకుని కళ్లు తెరిచింది. వామనమూర్తి మళ్ళీ రెండుసార్లు ఫోన్ చేశాడు. "ఇంకా రాలేదేం" అని. "బయలుదేరి చాలా సేపయింది వస్తుంటారు" అని చెప్పమంది అనూష. ఎవరు రిసీవ్ చేసుకున్నా అలాగే చెప్పారు.

ఒంటిగంటకి నీరజకి కొంచెం హార్లిక్స్ కలిపిచ్చి కూర్చోబెట్టారు.

అనూష ప్రారంభించింది "చూడు నీరజా! నీ వలన నిన్నటినుంచీ మేమంతా ఎంత ఆందోళన, ఎంత మెంటల్‌టార్చర్ అనుభవించామో తెలుసా! నీ అంతటనువ్వే నీ కథ చెప్తావని ఇన్నాళ్లూ ఎదురుచూశాం. ఇప్పుడు తెలుసుకోవాల్సిన సమయం వచ్చింది. చెప్పు ఏంటి నీ బాధ? వామనమూర్తి ఎవరు?"

నీరజ వెక్కివెక్కి ఏడవటం మొదలుపెట్టింది.

"ఏడవద్దు నీ ఆరోగ్యం బాగాలేదు. ఏడవకు. మేమంతా నీ శ్రేయోభిలాషులం. చూశావా! ఎంతమంది నీకు సపోర్టుగా ఉన్నారో! చూడు ఇక్కడ ఉన్నవాళ్ళంతా నీలాగా జీవితంలో ఏదో బాధపడి ఇక్కడికి వచ్చినవాళ్లే. అందరూ ఎంత సంతోషంగా ఉన్నారో! ఈ సుశీల ఎన్ని కష్టాలుపడిందో తెలుసా! భర్త తిండిక్కూడా డబ్బులివ్వక వదిలేస్తే నాలుగురోజులు పస్తులుండేది. ఈ శారద, ప్రేమించినవాడు మోసం చేస్తే అది కూడా ఎంత దారుణమైన మోసమో తెలుసా. ఆమెని ఏదో పెళ్ళికని తీసికెళ్ళి తన స్నేహితుడికి తార్చబోయాడు. తప్పించుకుని పారిపోయి ఇంటికి వెళితే, లేచిపోయిన దాన్ని ఇంటికి రానివ్వం అని తల్లీ తండ్రి వెళ్లగొట్టారు. కానీ నీలాగా చచ్చిపోడానికి ఎప్పుడూ ప్రయత్నించలేదు తను, ధైర్యంగా బతికి, తనేమిటో రుజువుచేయాలనుకుంది. ఇలా ఒక్కోరిది ఒక్కో కథ. ఎవరూ నోట్లో బంగారు స్పూన్ పెట్టుకుని ఇక్కడికి రాలేదు. చెప్పు నువ్వేదన్నా చెబితే నీకేం సాయం చేయాలో మేము ఆలోచిస్తాం లేకపోతే వామనమూర్తి దగ్గరకి పంపిస్తాం"

"వద్దు ఎద్దు నన్నక్కడికి పంపించకండి" వణికిపోతూ అంది.

"మరైతే చెప్పు"

"చెపుతాను" నీరజ కళ్ళు తుడుచుకుంది.

"మాది నెల్లూరు... మా నాన్నగారికి రైసు మిల్లు ఉంది. నేనూ, తమ్ముడూ, చెల్లి ముగ్గురం... మా అమ్మ మమ్మల్ని చాలా ప్రేమగా చూసేది. మేము చదువుకోవాలని శ్రద్ధ చూపిస్తే ఎంతైనా చదివిస్తా కానీ, బలవంతం చేయననేవాడు నాన్న. అయినా





మేము బాగానే చదివేవాళ్లం. నాన్న, అమ్మ ఎప్పుడూ దెబ్బలాడుకునే వాళ్లు. అమ్మ నాన్నని లక్ష్యపెట్టదని నాన్నకి కోపం, నాన్న తనని కట్టేసి ఉంచుతాడని, తనకో సరదా, షికారు లేకుండా బతుకుతున్నానని అమ్మకి కోపం... ఒక్కరోజు కూడా వాళ్లిద్దరూ దెబ్బలాడుకోనిరోజు ఉండేది కాదు... చెల్లి వాళ్ల దెబ్బలాట వినకూడదని నేను అస్తమానం టీవీ పెద్దగా పెట్టి ఉంచేదాన్ని. అలాఅలా చదువు మీద శ్రద్ధ తగ్గి, టీవీమీద ధ్యాస పెరిగింది నాకు. నెమ్మదిగా టీవీ ప్రభావం నామీద పడడం మొదలుపెట్టింది. రకరకాల సీరియల్స్ చూస్తూ నన్ను నేను హీరోయిన్‌గా ఊహించుకుంటూ ఉండేదాన్ని. అప్పుడు మా అమ్మకి కొత్తగా పరిచయం అయాడు వామనమూర్తి. మా ఇంటికి వస్తూపోతూ ఉండేవాడు. అమ్మ, వామనమూర్తి చాలా చనువుగా ఉండేవాళ్లు. అమ్మకి, మాకూ మంచి, మంచి బహుమతులు, బట్టలు కొనిస్తుండేవాడు. నాన్నగారు మాత్రం వామనమూర్తితో మాట్లాడేవారు కాదు. ఆయన విషయంలో అమ్మ, నాన్న ఓసారి బాగా గొడవపడ్డారు. నాన్న అమ్మని కొట్టారు. తమ్ముడు, చెల్లాయి నిద్రపోయారు కానీ నాకు నిద్రపట్టలేదు. అమ్మ బాగా ఏడ్చింది.

వాళ్ల గదిలోంచి చాలాసేపు ఏడుపు వినిపిస్తూనే ఉంది. చాలా సేపటికి నేను నిద్రపోయాను.

తెల్లవారి లేచేటప్పటికి అమ్మ ఇంట్లో లేదు. నాన్న, మేము ఇల్లంతా వెతికాం. వాళ్ళ ఫ్రెండ్సు ఇళ్ళన్నిటికీ ఫోన్లు చేశాడు నాన్న. అమ్మ కనిపించలేదు. గంటలు, రోజులు గడిచాయి. అమ్మ తిరిగిరాలేదు. ఎక్కడికి వెళ్ళిందో కూడా తెలియలేదు. నాన్న తమ్ముడ్ని, చెల్లాయిని మద్రాసు తీసికెళ్ళి స్కూల్లో చేర్పించి, హాస్టల్లో ఉంచేసి వచ్చారు. నేనూ, నాన్నా ఉండే వాళ్ళం. అమ్మని వామనమూర్తి తీసికెళ్ళాడని నాన్న అంటుండేవారు. నిజమే అనుకున్నాను. కానీ, ఓ రోజు వామనమూర్తి హటాత్తుగా మా ఇంటికి వచ్చి మా అమ్మని హైదరాబాదులో చూశానని చెప్పాడు. నాన్న అతని మాటలు నమ్మలేదు. అమ్మ ఒకసారి తనని కాదని వెళ్ళిపోయాక మళ్ళీ ఇంటికి రానవసరంలేదని చెప్పారు. కానీ నాకు మాత్రం అమ్మని చూడాలని చాలా అనిపించింది. 'నాన్నకి తెలీకుండా ఒకసారి వామనమూర్తి ఇంటికి వెళ్ళి నన్ను హైదరాబాదు తీసికెళ్ళమని అడిగాను. ఆ క్షణంలో ఆయన కళ్లల్లో కనిపించిన వెలుగు ఈరోజూ మర్చిపోలేను. అంతగా ఆయన కళ్లు వెలిగిపోడానికి కారణం ఏమిటో నేను ఆయనతో కలిసి హైదరాబాదు వచ్చాక కానీ తెలియలేదు. రైలు దిగగానే నన్ను తన స్నేహితురాలని చెప్పి, ఒకామె ఇంటికి తీసికెళ్ళాడు. ఒక అపార్ట్‌మెంటులో నాలుగో అంతస్థులో ఉండేది ఆమె. నేనక్కడ నాలుగురోజులు ఉన్నాను. అమ్మ జాడ చెప్పేవాడు కాదు. రోజూ రాత్రిళ్లు ఆమె ఫ్లాట్‌కి ఇద్దరు మగవాళ్లు, ఇద్దరు ఆడవాళ్ళు వస్తుండేవాళ్లు. తెల్లవారాక వెళ్ళిపోయేవాళ్ళు. వెళ్లేటప్పుడు ఆమెకి కొంత డబ్బిచ్చి వెళ్లేవాళ్లు. ఆ డబ్బు వామనమూర్తి, ఆమె పంచుకునేవాళ్లు. నాలుగురోజులు గడిచాక ఒకరోజు నేను గాఢంగా నిద్రపోతున్నాను.

చెప్పడం ఆపి, వెక్కివెక్కి ఏడవటం మొదలుపెట్టింది నీరజ.

వింటోన్న అందరి గుండెలు బరువెక్కాయి. అనూష ఓదార్పుగా ఆమె తల నిమిరింది.

"ఎవరో ఒకతను వచ్చి నా పక్కన పడుకున్నాడు. నా వంటిమీద చేయివేయగానే నేను భయపడి లేచాను. అతను నన్ను లేవనీయకుండా పట్టుకున్నాడు. చేయి కొరికి మంచం దిగాను. తీరా చూస్తే తలుపు బైట నుంచి వేసి ఉంది. ఆ తరువాత అతను నన్ను" కన్నీళ్లు తుడుచుకుంది నీరజ.



"అప్పటినుంచి నన్ను రోజుకొక ఫ్లాట్‌కి తీసికెళ్లేవాళ్లు ఆమె, వామనమూర్తి. కొన్నాళ్ళకి వామనమూర్తి వెళ్ళిపోయాడు. ఆమె నాతో బిజినెస్ చేయించింది. ఈ లోగా నేను గర్భవతినైనాను. అబార్షన్ చేయించడానికి తీసికెళ్ళింది ఆమె. కానీ నేను బలహీనంగా ఉన్నానని అబార్షన్ చేయనని చెప్పింది డాక్టరు. ఓరోజు వామనమూర్తి వచ్చాడు. ఆమే, వామనమూర్తి చాలాసేపు చర్చించుకున్నారు. ఏం అనుకున్నారో మళ్ళీ అబార్షన్ సంగతి ఎత్తలేదు. ఆ తరువాత ఓసారి తెలిసింది మా అమ్మని కూడా వామనమూర్తి తీసికెళ్ళాడని. అమ్మ కూడా వేరే ఊళ్లో ఈమెలాగే ఇలా సంపాదించి పెడుతోంది వామనమూర్తికని... ఓరోజు పారిపోవడానికి ప్రయత్నించి పట్టుపడ్డాను. ఆ రోజు నన్ను బాగా కొట్టారెవరో ఇద్దరు మగవాళ్లు. ఆమె అది చూసి నాకు వార్నింగ్ ఇచ్చింది ఇంకెప్పుడూ పారిపోవద్దని. నెలలు నిండిన నన్ను తీసుకొచ్చి హాస్పిటల్‌లో అడ్మిట్ చేశాడు వామనమూర్తి. ఆ తరువాత ఏమయిందో మీకు తెలుసు. డాక్టరుగారూ! నేను బతికిఉంటే వామనమూర్తి నన్ను వదలిపెట్టడు. నాకు చచ్చిపోవాలని ఉంది. నిన్నరాత్రి ఆయన వచ్చాడని మీరంతా మాట్లాడుకుంటుంటే మెలకువచ్చింది. నన్ను ఆయనకి అప్పగిస్తారని భయంవేసింది. అందుకే ఎలాగైనా పారిపోవాలనుకున్నాను. కానీ నిర్మానుష్యంగా ఉండడంతో ఎలా వెళ్లాలో, ఎక్కడికి వెళ్లాలో అర్థంకాలేదు. మీరంతా వెతుకుతోంటే గబుక్కున ఆ తొట్టిలో దిగిపోయి కూర్చుండిపోయాను. ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు"

"ఎంత పనిచేశావు? నీకిష్టంలేకుండా ఎలా పంపిస్తామనుకున్నావు? అసలు అతనెవరో తెలుస్తుందని నిన్ను పిలిపించాను. పైగా నువ్వతని మేనకోడలివి కావని నాకు ఎలా తెలుస్తుంది? రుజువులడిగితే ఎక్కడినుంచి తేను? అందుకే ముందు నేను కూడా అతనిలాగే మంచిగా ఉండి అసలు విషయం రాబట్టాలనుకున్నాను. పోనీలే జరిగిందేదో జరిగింది. ఇంకెప్పుడూ నువ్వు పారిపోడానికి ప్రయత్నించద్దు. ఆ వామనమూర్తి సంగతి మేము చూసుకుంటాం" అంది అనూష.

"యస్ కరెక్ట్... వాడి సంగతి రేపీపాటికి చూస్తాను. నువ్వేం భయపడకు" అంది వీణ.

అందరూ ఊపిరిపీల్చుకున్నారు.

"అనూషా! వాడికి ఫోన్‌చేసి, రేపు మీ ఇంటికి రమ్మని చెప్పు... నీరజని అప్పగిస్తామని చెప్పు" వీణ అంది.

"మేము వాడిదగ్గరకే బయలుదేరామని చెప్పారు మనవాళ్ళు ఇందాకే"

"ఏం ఫరవాలేదు కారు ట్రబుల్ ఇచ్చింది, అందుకే మా ఇంటికి వెళ్ళాం అని చెప్పు. రేపు రమ్మను"

"ఓకే" ఆ తరువాత ఇంకా ఏమేం చేయాలో అరగంట మాట్లాడుకున్నారు అనూష, వీణ, మణి. తరువాత భోజనాలు చేసి, వాళ్ళందరికీ భయపడద్దని మరీ మరీ చెప్పి బయలుదేరారు. బయలుదేరేముందు వామనమూర్తికి ఫోన్‌చేసి వీణ చెప్పిన మాట చెప్పింది అనూష. ముందు అరిచినా తరువాత సరే అన్నాడు.

"గుడ్" వీణ అనూష భుజం తట్టింది.

వాళ్ళు ఎక్కిన కార్లు బయలుదేరాయి.

★ ★ ★

అది నాలుగు గదులున్న ఒక పోర్షను. ముందుగదిలో టేబులు, కుర్చీ టేబులుమీద ఫోను, ఒక ఇంటర్‌కమ్, గోడకి ఆనించి వేసిన నాలుగు కుర్చీలు అతిథులకోసం అని తెలియచేస్తున్నాయి. టెలిఫోను ఆపరేటర్ స్వప్న తేరగా వచ్చింది కదా అని కుర్చీలో వెనక్కివాలి, సావకాశంగా తన బాయ్‌ఫ్రెండుతో ఫోనులో మాట్లాడుతోంది. ఆమె కూర్చున్న కుర్చీకి వెనక గోడమీద రెండు సినిమా పోస్టర్లు, నాలుగు న్యూసుపేపరు





కటింగులు అతికించబడి ఉన్నాయి. ఆమె టేబుల్ పక్కనే ఉన్న ద్వారంలోంచి వెళితే, నాలుగు టేబుల్స్, ఎనిమిది కుర్చీలు ఉన్నాయి. పదిమంది మగవాళ్లు కాగితాలక ట్టతో కుస్తీపడుతున్నారు. అక్కడక్కడా చిందరవందరగా న్యూసుపేపర్లు, మానుస్క్రిప్టులు పడి ఉన్నాయి. రెండు టేబుల్స్‌మీద రకరకాల మాగజైన్లు, ఇంగ్లీషు, తెలుగువి ఉన్నాయి. కుడిపక్క ఉన్న ద్వారంలోంచి వెళితే, ఎడిటర్ అని బోర్డు ఉన్న ఓ గదికి కర్టెను వేళ్లాడుతోంది. ఆ కర్టెను తీసుకుని లోపలికి వెడితే ఒక టేబిలు, రివాల్వింగ్ కుర్చీ గోడలకి చక్కటి తైలవర్ణ చిత్రాలు, ఓ మూల గాడ్రెజ్ బీరువా కొంచెం ఆడంబరంగా ఉంది గది. రివాల్వింగ్ కుర్చీలో కూర్చున్న భరణి చాలా కుతూహలంగా పేపరు చదువుతున్నాడు. ఆ పేపరు ఆంధ్ర దేశంలో అత్యధిక సర్క్యులేషన్ ఉన్న పేపర్.

భరణి మంచి ఆదర్శభావాలు, ఉత్సాహం ఉన్న ముప్పైఏడేళ్ళ యువకుడు. జర్నలిజం, పబ్లిక్‌రిలేషన్స్ పాసైన అతను కొంత కాలం కొన్ని పత్రికలలో పనిచేశాడు. కానీ, ఆ పత్రికల పద్ధతి నచ్చక ఆ ఉద్యోగాలు వదిలేసి, తండ్రితో ఆస్తి కోసం దెబ్బలాడి, తన వాటా ఆస్తిలో రెండు లక్షల రూపాయలు తీసుకుని, స్వంతంగా పత్రిక ప్రారంభించాడు. దాని పేరు 'తొలికిరణం'. ఒక స్నేహితుడి ప్రెస్సులో పత్రిక ప్రింటు చేయిస్తూ, రెండు పేజీలతో ప్రారంభించిన ఆ పత్రిక ముందు పదిహేను రోజులకొకసారి, తరువాత నెలకోసారి, ఆ తరువాత మూడు నెలలకోసారి అలా కుంటినడక మొదలుపెట్టింది. పత్రిక నడిపించడం జర్నలిజం పాసైనంత సులువుకాదని, ఆ పత్రిక ప్రారంభించిన ఏడాదిలోగానే అనుభవపూర్వకంగా తెలుసుకున్నాడు. పెట్టుబడి పెట్టిన డబ్బులో పదోవంతు కూడా సంపాదించలేకపోయాడు. పత్రిక సజావుగా సాగాలంటే కేవలం ఓ లక్ష రూపాయలు సరిపోవని, బోలెడన్ని వనరులు కావాలని తెలుసుకున్నాక వనరులు సమకూర్చుకునే ప్రయత్నం ప్రారంభించాడు. ఉన్న పదిమంది ఎంప్లాయిలలో ఒక్కోరికి ఐదేసి వందల చొప్పున ఇస్తున్నాడు. సంవత్సరంలోనే నాలుగుసార్లు మార్చాడు స్టాఫుని. ఎవరూ పట్టుమని రెండు నెలలు చేయకుండానే వేరే ఉద్యోగాలు చూసుకుని వెళ్ళిపోతున్నారు. భరణి మాత్రం పట్టువదలని విక్రమార్కుడిలా నాలుగైదు అడ్వర్‌టైజ్‌మెంట్లు సంపాదించుకుంటూ పత్రికని నెట్టుకొస్తున్నాడు. ఎప్పటికైనా డెయిలీ పేపరుగా చేయాలని, సమాజంలో జరిగే అన్యాయాలని, దౌర్జన్యాలని, చీకటిబజారులో జరిగే ఘోరాలనూ బైటపెట్టి డాషింగ్ జర్నలిస్టుగా పేరు తెచ్చుకోవాలని భరణి కోరిక. సంపాదనలేని అతనికి పిల్లనివ్వడానికి ఎవరూ ముందుకురాకపోవడంతో ఇంకా బ్రహ్మచారిగానే ఉండిపోయాడు.

ఇప్పుడు అతను చదువుతున్న పేపరులో వార్త అతనిని ఎంతో ఆకర్షించింది. 'పెద్దమనిషి ముసుగులో వ్యభిచార గృహాన్ని నడిపిస్తున్న వ్యక్తి అరెస్టు' అనే హెడ్డింగుతో ప్రచురించబడిన వార్త.

"నెల్లూరునుంచి అమాయకురాళ్లైన యువతులను మాయమాటలతో మభ్యపెట్టి, హైదరాబాదు తీసుకువచ్చి వ్యభిచార గృహాలను నిర్వహిస్తున్న వామనమూర్తి అనే ఒక నలభైఐదేళ్ళ వ్యక్తిని, అతని అనుచరులను పోలీసులు నిన్న రాత్రి పదకొండు గంటల ప్రాంతంలో పంజాగుట్టలో ఉన్న ఒక అపార్ట్‌మెంటులో అరెస్టు చేశారు. వారంరోజుల క్రితం ప్రభుత్వ ప్రసూతి ఆస్పత్రినుంచి డెలివరీ అయిన ఇరవై నాలుగ్గంటలకే తన శిశువుతోసహా పారిపోయిన ఓ ఇరవైఏళ్ళ యువతిని ప్రఖ్యాత కార్డియాలజిస్టు డాక్టరు అనూష రక్షించి, నగరానికి 30 కిలోమీటర్లదూరంలో కూకట్‌పల్లి అవతల

స్థాపించిన ఓ బాధిత మహిళల ఆశ్రమంలో చేర్పించారు. ఆ ఆశ్రమానికి ఫౌండర్ సెక్రెటరీ అయిన డాక్టరు అనూష దగ్గరకి బాధితురాలి మేనమామనని, ఆమెని తీసికెళ్ళడానికి వచ్చానని ఒక వ్యక్తి రావడంతో అతడిని ఆశ్రమానికి తీసికెళ్ళారు. అక్కడికి వచ్చిన అతనిని చూసి బెదిరిపోయిన బాధితురాలు నీరజ తిరిగి పారిపోవడంతో రంకెలు వేస్తిన వామనమూర్తికి నచ్చచెప్పి, ఆమె ఎక్కడ ఉన్నా వెతికించి అతనికి అప్పచెబుతామని శాంతింపచేశారు అనూష. అయితే వాడుకలో లేని ఓ సిమెంటు తొట్టిలో కూర్చున్న నీరజని బైటికి తీసిన ఆశ్రమవాసులు ఆమె ద్వారా వామనమూర్తి సాగిస్తున్న కార్యకలాపాలు, చేస్తున్న ఘోరాలు తెలుసుకుని అతని అకృత్యాలు బైటపెట్టడానికి పకడ్బందీగా వల పన్నారు. ఆ వలలో చిక్కుకున్న వామనమూర్తిని డాక్టరు అనూష, ఆమె స్నేహితురాలు, ఆశ్రమానికి ప్రెసిడెంటు అయిన పేరుపొందిన లాయరు వీణ కలిసి రెడ్‌హాండెడ్‌గా పట్టించి అరెస్టు చేయించారు. పంజాగుట్ట పోలీసులు ఈ కేసుని దర్యాప్తుచేస్తున్నారు".

భరణి అప్పటికే అనూష గురించి విని ఉన్నాడు. అడపాదడపా, ఆమె రోగులకు చేస్తున్న సేవల గురించి, ఆమె సమాజసేవ గురించి పేపర్లలో చదువుతూనే ఉన్నాడు. అయితే ఈ వార్త అతనిని మరీ ఆకట్టుకుంది. అనూష డైనమిక్ లేడీ అనుకున్నాడే కానీ, ఇంత సాహసం ఉందని అతని ఊహకు తట్టలేదు. వెంటనే ఆమెని చూడాలని అనిపించింది అతనికి. ఇంకా నాలుగైదు రోజుల్లో రాబోతోన్న నెక్స్ట్ ఇష్యూలో ఆమె ఇంటర్వ్యూ వేస్తే ఎక్కువ సంఖ్యలో తన పత్రిక కాపీలు అమ్ముడవచ్చు అని అతనికి బలంగా అనిపించింది. వెంటనే కుర్చీలోంచి లేచి, లెదర్‌బ్యాగు తీసుకుని బైటికి వచ్చాడు. ఐదు నిమిషాల్లో అతని హీరో హోండా ఉస్మానియా హాస్పిటల్ వైపు పరుగుతీసింది.

భరణి హాస్పిటల్‌కి వెళ్ళేటప్పటికి ఒంటిగంట అయింది. అనూష గురించి వాకబు చేస్తే ఆమె ఇంకా రాలేదన్నారు. మూడు గంటలకి వస్తుందని చెప్పడంతో, ఈలోపల అతను తన పేపర్‌కి కావలసిన మాటర్ ఏవన్నా దొరుకుతుందేమోనని హాస్పిటల్ రెండు బిల్డింగులు తిరిగాడు. జనరల్ వార్డ్‌లో బెడ్‌లు ఖాళీలేక కిందనే జంపఖానాలు పరచుకుని పడుకున్న పేషెంట్లను, వరండాలలో, బైట తిరుగుతోన్న కొందరు పేషెంట్లను, వాళ్ళ బంధువులను, అంబులెన్సులలో వచ్చిన ఎమర్జెన్సీ కేసులను పరీక్షిస్తూ పాకెట్ డైరీలో పాయింట్లు నోట్ చేసుకున్నాడు. తరువాత బైటికి వెళ్ళి, హోటలులో భోజనంచేసి, మూడు అవుతుండగా తిరిగి హాస్పిటల్‌కి వచ్చాడు. ఇంకా అనూష రాలేదు.

అరగంట అటూ ఇటూ తిరుగుతుండగా తన ముందునుంచే వెళ్ళిన అనూషని చూసి ఆమె అనూష అని తెలియకపోయినా ఆమె రూపం, హుందాతనం చూసి ఈమే అనూష అయితే బాగుండును అనుకుంటూ ఆమె వెనకాలే వెళ్ళాడు. అతడిని చూడగానే అప్పటిదాకా అతని ప్రశ్నలకి సమాధానం చెప్పిన నర్సు "మేడమ్! సార్ మీకోసం రెండుమూడు సార్లు తిరిగి వెళ్ళిపోయిండు" అంది.

అనూష హ్యాండ్‌బ్యాగ్ టేబుల్ మీద పెట్టి అతడివైపు చూసి "యస్! ఏం కావాలి మీకు? " అంది.

"మీరేనా అనూషగారు? " ఆనందంగా అడిగాడు భరణి.

"అవును. మీరూ..." సందేహంగా చూసింది.

"నా పేరు భరణి. తొలికిరణం పత్రిక ఎడిటర్‌ని. ఈరోజు మీ గురించిన వార్త చదివాను పేపర్‌లో మిమ్మల్ని ఇంటర్వ్యూ చేయడానికి వచ్చాను. నా రాబోయే




ఇష్యూలో మీ ఇంటర్వ్యూ వేయాలని ఉంది"

"నా ఇంటర్వ్యూ తీసుకోవాల్సినంత ఘన కార్యం, నేనేం చేశానని? " నవ్వుతూ అంది.

"ఎవరి ఘనకార్యం వారికి తెలియదు, ఇతరులు ఆ ఘనకార్యం గుర్తించి అభినందించేదాకా. మీరు చేసిన సాహసంకన్నా ఘనకార్యం ఏం ఉంటుంది? వామన మూర్తిని అరెస్ట్ చేయించడం ద్వారా మీరు ఎంతోమంది అమాయకురాళ్లను అతని ఉచ్చు నుంచి రక్షించారు. ప్లీజ్ మేడమ్! కాదనకండి"

"ఓకే! కానీ ఇక్కడ కాదు. రేపు ఉదయం ఎనిమిది గంటలలోగా మా ఇంటికి రండి. ఇది నా ఎడ్రస్" అంటూ బ్యాగ్‌లోంచి విజిటింగ్ కార్డు తీసి ఇచ్చింది.

వికసించిన మొహంతో "థాంక్యూ మేడమ్" అని అందుకున్నాడు.

అనూష నవ్వుకుంది, చాలారోజుల తరువాత మళ్లీ తనపేరు పేపర్లో వచ్చింది. ఇలాంటివి వారం దాకా తప్పవు అనుకుంది.

నిజంగానే ఆరోజు తోటి డాక్టర్లు, స్టూడెంట్స్ అభినందనలతో ముంచెత్తారు. వసుధైతే ఏకంగా పూలదండ తీసుకొచ్చి వేసి, స్వీట్స్ తినిపించింది. పేషెంట్లంతా విషయం తెలుసుకుని ఆమెకి నమస్కారాలు పెట్టారు. ఆరోజు అనూష ఇంటికి వెళ్లగానే మణీవాళ్ల చీఫ్ ఫోన్ చేశారు. "కంగ్రాట్యులేషన్స్ అనూషా! చాలా గొప్ప పని చేశావమ్మా నువ్వు. ఆ అమ్మాయి హాస్పిటల్ నుంచి పారిపోవడం ఎంత మంచి పనైంది అనిపిస్తోంది నాకు" అన్నాడాయన.

"థాంక్స్ సార్!"

"అనూ! నీవలన నా గౌరవం పెరిగింది. నీలాంటి స్నేహితురాలు ఉన్నందుకు గర్వపడుతున్నాను. నేనివాళ చాలా బిజీగా ఉన్నాను. లేకపోతే వచ్చి నిన్ను ముద్దు పెట్టేసుకోవాలని ఉంది" అంది మణి.

అనూష నవ్వింది.

మరునాడు సరిగ్గా ఎనిమిది గంటలకి అనూష ఇంటికి వచ్చాడు భరణి. అతనలా ఠంచనుగా వచ్చేటప్పటికి అనూషకి చిత్రంగా అనిపించింది. ఆమె అతని రాకనిగానీ, తనని ఇంటర్వ్యూ చేస్తానన్న విషయంగానీ సీరియస్‌గా తీసుకోలేదు. అతను చెప్పిన పత్రిక పేరు కూడా ఆమెకు గుర్తు లేదు. దానిక్కారణం ఇంతకుముందు ఎప్పుడూ ఆ పత్రిక ఒకటి ఉందన్న విషయం తెలిసి ఉండకపోవడమే.

"గుడ్ మార్నింగ్ డాక్టర్!" అంటూ వచ్చిన అతనిని సాదరంగా ఆహ్వానించింది. వెంట కెమేరా కూడా తెచ్చుకున్నాడు భరణి.

"మీ ఫొటోలు రెండు యాంగిల్స్‌లో కావాలి మేడమ్!" అన్నాడు కెమేరా చూసుకుంటూ. అనూష ఏంమాట్లాడలేదు. తనక్కావలసిన యాంగిల్స్‌లో తీసుకున్నాడు.

"మేడమ్! మీకు నీరజ అనే అమ్మాయి అసలు ఎలా తారసపడిందో చెప్పగలరా? " అడిగాడు.

అనూష వివరంగా చెప్పింది.

"మీరు ఆశ్రమాన్ని స్థాపించి ఎన్నేళ్ల యింది? " అనడిగాడు.

"దాదాపు పదేళ్లు"

"ఆశ్రమం అభివృద్ధికి మీరొక్కరే కృషి చేశారా? "

"మొదట్లో నేనే చేశాను. నా స్వంత స్థలంలో, నా డబ్బుతో ముందు రెండు గదులు కట్టించాను. అప్పుడు నలుగురో, అయిదుగురో ఉండేవాళ్లు. వాళ్లకి వంటకి, వాడుకకీ కావలసిన సామాన్లు, సరుకులూ నేనే పంపించేదాన్ని. మా అమ్మగారికి ఇంట్లో వస్తువులుమీదా, ఫర్నిచర్ మీదా చాలా మోజుండేది. మార్కెట్‌లో కొత్త వెరైటీ ఏదొచ్చినా వెంటనే కొనేస్తుండేది. అవన్నీ చాలా ఉండేవి మా ఇంట్లో. చాలామటుకు నేను ఆ హోమ్‌కి పంపించేశాను. వాటర్ ఫిల్టర్, రెండు సోఫాసెట్లు, ఒక పాత ఫ్రిజ్, గ్యాస్ స్టవ్, సిలిండరు, కొంత స్టీలు సామాను ...ఇలా చాలా సామాను

పంపించాను"

"తరువాత ఫండ్స్ ఎలా సమకూర్చుకున్నారు?"

"కొంతమంది మెంబర్స్ చేరాక, గవర్న్మెంట్‌కి అప్లికేషన్ పెట్టాను. నేను చేసిందంతా వివరించి, నాకు ఫండ్స్ మంజూరు చేస్తే ఇంకా ఎక్కువ సేవ చేయడానికి నాకవకాశం ఉంటుందని వివరించాను. ఏడాది గడిచాక, యాన్యువల్ డే సెలబ్రేషన్స్ పేరుతో చిన్న ఫంక్షన్ ఏర్పాటు చేసి కలెక్టర్‌గారిని, మంత్రిగారిని ఆహ్వానించాను. వాళ్లు వచ్చి చూసి, నేను నా ఆస్తితో హోమ్ నడిపిస్తున్నందుకు చాలా అభినందించారు. అప్పటికప్పుడే మాకు ఒక ఎకరం స్థలం, రెండు లక్షల రూపాయలు విరాళం ప్రకటించారు. అయితే నా ల్యాండ్‌కి, ప్రభుత్వం ఇచ్చిన ల్యాండ్‌కి మధ్యలో నూటయాభై గజాల ల్యాండ్ ఉంది. దాని యజమాని దగ్గర కొనుగోలు చేసి మొత్తం కలిపి ఎక్స్‌టెన్షన్ బిల్డింగ్ కట్టించాను. ఆ విధంగా డెవలప్ చేయడం జరిగింది"

"ఈ సంస్థ నిర్వహణలో గానీ ఇతరత్రా గానీ మీరేం ఇబ్బందులు ఎదుర్కోలేదా?"

"చాలామంది మాతో భాగస్వామ్యంకోసం వచ్చారుకానీ నేను ఒప్పుకోలేదు. స్వచ్ఛందంగా సేవ చేసేవాళ్లు, అంకితభావం ఉన్న వాళ్లే కావాలి నాకు అని వాళ్ల ఆఫర్ తిరస్కరించాను. వాళ్లంతా విమర్శలు చేశారు. ఆ తరువాత కూడా ల్యాండ్ విషయంలో కొన్ని గొడవలు జరిగాయి. అప్పుడే నాకు వీణతో పరిచయం ఏర్పడింది. ముందు లీగల్ అడ్వయిజర్‌గా ప్రారంభం అయిన మా పరిచయం... మా భావాలు కలవడంతో మంచి స్నేహంగా మారింది. తను కూడా పాతికవేలు ఆశ్రమానికి విరాళం ఇచ్చి భాగస్వామ్యం తీసుకుంది"

"వామనమూర్తిని ఎలా అరెస్టు చేయగలిగారు?"

నవ్వి చెప్పింది "నీరజ వామనమూర్తి గురించి చెప్పిన విషయాలన్నీ విన్నాక నేను, నా స్నేహితురాలు వీణా కలిసి చిన్న ప్లాన్ వేశాం. నీరజని పంపిస్తాం, వచ్చి తీసుకెళ్లమని ఫోన్ చేశాం. వామనమూర్తి నీరజ కోసం మా ఇంటికి వచ్చాడు. నీరజ అతడిని తన మేనమామగానే భావించి ప్రేమగా మాట్లాడినట్టు చిన్న నాటకం ఆడించాం. తనకి ప్రస్తుతం ఒంట్లో బావుండలేదని, సాయంకాలానికి ఫ్లాట్‌కి వస్తానని చెప్పింది. నీరజ మాటలు నమ్మి, సాయంకాలం నీరజని తీసుకొచ్చి దింపవలసిందిగా మాకు వార్నింగ్ ఇచ్చి వెళ్లిపోయాడు. సాయంత్రం నీరజ మళ్లీ వామనమూర్తి బస చేసిన హోటల్‌కి ఫోన్ చేసి తను బయలుదేరుతున్నట్లు చెప్పింది. నేను, వీణ ఈ విషయాలన్నీ పోలీసులకి చెప్పాం. వాళ్లు వామనమూర్తిమీద ఓ కన్నేసి ఉంచారు. నీరజ తన ఫ్లాట్‌కి వచ్చేసినట్లు అతనికి మళ్లీ సాయంత్రం ఏడు గంటల ప్రాంతంలో హోటల్‌కి ఫోన్ చేసింది. నీరజ మాటలు నమ్మి వామనమూర్తి ఎవరో ఒకతనిని తీసుకుని ఫ్లాట్‌కి బయలుదేరాడు. అప్పటికే అతని ప్రియురాలు అతడికోసం ఎదురు చూస్తోంది. వామనమూర్తిని పోలీసులు ఫాలో అయి అతడు ఫ్లాట్ లోపలికి వెళ్ళి తలుపేసుకోగానే తలుపు దగ్గర నిలబడి వాళ్ల మాటలు విన్నారు. ఆ మాటల్లో నీరజ ఫోన్ చేసినట్టు చెప్పి, ఇంకా రాలేదా అని అడగడం, మమ్మల్ని అడ్డం పెట్టుకుని నీరజ తనని మోసం చేస్తోందని రంకెలు వేయడం అన్నీ విన్నారు. అలా ఆ మాటలద్వారా వాళ్ళు చేస్తోన్న దారుణకృత్యాన్ని తెలుసుకున్నారు. వెంటనే తలుపులు కొట్టి అక్కడ ఉన్న ఆ ముగ్గురినీ అరెస్టు చేశారు. పోలీసులు అంతగా కోపరేట్ చేయకపోయి ఉంటే మా ప్లాన్ ఫెయిల్ అయ్యేది"

"వామనమూర్తి పొలిటికల్ ఇన్‌ఫ్లుయన్స్ ఉన్నవాడని అన్నారు. ఇప్పుడు మీకేం భయం వేయడంలేదా అతనంటే? రేపు





# ఏరిన ముత్యాలు

★ ఆకాశంలో మబ్బూ, అంబుధిలో నీరూ ఒక్కటే. బాహ్యమైన వియోగం వాటి ఏకత్వాన్ని మరింత బలపరుస్తుంది.

*– టాగోర్*

★ సంయమనం సాధించిన విద్యార్థి మనసుకు పరమాణువు మొదలు పరబ్రహ్మం దాకా అన్నీ వశమవుతాయి.

*– పతంజలి*

★ చిన్నచిన్న విషయాల గూర్చి ఎక్కువెక్కువ తెలిసినవాడు ఎక్స్‌పర్ట్

*నికోలాస్ ఎమ్. బట్లర్*

★ పూర్వీకులలో ఎవరో ఒకరు బానిస అయి ఉండని రాజు లేడు. పూర్వీకులలో ఎవరో ఒకరు రాజు అయి ఉండని బానిస లేడు.

*– హెలెన్ కెల్లర్*

★ పరుల దైన్యాన్ని, నమ్మే లక్షణాన్ని ఉపయోగించుకుని పైకి ఎగబ్రాక చూడని వాంఛలన్నీ మంచివే.

*– జోసెఫ్ కానార్డ్*

★ దెబ్బలాడేందుకు సాహసం లేనివాడూ, పరిగెత్తేందుకు స్థూలకాయం అడ్డొచ్చేవాడూ మార్పు కోరడు.

*– ఎల్బర్ట్ హుబార్ట్*

★ ఒకతరం పోతుంది. మరోతరం వస్తుంది. సృష్టి మాత్రం కొనసాగుతూనే వుంటుంది.

*– ఓల్డ్ టెస్టిమెంట్*

★ నిరంతరం అధ్యయనం చేసే ఆచార్యుడే శిష్యులకు బోధించగలడు. వెలుగుతున్న దీపమే మరో దీపాన్ని వెలిగించగలదు.

*– కబీర్*

★ కొండంత బోధన కన్నా గోరంత సాధన మిన్న

*– వోల్టేర్*

★ సంతోషాన్ని మించిన సౌందర్య సాధన మరోటి లేదు.

*– లేడీ బెస్సింగ్‌టన్*

★ సత్కర్మ రహితమైన ఆరాధన వ్యర్థము

*– గురునానక్*

★ ఎదుట తీయగా మాట్లాడి పరోక్షంలో నిర్దాక్షిణ్యంగా విమర్శించే వారి పొత్తు అనర్థం

*– లియాన్ ట్రాట్ స్కీ*

★ పరిశీలన ద్వారా తేలిన సత్యం అటుపిమ్మట సూత్రమై నిలుస్తుంది.

*– ఉల్ఫ్ గ్యాంగ్ వాన్ గొయిథె*

సేకరణ : పి.వి. రమణకుమార్

జైలునుంచి వచ్చాక మీమీద రివెంజ్ తీసుకుంటే? "

"అంత ఇన్‌ఫ్లుయన్స్ ఉన్నవాడైతే వెంటనే బెయిలు తీసుకుని వెళ్ళిపోయేవాడేగా, అలాంటిదేంలేదు. అతను కేవలం బిల్డప్పిచ్చాడు. ఖద్దరు బట్టలు కట్టుకున్నవాళ్ళంతా రాజకీయ బ్యాక్‌గ్రౌండ్ ఉన్నవాళ్ళేనా? అదేంలేదు. అలా చెబితే అందరూ భయపడతారని, తనకు తెలిసిన మంత్రుల పేర్లు చెప్పి, వాళ్ళతో బంధుత్వం ఉందని చెప్పాడు. డబ్బు సంపాదించడానికి అతను తొక్కిన చాలా అసహ్యకరమైన, అవమానకరమైన మార్గం ఇది. ఈ మార్గం సుగమం కావాలంటే రాజకీయాలను అడ్డం పెట్టుకోవాలి.

తరువాత అతను చాలా ప్రశ్నలు వేశాడు. అన్నిటికీ అనూష ఓపిగ్గా సమాధానం ఇచ్చింది.

చాలా సేపటినుంచీ తొలిచేస్తున్న సందేహాన్ని చాకచక్యంగా తీర్చుకున్నాడు.

"మీరు పెద్ద కార్డియాలజిస్టుగా, మంచి సోషల్ వర్కర్‌గా, ఇటు గృహిణిగా ఎంతో సమర్థవంతంగా నెట్టుకుని వస్తున్నారు. మీకు మీ శ్రీవారి సహాయ సహకారాలు బాగా లభిస్తాయనుకుంటాను"

అనూష చిరునవ్వుతో చెప్పింది. "శ్రీవారి సహాయసహకారాల అవసరం ఉండకూడదని, నేను మ్యారేజి చేసుకోలేదు"

ఆ సమాధానం ఎందుకో భరణికి చాలా ఊరటనీ, సంతృప్తినీ ఇచ్చింది. ఆమె ఇచ్చిన కాఫీ తాగి, సెలవు తీసుకుని వచ్చేశాడు.

ఆరోజు అనూషతో జరిపిన ఇంటర్వ్యూ ప్రచురించడానికి, ఆమె ఫొటోలు రంగుల్లో వేయడానికి చాలా శ్రమ తీసుకున్నాడు భరణి. ఆ శ్రమ అతనికెంతో ఆనందాన్నీ, ఉత్సాహాన్నీ ఇచ్చింది.

రెండురోజుల తరువాత ఉదయాన్నే పత్రిక పంపించాడు ఓ కుర్రాడితో అనూష ఇంటికి. ఆమె తన ఫొటోలు, బాక్స్‌లో వేసిన ఇంటర్వ్యూ చదువుకుని సరదాగా నవ్వుకుంది. పత్రిక పంపించిన పావుగంటకి భరణి ఫోన్ చేశాడు.

"గుడ్‌మార్నింగ్ డాక్టర్! పత్రిక అందిందా? "

"హలో! గుడ్‌మార్నింగ్. అందిందండీ చాలా థాంక్స్" అంది.

"థాంక్స్ నేను చెప్పాలి మేడమ్! మీ అంతటివారు మా పత్రికకి ఇంటర్వ్యూ ఇచ్చారంటే మా పత్రిక గౌరవం పెరిగిందన్నమాట. బైది బై మీరు కనీసం వారానికో మెడికల్ ఆర్టికల్ రాసివ్వచ్చుగా మా పత్రికకి"

"నేనా? ఆర్టికలా? ఎప్పుడూ రాయలేదు. ప్రయత్నిస్తాను"

"థాంక్యూ" అన్నాడు.

అతను ఫోన్ పెట్టేయగానే అనూష వీణకి చేసింది.

"అబ్బ దొరికావా? ఇందాకటినుంచీ చేస్తున్నాను. ఎవరితో మాట్లాడుతున్నావు? ఒకటే ఎంగేజ్ వస్తోంది" దబాయింపుగా అంది వీణ.

"ఒక జర్నలిస్టు తగిలాడులే. ఈమధ్య మనం చేసిన ఎడ్వంచర్ గురించి పేపరులో చదివి, నన్ను వాళ్ళ పేపరుకి ఇంటర్వ్యూ చేయడానికి వచ్చాడు మొన్న. ఇవాళ ఆ ఇంటర్వ్యూ పబ్లిష్ చేశాడు. అతనితోటే మాట్లాడుతున్నాను"

"నేనూ అదే చూస్తున్నాను. ఈరోజు ఉదయాన్నే ఎవరో వచ్చి ఈ పత్రిక ఇచ్చివెళ్ళారు. ఏంటి ఫొటోలు రంగు, రంగుల్లో వేశాడు. ఓ యాంగిల్‌లో శ్రీదేవిలా, ఓ యాంగిల్‌లో మాధురీదీక్షిత్‌లాగా ఉన్నావు. అతనెలా ఉంటాడు. సల్మాన్‌ఖానా? అమీర్‌ఖానా, షారూక్‌ఖానా? "

"నీ తలకాయఖానా" అనూష మాటకి గట్టిగా నవ్వింది వీణ.

"అది సరే నేనివాళ సాయంత్రం నీ దగ్గరకి వస్తున్నాను. మీ వంటావిడకి చెప్పు





నాక్కూడా వంట చేయమని ఇవాళ నాకు కోర్టుపని లేదు"

"ఓ ష్యూర్! స్పెషల్ ఐటమ్ చేయిస్తాలే తప్పకుండా రా"

ఫోన్ పెట్టేసి అనూష హాస్పిటల్‌కి వెళ్ళడానికి తయారవసాగింది.

సాయంత్రం త్వరగా వచ్చేసింది అనూష ఇంటికి. వీణ కూడా చెప్పిన ప్రకారం ఆరున్నరకల్లా వచ్చేసి అనూషకోసం ఎదురుచూస్తోంది.

"చాలాకాలానికి నా డార్లింగ్‌తో ఈ రాత్రి గడపడానికి వచ్చాను" అంది వీణ.

"ఏం? ఇవాళ నీ బాయ్‌ఫ్రెండ్స్ ఎవరూ రావడంలేదా? "

"ఊహూ... సెలవిచ్చాను"

"నీకసలు సిగ్గులేదు వీణా! ఎంతకాలం ఇలా తెగిన గాలిపటంలా తిరుగుతావు? పెళ్ళి చేసుకోకూడదూ!"

అనూష మాటలకి పగలబడి నవ్వింది "పెళ్ళా? నేనా...? " అంటూ.

"ఎందుకలా నవ్వుతావు? మతి చలించిందా? " కోపంగా అడిగింది అనూష.

"ఏం లేదు అనూ! పెళ్ళంటే నవ్వొచ్చింది. నేను పెళ్ళి చేసుకోవడం ఏమిటి? ఈ విషయం వింటే నాకు చాలా హాస్యాస్పదంగా అనిపిస్తుంది. వివాహం గురించి, భర్త గురించి నేనెప్పుడూ ఆలోచించను. ఈ జన్మకి నాకు పెళ్ళి అనే తంతుతో సంబంధం లేదు. ఏడాదికో బాయ్‌ఫ్రెండుని మార్చే నేను. పెళ్ళి చేసుకుంటే నాతో కాపురం చేసే సహనం ఏ మగాడికుంది ఈ ప్రపంచంలో? "

"వీణా! బాధ్యతగల లాయర్‌వి, చిన్నపిల్లలా ఏమిటా మాటలు? పెళ్ళి చేసుకుని జీవితంలో సెటిల్ అవ్వు. కొంచెం సెల్ఫ్ డిసిప్లిన్ అలవాటు చేసుకో. ఎంతకాలం ఇలా? "

"ఇన్ని అభ్యుదయ భావాలున్నదానివి. పెళ్ళి కాకుండా సెక్స్ ఎంజాయ్ చేయడం పాపంగా భావిస్తున్నావా? "

"పాపం, పుణ్యం అనేది కాదు సమస్య. డిసిప్లిన్. అంతే. ఎవరో మోసం చేశారనో, మరెవరో ఏదో అన్నారనో వాళ్ళమీద కోపంతో నీ జీవితం ఎందుకు పాడుచేసుకుంటున్నావు? ఇవాళ నీతో ఎంజాయి చేసినవాళ్లంతా రేపు నీకేదన్నా కష్టం వస్తే ఆదుకుంటారా? నిన్నెంత చులకనగా చూసి మాట్లాడతారో తెలుసా!"

"డిసిప్లిన్..." వీణ దిండుమీద వెనక్కివాలింది. "అనూ! పెళ్ళి చేసుకుని కాపురాలు చేస్తున్న వాళ్ళంతా నువ్వన్నట్టు డిసిప్లిన్డ్‌గా ఉన్నారా? భార్య భర్తనీ, భర్త భార్యనీ మోసం చేసుకుంటూ, కపట ప్రేమలతో, నాటకాలతో బతికేవాళ్లను నేను ఎంతమందినో చూశాను" అంటూ ఇంకా ఇలా అంది.

"నా చిన్నప్పుడు మా ఇంటిపక్క పోర్షనులో కొత్తగా పెళ్ళయిన దంపతులు దిగారు. నాకప్పుడు పధ్నాలుగేళ్ళు ఉంటాయి. వాళ్ళు చాలా అన్యోన్యంగా ఉండేవాళ్ళు. అతను ఇంట్లో ఉన్నంతసేపూ తలుపులు వేసే ఉండేవి. ఒకరోజు అతను ఆఫీసుకి వెళ్ళాడు. అమ్మ వాళ్ళింటికి వెళ్ళి గ్లాసుడు పంచదార తెమ్మని పంపించింది. నేను గ్లాసు తీసుకుని బయలుదేరాను. వీధి తలుపు వేసి ఉంది. ఆయన ఆఫీసుకి వెళ్లడం చూశాను. ఆవిడ లోపల ఉందేమో, వీధి తలుపు వేసిందేమో అని పక్కన ఓ సందులా ఉండేది, ఆ సందుగుండా వెళితే పెరడు. అటునుంచి వంటగదివైపు తలుపు ఉండేది. ఆ సందుగుండా వెళ్ళాను. పెరట్లో కొన్ని చెట్లు, మరికొన్ని మొక్కలు ఉండేవి. మొత్తం కాంపౌండ్‌వాల్ ఎత్తుగా ఉండేది. ఎవరితో సంబంధంలేదు. నేను వంటగది తలుపు తీసి ఉండడం చూసి, లోపలికి వెళ్ళాను. వంటగదిలో లేదావిడ. అందులోంచి నడవాలోకి దారి, నడవా గుండా వెళితే పడకగది, వరండా. నేను నడవాలోకి వెళ్ళేటప్పటికి పడక గదిలోంచి నవ్వులు విని

పించాయి. ఎవరొచ్చారబ్బా అని ఓరగా వేసి ఉన్న తలుపులోంచి తొంగిచూశాను. ఆవిడా, ఇంకొకవ్యక్తి ఉన్నారు కానీ అతను ఆమె భర్తకాదు. ఎలాంటి స్థితిలో ఉన్నారో చెప్ప మంటావా? " అడిగింది వీణ.

"వద్దులే" అనూష వీణ నోరు మూసింది.

"వినడానికే నీకింత కష్టంగా ఉందే, నేన లాంటి సీన్లు కొన్నివందలు చూశాను నే పుట్టి పెరిగిన వాతావరణంలో. అనూ! మన ఈ స్నేహంలో నేనెన్నడూ నీ పర్స నల్ విషయాలు అడగలేదు. నా పర్సనల్ విషయాలు చెప్పలేదు. ఎందుకో తెల్సా? నీ పర్సనల్ విషయాలు నేనడిగితే, నా అస హ్యకరమైన జీవితం గురించి నేను చెప్పాల్సి వస్తుందని, అది విని నువ్వు నామీద జుగుప్స పెంచుకుంటావేమోనని. కానీ ఆరోజు నీరజ ఆశ్రమాన్నుంచి తప్పిపోయిన రోజు నీకు ఏమాత్రం మోరల్ సపోర్టు ఇవ్వకుండా, నేను తాగి, ఎంజాయ్ చేసిన ఆ రాత్రి తల్చుకుంటే నామీద నాకే రోత పుట్టింది. అప్పుడే అనుకున్నాను నా గతం నీకు చెప్పాలని. నేను నిన్నెప్పుడూ 'ఇంత వయసు వచ్చినా పెళ్ళెందుకు చేసుకోలేదు' అని అడగలేదు, నువ్వు రోజూ పూజించే ఆ ఫొటో చూసి, మీ అమ్మగారు, నాన్నగారు లేరని అర్థం చేసుకున్నాను"

అనూష దృష్టి తల్లిదండ్రుల ఫొటోమీదకి పోయి సన్నగా నిట్టూర్చింది.

"అలాగే నీ ఈ ఆస్తి, ఈ ఇల్లు, నువ్వు బతికే విధానం, ఆశ్రమానికి ఉదారంగా నువ్విచ్చిన ప్లాట్లు, కట్టించిన గదులు, విరాళాలు, ఇవన్నీ చూస్తే మీ నాన్నగారు నీకు చాలా ఆస్తి ఇచ్చి వెళ్ళారని తెలుసుకున్నాను.

నీకు తెలుసా! నాకు పదహారేళ్ళు వచ్చే దాకా మాకు రెండుపూట్లా కడుపునిండా తిండి కూడా ఉండేదికాదు. మా నాన్న బడి పంతులుగా చేసేవాడు. మేం ఏడుగురం పిల్లలం. అందులో పెద్దవాడు అన్నయ్య, రెండు అక్క, మూడు నేను. తరువాత ఇద్దరు తమ్ముళ్ళు చెల్లెళ్ళు. ముందు మా అన్నదమ్ముల గురించి, అక్కచెల్లెళ్ళ గురించి చెప్తాను. ఆ తరువాత నా గురించి చెబుతాను. ఎందుకంటే నా గురించి చెప్పుకోడానికేంలేదు. చరిత్రకారుల గురించి చెప్పుకుంటాం గానీ చరిత్రహీనుల గురించి చెప్పుకోలేం కదా!

నాన్నగారికి ఎంత జీతం వచ్చేదో మాకు తెలీదుకానీ మమ్మల్ని అందరినీ గవర్నమెంటు స్కూల్స్‌లో చేర్పించారు నాన్న. అమ్మ తను తినకుండా మాకు, నాన్నకి పెడుతుండేది. అది కూడా మాకు సరిపోయేదికాదు. ఒకపూట కడుపునిండా తింటే, మరోపూట పెట్టింది తిని, సరిపెట్టుకోవాల్సి వచ్చేది. అలా మా అమ్మ తన ఆయుర్దాయం మాకూ, మా నాన్నకీ ఇచ్చి, తను యాభైఏళ్లు వచ్చేటప్పటికి చనిపోయింది. అప్పటినుంచి ఇంటిభారం అక్కయ్యమీద పడింది. చదువు మాన్పించారు నాన్న. అమ్మ స్థానం అక్క భర్తీ చేయాల్సి వచ్చింది. అమ్మలాగే వంటచేసి, ఇల్లు చూసుకుని, మమ్మల్నందరినీ చూసుకున్నా, ఆవిడలాగా అక్కయ్య త్యాగం మాత్రం చేయలేకపోయింది. ఏడాదికూడా తిరక్కుండానే ఇంటి పక్కనే ఉండే కుర్రాడితో మెద్రాస్ పారిపోయింది. "అతను సినిమాల్లో వేషం ఇప్పిస్తానని తీసుకెళ్లాడనీ, ఎక్స్ట్రా వేషాలేసుకుంటూ, ఏపూట తిండి ఆపూట సంపాదించుకుంటున్నానని, తీసుకెళ్లినవాడు ఏడాదిగా పత్తా లేడనీ, తనగురించి ఎవరికీ చెప్పద్దనీ, రెండేళ్లతరవాత ఉత్తరం రాసింది నాకు. అది వేరే సంగతి. అన్నయ్య మెట్రిక్ తప్పాడు. అయినా పిల్లనివ్వడానికి మగాడైతే చాలని ఎదురు చూసిన పిల్ల తండ్రి అన్నయ్యను అల్లుడిగా చేసుకుని మా అందరికీ దూరంగా తీసుకెళ్లిపోయాడు. మా చెల్లెళ్లల్లో ఒకతి పెళ్లి కాకుండానే పదహారేళ్లకే గర్భవతి అయి

ఆత్మహత్య చేసుకుంది. మరో చెల్లి కొంచెం మెతక. వెర్రి బాగులది. దాన్ని ఓ ముసలా డికిచ్చి తూతూ మంత్రంగా పెళ్లి చేశాడు నాన్న. మా తమ్ముళ్లలో ఒకడు గూండాగా మారి దాదాగిరి చేస్తూ బతకడం నేర్చుకు న్నాడు. మరొకడు చిన్నాచితకా పనులు చేస్తూ బతకడం ప్రారంభించాడు. ఇదీ మా కుటుంబ చరిత్ర. ఇంక నా చరిత్ర చెబు తాను విను"

అనూష కుతూహలంగా వింటోంది. వింటున్నకొద్దీ వీణమీద సానుభూతి వెల్లు వలా పొంగింది. తను రోజూ చూసే వీణ కాకుండా మరో వీణ కనిపించసాగింది. ఆ చలాకీతనం, తెగింపు, విచ్చలవిడి మాటలు ఏమీ లేవు. జీవితంలో ఆటుపోట్లకు గురై అలసట తీర్చుకుంటున్నట్లుగా మంచంమీద పడుకుని చెప్పసాగింది.

"మా నాన్న తన సంతానాన్ని చూసి ఎంతగా కుమిలిపోయాడో తెలియదుగానీ, అందరూ తలా ఒక దారి వెళ్లిపోయాక ఆయనని కనిపెట్టుకుని ఉంటూ, ఎస్సెస్సీ పాసైన నాతో ఓసారి మనసు విప్పి మాట్లా డాడు.

"వీణా! ఏ జన్మలో ఏ పాపం చేశానో నా కుటుంబం చెల్లాచెదరైంది. దీనిక్కారణం మన పేదరికం. మీకెవరికీ కడుపునిండా తిండి పెట్టలేకపోయాను. మంచి బట్టలు కుట్టించలేకపోయాను. కనీసం అరటిపండు కూడా కొనివ్వలేకపోయాను. అందుకే వీళ్లంతా ఎవరి దారిన వాళ్లు వాళ్ల సుఖం, సంతోషం వెతుక్కుంటూ వెళ్లిపోయారేమో. భగవంతుడు ఇంకా నామీద ఈమాత్రం దయతల్చాడు కాబట్టి నిన్నైనా మిగిల్చాడు. నువ్వు మాత్రం ఇలాగే ఎలాగో కష్టపడి పరీ క్షలు పాసై కనీసం డిగ్రీ అన్నా చదువుకో. మంచి పిల్లవాడిని చూసి పెళ్లి చేసుకో. సదాశివం పిల్లల్లో కనీసం ఒక్కళ్లన్నా పైకి వచ్చారని నలుగురూ అనుకునేలా బతుకు. నేనూ, మీ అమ్మా పైనుంచి చూసి సంతో షిస్తాం తల్లీ" అన్నాడు.

నాకు బాగా ఏడుపు వచ్చింది. చాలాసేపు వెక్కివెక్కి ఏడ్చాను. నా తల నిమురుతూ ఉన్న నాన్న చేయి మరి కదలలేదు.

ఆ తరువాత నేను, మా తమ్ముడూ ఆ ఇల్లు ఖాళీ చేసి విజయవాడ వెళ్లిపోయాం. వాడు అక్కడ మెకానిక్ షాపులో పనిచేస్తూ తనక్కావాలిసిన డబ్బు తను సంపాదించుకు నేవాడు. ఇల్లు గడపాల్సిన భారం మాత్రం నామీద పడింది. నేను ఉద్యోగం చూసుకో వాలని ప్రయత్నించాను. ఆ ప్రయత్నంలో చాలా ఇబ్బందులు, అవమానాలు ఎదురై నాయి. ఉద్యోగం కావాలంటే ఏం చేయాలో చాలా ప్రాక్టికల్‌గా చెప్పేవాళ్లు. మొదట్లో వాళ్లని తిట్టి వచ్చేసేదాన్ని. తరువాత తరు వాత కడుపులో ఆకలి నాలో తెగింపు కల గచేసింది. అలా ముందు ఆకలి తీర్చుకోడా నికి, తరవాత లా చదవాలన్న నా కోరిక తీర్చుకోడానికి నా పతనం ప్రారంభమైంది. తమ్ముడు పెద్దవాడయ్యాడు. నా ప్రవర్తన వాడికి అసహ్యం వేసిందో, లేక నానుంచి విడిపోయి తను సుఖంగా బతకాలనుకు న్నాడో తెలియదుగానీ వాడు వెళ్లిపోయాడు.

ఆవిధంగా నేను చిన్న చిన్న ఉద్యోగాలు చేస్తూ ప్రైవేటుగా గ్రాడ్యుయేషన్ పూర్తి చేసి లా కూడా చేశాను. ఉద్యోగంలో సంపాదిం చేది తక్కువ అయినా నా అందం ద్వారా నా వయసు ద్వారా నేను సంపాదించింది నా చదువుకీ, బట్టలకీ సరదాలకీ సరిపోయేది. బార్ కౌన్సిల్‌లో రిజిష్టర్ చేయించుకుని ఓ సీనియర్ లాయర్ దగ్గరకెళ్లాను. నన్ను తన జూనియర్‌గా చేర్చుకోవడానికి మూల్యం అడి గాడు. ఒప్పుకున్నాను. నా ధ్యేయం అంతా నేను పెద్ద లాయర్ని అవాలి. నాముందు ఒక లక్ష్యం ఉంది. నేనా లక్ష్యాన్ని చేరడానికి నాకు రహదారి మూసుకుపోయింది. దాని క్కారణం నేను అనాథని. రెండు నా దరిద్రం. అందుకే నేను నడిచే దారిలో పెంటకుప్పలెదురైనా కళ్లు మూసుకుని వెళ్లిపో

యాను. ఇవాళ నాకు హోదా ఉంది, ఇల్లుంది, కారుంది, సంఘంలో పేరు ప్రతిష్ఠ ఉన్నాయి. ఇవన్నీ ఎలా సంపాదించావని నన్నెవరూ ప్రశ్నించలేదు."

అనూష అవునన్నట్టు చూసింది. వీణ లేచి అనూష ఒళ్లో తల పెట్టుకుంది. "అనూ! అప్పుడంతా నేను అనుభవించింది జీవితం కాదు. నరకం. ముసలాళ్లు, అంద విహీనులు, వెర్రి వెధవలు... ఇలా ఎవడు పడితే వాడు అనుభవించిన శరీరం తగల బెట్టేశాను. నాకు నచ్చినవాడు, మనసారా నేను శృంగార రసాస్వాదనలో కరిగిపోయేలా చేయగలిగినవాడు దొరికాడనుకుని, తోటి లాయరు విశ్వనాథ్‌ని ప్రేమించాను. మా, ప్రేమ పెళ్ళిదాకా వచ్చింది. అతన్ని మోసం చేయడం ఇష్టంలేక జరిగిందంతా చెప్పేశాను. అంతే ఆ తరువాత అతను పత్తాలేడు. దాంతో నా మనసు బాగా దెబ్బ తిన్నది. నా జీవితానికింక పెళ్లి, సంసారం, పిల్లలు వగైరా ఉండవన్న సంగతి స్పష్టమయింది. అలా అనుకున్న తరువాత నేనెవరికోసం పవిత్రతను అరువు తెచ్చుకోవాలి? ఎవరికోసం క్రమశిక్షణతో బతకాలి? అనుకున్నాను. అందుకే అప్పటినుంచీ నాకు నచ్చినవాడు, నేను మెచ్చినవాడు కనిపిస్తే చాలు, మనస్ఫూర్తిగా 'ఎంజాయ్' చేయడం మొదలుపెట్టాను"

అనూష వీణ తలమీద చేయివేసి, నిమురుతూ ఆప్యాయంగా అంది, "పిచ్చిదానా! మనం జీవించేది ఒకళ్లకోసం కాదు. మన కోసం, సెల్ఫ్ డిసిప్లిన్ అలవాటుచేసుకోడం జీవితం సుఖంగా సాగిపోడానికి చాలా అవసరం. ఇకనుంచీ అయినా ఈ పద్ధతికి స్వస్తిచెప్పు. ఎవరో ఆదర్శమూర్తులు దొరక్కపోరు, నా మాట విని పెళ్ళి చేసుకో"

వీణ చిరునవ్వు నవ్వింది. "పెళ్ళా! ఆ మాట మాత్రం అనకు"

"పెళ్ళి చేసుకోకుండా ఎలా బతుకుతావు వీణా?"

"ఇలాగే, నా ఇష్టం వచ్చినట్లు జీవితం అనుభవించాలి. రేపో మాపో పోయే దాన్ని. భర్త, పిల్లలు అనే బంధాలు తగిలించుకోడం ఎందుకు? నన్నిలా బతకనీ అనూ! నాకీ జీవితం బాగుంది"

"లేదు వీణా! ఇదే బాగుంది అంటూ నువ్వు మోకాళ్లతో నడుస్తున్నావు"

"లేదు రెండుకాళ్ళు నేలకాన్చి నిటారుగా, ఆత్మవిశ్వాసంతో నడుస్తున్నాను"

"ఏటికి ఎదురీదడం అని దీన్నే అంటారేమో!"

"ఎదురీది బతికి విజయం సాధించడంలో థ్రిల్ ఉంది. ఎఛీవ్‌మెంట్ ఉంది. అది సరే! నా సంగతి వదిలెయ్ నువ్వెందుకు పెళ్లిచేసుకోలేదో చెప్పు ముందు"

అనూష కొంచెంసేపు మౌనంగా ఉండి అంది "ప్రత్యేకమైన కారణం అంటూ ఏం లేదు. అమ్మా, నాన్న పోయాక నా విషయం ఆలోచించి, నాకు పెళ్ళిచేయాలని ఎవరు ప్రయత్నిస్తారు?"

"నీకు ఒకళ్లు చేయడం ఏమిటి? అనూ! అందం, చదువు, హోదా, ఆస్తి ఇన్ని ఉన్న నిన్ను ఇంకా కన్నెపిల్లగా ఉండనిచ్చారంటే ఈ దేశంలో నీకు భర్తకాగల అర్హత ఉన్న మగాడు పుట్టలేదన్నమాట"

అనూష నవ్వింది "పద ఆకలేస్తోంది భోంచేద్దాం"

★ ★ ★

భరణి అవకాశం దొరికినప్పుడల్లా అనూష దగ్గరకి వస్తూనే ఉన్నాడు. తన గురించి, తన పత్రిక గురించి, రాజకీయాలు, సినిమాలు, టీవీ సీరియల్స్, అతనికి తెలియని సబ్జెక్ట్ అంటూ లేదేమో అనిపిస్తుంది. అతని స్నేహశీలత అనూషకి నచ్చింది. ఉదయంగాని, సాయంత్రాలుగానీ, ఆమె ఇంట్లో ఉన్న సమయం చూసుకుని వస్తుంటాడు. తను ఎక్కువగా మాట్లాడకపోయినా, అతని మాటలు మాత్రం బాగా ఎంజాయ్ చేస్తుంది. ఒకరోజు అతను





ఇంట్లో ఉన్న సమయంలో వీణ వచ్చింది. పరస్పరం పరిచయాలయ్యాక అతను వీణని కూడా ఇంటర్వ్యూ చేసి, పత్రికలో వేస్తానన్నాడు.

వీణ చిరునవ్వుతో అంది "మా అనూషని చేసినప్పుడే నా ఇంటర్వ్యూ కూడా అయిపోయింది"

భరణి ఆశ్చర్యంగా చూశాడు "ఎలా? "

"నా స్నేహితురాలు, లాయరు వీణ అని నా పేరు తను చాలాసార్లు రెఫర్ చేసిందిగా"

"ఓ!" నవ్వాడు.

"మీరు చాలా సరదాగా మాట్లాడతారు"

"థాంక్స్" ముగ్గురూ కాఫీ తాగారు.

"ఓకే మేడమ్! మరి నేవస్తాను, డాక్టరు గారూ! శలవా? " అడిగాడు.

"ఓకే గుడ్‌నైట్" జర్నల్ పక్కన పెట్టేసింది అనూష.

అతను లేచి వెళ్ళిపోయాడు.

★ ★ ★

మరునాడు ఆశ్రమానికి వెళ్ళారు అనూషా, వీణ... అనూష కారు గేట్లోకి రాగానే బాబునెత్తుకుని సుశీల, పెరట్లోంచి శారదా, శ్యామలా పరిగెత్తుకొచ్చారు.

"ఎలా ఉన్నార్రా? " అడిగింది అనూష.

"మేమందరం బాగున్నాం మేడమ్! మీరెలా ఉన్నారు? వీణగారూ కులాసానా? " అడిగింది శారద.

శ్యామల మొహం వాడిపోయి ఉండడం చూసింది అనూష. ఎందుకో ముభావంగా, ఏదో ఆలోచిస్తూ ఉన్నట్టుగా ఉంది.

"ఏం శ్యామా! ఏంటి భోజనాలు అయిపోయాయా? మీ ఇద్దరూ అప్పుడే పెరట్లో షికార్లు చేస్తున్నారు" నవ్వుతూ అడిగింది వీణ.

"అబ్బే షికారేం లేదు, మొక్కలకి పురుగు పడితే మందులు చల్లించి వస్తున్నాను" బలవంతంగా నవ్వింది శ్యామల.

"నీరజ ఎలా ఉంది? " సుశీల చేతుల్లోంచి బాబుని అందుకుంటూ అడిగింది.

"నీరజా!" శ్యామల పిలిచింది. బాబుకి స్వెటర్ అల్లుతోన్న నీరజ గదిలోంచి వచ్చింది. అనూషని చూసి గబగబా వచ్చి, కాళ్ళకు దణ్ణంపెట్టింది.

"ఎందుకిలా? తప్పుకదూ! దేవుడికి పెట్టు, నాక్కాదు" నీరజని లేవనెత్తి అంది అనూష.

శారద అంది "మేడమ్ నీరజ ప్రైవేటుగా కట్టి బి.ఏ. పూర్తిచేయాలనుకుంటోంది"

"అలాగా! దానికేం, తప్పకుండా చేయచ్చు కానీ తన పాత సర్టిఫికెట్లు కావాలి కదా! అవి ఉన్నాయా నీరజా? " అడిగింది.

నీరజ తలవంచుకుని అడ్డంగా తలూపుతూ "లేవు" అంది.

"మరెలా? కనీసం టెన్త్ సర్టిఫికెట్ తప్పనిసరిగా కావాలి, మీ నాన్నగారికి లెటర్ రాయి తెచ్చిస్తారు"

నీరజ ఏడిచింది మాట్లాడలేదు.

"సరేలే, చూద్దాం నువ్వు వెళ్లద్దు, అడ్రసు ఇవ్వు నేనే ఎవరినన్నా పంపిస్తాను, సరేనా!" నీరజ కృతజ్ఞతగా చూసింది.

తరువాత ఇద్దరూ కలిసి కుట్టుమిషను, ప్రింటింగ్ యూనిట్ ఉన్న పెద్ద హాలువైపు వెళ్లారు. మెయిన్ బిల్డింగ్‌కి ఆనుకుని ఉన్నాయి రెండు పెద్ద హాల్సు, నాలుగు గదులు, ఆ హాల్సులో ఒకదాంట్లో కుట్టుమిషను, ఒకదాంట్లో చీరల మీద ప్రింటు వేసే ఎక్విప్‌మెంట్ ఉంది. అదికాక చీరలు రోలింగ్ చేయడానికి కావలసిన రోలింగు కర్రలు కూడా ఉన్నాయి. అక్కడ చాలా మంది పనులు చేస్తూ ఉంటారు. పగలంతా కొందరు బట్టలు కుడుతుంటే, కొందరు రోలింగ్ చేయడం, చీరలమీద అద్దకాలు వేయడంలాంటివి చేస్తుంటారు.

ఇద్దరూ కలిసి ఆశ్రమం మొత్తం తిరిగి ఎలా ఉందో పర్యవేక్షించారు.

కుట్టుమిషన్ల దగ్గర కూర్చున్నవాళ్లు అన్నారు "మిషన్లు కొన్ని పాడైనాయమ్మా,

బాగుచేయించాలి. అదీకాక" ఆగిపోయింది.

"చెప్పండి అదీగాక" అడిగింది అనూష.

"ఇప్పుడు కొత్త రకం మిషన్లు వచ్చాయట మార్కెటులోకి. దానిమీద ఎంబ్రాయిడరీలు, పీకోలు, అన్నీ కుట్టుకోవచ్చట. అలాంటి మిషన్లు కొంటే, బైటనుంచి పని తెచ్చుకుని, నాలుగురాళ్ళు సంపాదించే మార్గం చూసుకుంటాం... కనీసం మా మందులకైనా వస్తాయి కదా!"

అనూష తల పంకించింది.

"అలాగే ప్రయత్నిస్తాం. ఒక్కసారి కలెక్టరుగారిని, మినిష్టరుగారిని కలుసుకుంటాం. ఫండ్స్ ఏవన్నా వస్తే తప్పకుండా కొంటాం" వీణ మాటిచ్చింది.

తిరిగి హాల్లోకి వెళ్లేటప్పటికి శ్యామల వేడి వేడిగా ఉల్లిపాయ పకోడి చేస్తోంది. శారద ప్లేట్లలో సర్దుతోంది. "మృదుల కనిపించలేదేంటి?" అడిగింది అనూష శారద ఇచ్చిన పకోడి ప్లేటు అందుకుంటూ.

శారద శ్యామల మొహం చూసింది.

శ్యామల ఏం మాట్లాడలేదు.

అనూష, వీణ మొహమొహాలు చూసుకున్నారు. "ఏం జరిగింది?" అడిగింది అనూష.

"మృదుల పెళ్ళి చేసుకుంది"

"అవునా? ఎప్పుడు? ఎవరిని?"

శ్యామల చేయి కడుక్కుని టవల్‌తో తుడుచుకుంటూ వచ్చింది. "బ్యాంకులో పరిచయం అయాడట, చాలాకాలం అయిందిట, మధ్యమధ్య స్నేహితురాలింటికి అని చెప్పి, అతని రూమ్‌కి వెళ్ళి, గడిపివస్తోంది. ఈ విషయం ఎవరికీ తెలీదు. ఈమధ్య, రాత్రిళ్ళు కూడా అస్తమానం అక్కడే ఉండిపోతోంది. నాకు అనుమానం వచ్చి అడిగాను. అప్పుడేం చెప్పలేదు. నిన్న అతడిని గుళ్లో పెళ్ళిచేసుకుని వచ్చి తన సామాను తీసుకుని వెళ్ళిపోయింది. మీరు వస్తే చెప్పమంది. అతడికి గుంటూరు ట్రాన్స్‌ఫర్ అయిందిట. అక్కడికి వెళ్ళిపోయింది. ఇంత కాలంనుంచీ ఆ ట్రాన్స్‌ఫర్‌కోసమే ఆగారుట"

"ఈ విషయం ముందే చెబితే మనమే కొంచెం ఘనంగా పెళ్ళిచేసేవాళ్లం కదా! అతను మంచివాడై ఇద్దరూ ఒకళ్లనొకళ్లు ఇష్టపడితే కాదని ఎందుకంటాం?" ఆశ్చర్యంగా చూస్తూ అంది వీణ.

అనూష సన్నగా నిట్టూర్చి అంది. "ఆల్‌రెడీ జీవితంలో ఒకసారి ప్రేమించి, మోసపోయేగా ఇక్కడికి వచ్చింది. మళ్ళీ ప్రేమ అనే ప్రలోభంలో ఎందుకు పడుతున్నావు అని అడ్డుపడతాం అనుకుందేమో. ఈ ప్రేమ, ఆకర్షణ, బంధాలు, వీటికి స్త్రీ బానిస అయిపోతుంది. సరేలే తను సుఖంగా ఉండాలని ఆశిద్దాం"

కాస్సేపు కూర్చుని, టీలు తాగి, బయలుదేరారిద్దరూ.

కారులో కూర్చున్నాక అంది అనూష "వచ్చేవారం ఒకసారి మినిస్టరుగారిని కలవాలి వీణా"

"ఈ జిల్లా కలెక్టరు కొత్తాయన వచ్చాడు... కరప్టట"

"ఎవరాయన? పేరేంటి?" అడిగింది అనూష.

"ప్రశాంతకుమార్"

షాకింగ్‌గా చూసింది "ప్రశాంతకుమారా?"

"అవును ఏం అంత ఆశ్చర్యపోతున్నావేం"

"ఏం లేదు" అనూష మొహం తిప్పేసుకుంది.

కారు ఇంటిముందు ఆగింది. "లోపలికి రాకూడదూ" అడిగింది కారు దిగుతూ వీణ.

"లేదులే, నాకిప్పుడు మూడ్‌లేదు. తరువాత వస్తాను. గుడ్‌నైట్" చెప్పి కారు రివర్స్ చేసుకుని, బేగంపేటవైపు పోనిచ్చింది.

"ప్రశాంతకుమార్!" ఎంతకాలమైంది ఈ పేరు విని.

పదిహేను సంవత్సరాలు. పెద్దవాడైపో





యుంటాడు. పెళ్ళి, పిల్లలు, బహుశా సగం ముసలివాడైపోయుంటాడు. అనూష పెదాలపైన చిరునవ్వు మెరిసింది. ఎన్ని లక్షలు కట్నం తీసుకొచ్చిందో భార్య. ఇంకా దాహం తీరలేదేమో లంచాలు తీసుకుంటున్నాడని చెప్పింది వీణ.

ఆమె మనసు ఒక్కసారిగా పదిహేను సంవత్సరాల వెనక్కి వెళ్ళిపోయింది.

ఎంతకాలమైంది? ప్రశాంత్!... తనని ప్రాణాధికంగా ప్రేమిస్తున్నానంటూనే తన తల్లితండ్రుల కోరిక మేరకు పెళ్ళికి ముందే ఆస్తి తనకి రాయాలన్న ప్రశాంత్... అంత డబ్బుమనిషని, తన ఆస్తికోసం ఆశపడుతున్నాడనీ తెలుసుకోలేకపోయింది. ఎంతో అన్యోన్యంగా, ప్రాణానికి ప్రాణంగా మెలిగిన వ్యక్తి. ఆస్తి విషయంలో అంత ఖచ్చితంగా వ్యవహరిస్తాడని అనుకోలేదు. తన తల్లితండ్రులు వారి తదనంతరం ఇచ్చినప్పుడే మనము ఆస్తి తీసుకోవాలని ఎంత చెప్పినా వినలేదతడు. అభిప్రాయభేదాలు మనుషుల్ని విడదీస్తాయేగాని, ఈ బంధం అంత త్వరగా తెగదని, ప్రశాంత్ మనసు మార్చుకుని తిరిగి వస్తాడని ఎదురుచూడడంలో కాలం బరువుగా గడిచిపోయింది.

అన్నీ ఉన్నా కూతురికి పెళ్ళి యోగం పట్టలేదని జగదాంబ కుమిలిపోయింది. "ఆస్తి మొత్తం ఇచ్చేద్దాం ఒప్పుకోవే. వెధవ ఆస్తికోసం పెళ్ళెందుకు మానుకుంటావు" అని గోల చేసింది. దెబ్బతిన్న అనూష మనసు ఆవిడకి అర్థంకాలేదు. ఆస్తికోసం కాదని, నిజాయితీ లోపించిన, డబ్బుకి విలువ ఇచ్చిన ప్రేమ తనకి వద్దని ఆవిడకి చెప్పే శక్తి అనూషకి లేకపోయింది. గడిచిన కాలం జగదాంబని తనతో తీసి కెళ్ళిపోయింది.

ఆవిడ పోయిన కొంతకాలానికి తండ్రి చనిపోయాడు.

ఏ ఆస్తి అయితే ప్రశాంత్ కోరుకున్నాడో ఆ ఆస్తి మొత్తానికి అనూషే వారసురాలు అయింది.

ఆరోజు అతనలా వ్యాపారదృష్టితో మాట్లాడకపోయి ఉంటే ఈనాడు ఈ ఆస్తి మొత్తం అతనికే ఇచ్చేది. తనకేమాత్రం ఆనందాన్ని, సంతృప్తినీ ఇవ్వని ఆస్తిమీద ఆమెకి వ్యామోహం లేకపోవడంతో ఆశ్రమానికి ఖర్చు పెట్టింది.

ఆ రాత్రి ఎంత ప్రయత్నించినా అనూషకి నిద్రపట్టలేదు.



**భ**రణి పత్రిక మరో ఇష్యూ రావాల్సి ఉంది. గత సంచికలో అనూషతో ఇంటర్వ్యూ వేయడంతో హాట్‌హాటు న్యూసు ఉందని రెండొందల కాపీలదాకా అమ్ముడుపోయాయి. ఈ సంచికలో కూడా అనూషకి సంబంధించిన న్యూస్ ఐటమ్ ఉంటే బాగుండు అనిపించింది అతనికి. ముందు ఆమె చేసిన సాహసానికి ముగ్ధుడై కేవలం ఆమె ఇంటర్వ్యూకోసు ఆమెని కలిసిన భరణి క్రమంగా ఆమెతో స్నేహం కలిపాడు. వారానికోసారో. రెండుసార్లో ఆమెని కలవడం, కబుర్లు చెప్పడం, ఫోన్‌లో మాట్లాడడంతో ఆమె ఆప్యాయత, మెత్తని మాటతీరు, హుందాతనం, ఆమె ఆశయాలు అతన్ని ఆకర్షించసాగాయి. ఇప్పుడు తన పత్రిక ప్రతి

సంచికలో అనూషకి సబంధించిన మేటరు తప్పనిసరిగా ఉండేలా చూసుకునిగానీ, సంచిక బైటికి రానీయదల్చుకోలేదతను.

అతని కోరిక ప్రకారం 'ఆరోజు ఓ చిత్ర మైన సంఘటన జరిగింది.

ఉదయం ఆరుగంటలవుతోంది. అనూష అప్పటికి వాకింగ్‌కి వెళ్ళింది. ఆరున్నరకి ఆమె తిరిగి వచ్చేటప్పటికి ఓ స్త్రీ, ఓ పురుషుడు గేటు దగ్గర కూర్చుని ఉన్నారు. ఆ స్త్రీ ఒడిలో ఆరేళ్ళ పాప ఉంది. వాచ్‌మన్ గేటు దగ్గర స్టూలుమీద కూర్చుని ఉన్నాడు. అనూష రాగానే చెప్పాడు.

"వీళ్ళు మిమ్మల్ని కలుసుకోడానికి వచ్చారమ్మా! దవాఖానల కలువమంటే ఈడనే కలుస్తమని వెయిట్ చేస్తున్రు" అతడి మాటలు పూర్తికాకుండానే ఆ స్త్రీ అనూష దగ్గరికి పరిగెత్తుకొచ్చి కాళ్ళమీద పడిపోయింది ఏడుస్తూ. ఒక్కక్షణం ఆమెకేం అర్థంకాలేదు ఏం జరుగుతోందో!

ఆమెని లేవదీసి, లోపలికి తీసుకొచ్చింది. ఆమె వెనకాలే అతను కూడా వచ్చాడు.

"మా బిడ్డను బతికించు తల్లీ! చచ్చి నీ కడుపున పుడతా", అన్నదా స్త్రీ మళ్ళీ ఏడుస్తూ.

"ఏం జరిగింది? " అడిగింది అనూష.

"నా బిడ్డకి గుండెలో రంధ్రం ఉందంట. ఆపరేషన్ చేయాల్నంట. నిమ్స్‌కు తోల్కపొమ్మన్రు ఉస్మానియాల. ఆడికి పోతే మమ్ములను షరీకు చేస్కొలె అమ్మా! నువ్వు దయగల తల్లివని చెప్పిన్రు, నీ చేత్తో ఆపరేషన్ చేస్తే నా బిడ్డ నూరేల్లు బతుకుతదని చెప్పిన్రు. నా బిడ్డని బతికించు తల్లీ" అతను కన్నీళ్లతో చేతులు జోడించాడు.

"అవు తల్లీ ఉస్మానియల షరీకు చేస్కొలె, బీదోల్లమని ఇంకో దవాకానలకూడా షరీకు చేస్కొలె, ఉస్మానియల నర్సమ్మ చెప్పింది నిన్ను కలువుమని. నీ ఇంట్లో పనిచేసి నీ రుణం తీర్చుకుంట తల్లీ. నా బిడ్డని బతికించు" బావురుమంది ఆ స్త్రీ.

"ఈ పిల్ల వయసెంతమ్మా? " అడిగింది అనూష ఆ పాపని పరీక్షిస్తూ.

"ఆరు సంవత్సరాలు"

"ఎప్పటినుంచి జబ్బుతో ఉంది? "

"గది పుట్టిన సంది బీమారె ఉండె. మస్తు దవకానలల్ల చూపించినం. ఏడకిపోయిన తగ్గలె. గట్లనె ఆరు సంవత్సరాల సంది నడిపిస్తున్నం. రెండు నెలల సంది ఏం తిన్న పోతలేదు. పండుకునే ఉంటుంది. బిడ్డ చూసినవా తల్లీ ఎట్లుందో" పుల్లలా ఎదుగుదల లేకుండా బలహీనంగా ఉంది పిల్ల.

"గుండెలో రంధ్రం ఉందని ఎవరు చెప్పారు? "

ఒక డాక్టరమ్మ ఫొటో తీయమంటే తీసినం. గండ్ల చూసి చెప్పిందామె. ఆపరేషను చేయాలె అని, మస్తు పైసలయితయంట. గరీబోల్లం మాతాన గన్ని పైసలేడికెల్లి వస్తయి? "

"ఆ రిపోర్టులన్నీ ఉన్నాయా? "

అతను చేతిలో ఉన్న ప్లాస్టిక్ కవర్‌లోంచి ఎక్స్‌రే, కొన్ని కాగితాలు తీసిచ్చాడు. అన్నీ పరీక్షగా చూసింది.

అనూషకి తన చిన్ననాటి సంగతి గుర్తొచ్చింది. సరిగ్గా ఇలాంటి కేసే తనని ఈనాడు కార్డియాలజిస్టుని చేసింది. మళ్ళీ ఇన్నేళ్లకు అదే కండిషన్‌లో తన దగ్గరకు వచ్చారీ తల్లితండ్రులు. 'ఆనాడు యాదయ్యా వాళ్ళు డబ్బులివ్వలేరని ఆపరేషన్ చేయకుండా, వాళ్లని నానా బాధలుపెట్టాడు ఓ డాక్టరు. ఆమె కళ్ళముందు ఆ తల్లితండ్రుల దీనావస్థ, వాళ్ళు డబ్బులకోసం పడిన యాతనా, గుర్తొచ్చాయి.

"మీరు ఉస్మానియా ఆస్పత్రికి వెళ్ళండి. అక్కడికి నేను ఫోన్‌చేస్తాను. మిమ్మల్ని అడ్మిట్ చేసుకుంటారు. నేను ఓ గంటలో వస్తాను సరేనా" అంది ఫోన్ దగ్గరకి నడుస్తూ.

"మమ్ములను లోపలికే రానిస్తలేడమ్మా ఆడ గేటుకీపరు" అన్నాడు అతను.

"నేను చెప్తాగా రానిస్తాడు" అంటూ నంబరు డయల్ చేసింది. అవతల డ్యూటీ డాక్టరు ఫోన్ తీశాడు. అతడితో వాళ్ళ గురించి చెప్పింది.

"మీరు వెళ్ళండి. ఈ లోపల నేను రెడీ అయివచ్చేస్తాను" వాళ్ళు దణ్ణాలు పెడుతూ వెళ్ళిపోయారు.

ఆ తరువాత చెప్పిన ప్రకారం గంట తరువాత హాస్పిటల్ వైపు అనూష కారు దూసుకుపోయింది.

★ ★ ★

ఆమె వెళ్లేటప్పటికి జనరల్ వార్డ్‌లో ఓ పక్కకి నేలమీద టవల్ పరిచి పాపని పడుకోబెట్టి ఆ భార్యాభర్తలిద్దరూ దీనవదనాలతో బిక్కుబిక్కుమంటూ కూర్చున్నారు. బెడ్‌లు ఖాళీలేవు. అనూష డ్యూటీ డాక్టరుతో మాట్లాడింది. ఆరోజు డిశ్చార్జి అవవలసిన పేషెంట్లెవరన్నా ఉన్నారేమో చార్ట్ చూసింది. అదృష్టవశాత్తూ ఇద్దరు పేషెంట్లు డిశ్చార్జి అవవలసిఉంది. వాళ్ళనక్కడే కూర్చోమని చెప్పి, రౌండ్స్‌కి వెళ్ళింది. గంట తరువాత డాక్టరు హరిశ్చంద్ర వచ్చాడు. ఆయనతో మాట్లాడి ఆ పాప రిపోర్టులన్నీ తెప్పించింది.

పాప బ్లడ్ గ్రూపు ఓ నెగిటివ్. హరిశ్చంద్ర ఆ రిపోర్టులు చూసి భుజాలెగరేశాడు "చాలా క్రిటికల్ కదమ్మా! ఎప్పుడో చేయాల్సింది ఆపరేషను ఇప్పుడు చేస్తే మాత్రం సక్సెసు అవుతుందా? హోల్ చూశావా ఎంత పెద్దగా ఉందో!" ఎక్స్‌రే చూపిస్తూ అన్నాడు. "పైగా ఈ గ్రూపు బ్లడ్ మన దగ్గర దొరుకుతుందా? చాలా కష్టం కదా!" అన్నాడు.

"అలా అని పాపనలా వదిలేయలేంగా డాక్టర్. ముందు అడ్మిట్ చేసుకుని ట్రీట్‌మెంట్ స్టార్ట్‌చేద్దాం" అంది.

"ఈ కేసు ఏ నిమ్స్‌కో పంపిస్తే వాళ్ళు ఏదన్నా సలహా ఇస్తారు"

"వాళ్ళని చూశారుగా అంత ఆర్థికపరిస్థితి వాళ్ళకుందంటారా?"

"ఏం ఉందమ్మా సి.ఎం. ఫండ్‌నించి సాయం చేయమని న్యూసుపేపర్లో ప్రకటిద్దాం. ఎవరినన్నా డొనేట్ చేయమని అడగమందాం. స్వచ్ఛంద సంస్థల వాళ్ళు చేస్తారుగా". అన్నారు డాక్టర్ హరిశ్చంద్ర.

"అదేంవద్దు డాక్టర్! ఆపరేషన్ మనమే చేద్దాం"

"రిస్కు అవుతుందేమో అనూషా! ఏదైనా సాధిస్తే పొగిడే పత్రికలే, రేపు ఈ ఆపరేషను ఫెయిలు అయితే ఉస్మానియా డాక్టర్ల నిర్లక్ష్యంతో ఓ పసిపాప ప్రాణం బలి అని పెద్ద హెడ్డింగ్‌తో మననీ, మన హాస్పిటల్‌నీ బజారుపాలు చేస్తాయి"

అనూష నవ్వింది. "అలాంటివి మనకి మామూలేగా! అయినా నెగెటివ్‌గా ఎందుకు ఆలోచించడం? పాప తప్పకుండా బతుకుతుంది. ముందు బ్లడ్‌బాంకులన్నిటికీ ఈ గ్రూపు బ్లడ్ కావాలని ఇన్‌ఫామ్ చేద్దాం. ఈ లోపల ట్రీట్‌మెంట్ సాగుతూ ఉంటుంది. ఇవాళ మంగళవారం కదా! నెక్ట్స్ వీక్ ఆపరేషను పెట్టుకుందాం"

ఆయన అనూషవైపు చిరునవ్వుతో చూశాడు. ఆమె తన శిష్యురాలిగా ఉన్న దగ్గర్నించీ ఆమె అంటే ఆయనకి ప్రత్యేకమైన అభిమానం. ఆమె పట్టుదల, పరోపకారపరాయణత్వం, మంచితనం ఆయనకి నచ్చుతాయి. కానీ ఆయన ప్రాక్టికల్ మనిషి కాబట్టి, అనూష చేసే దానధర్మాలను అంతగా ఆమోదించడు.

ఆప్యాయంగా అన్నాడు. "ఎంతకాలం ఇలా ఇతరులకోసం బతుకుతావు అనూషా! వై డోంట్ యూ గో ఫర్ మ్యారేజ్?"

అనూష తల వంచుకుంది.

"త్యాగానికైనా హద్దుంటుంది కదమ్మా! నీకేం వయసు మించిపోలేదు. ఈ రోజుల్లో ఫార్టీ అంటే పెద్ద వయసేంకాదు మంచి వ్యక్తినెవరినైనా చూసుకుని పెళ్ళిచేసుకో. ఇప్పుడు బాగానే ఉంటుంది కానీ ముందు

ముందు తోడు కావాలనిపిస్తుంది. మంచీ, చెడూ మాట్లాడుకోడానికి ఓ కంపెనీ కావాలనిపించదా? "

బలవంతంగా నవ్వింది. "నాకు తోడు చాలామంది ఉన్నారు డాక్టర్. నా ఆశ్రమంలో వాళ్ళు నా వాళ్లు కాదా!"

"నీ వాళ్ళుకాబట్టేనా ఆ అమ్మాయి ఎవరో ఉన్నంతకాలం ఉండి నీక్కూడా చెప్పకుండా పెళ్ళిచేసుకుని వెళ్ళిపోయింది" మృదుల విషయం మాట్లాడుతున్నాడని ఆమెకి అర్థమైంది. అప్పుడప్పుడూ ఆశ్రమం సంగతులు అడిగి తెలుసుకుంటూ ఉంటాడు ఆయన. ఆ సందర్భంలో మృదుల విషయం చెప్పింది.

"దానికేముంది డాక్టర్! ఆమెకి భయం వేసిందేమో చెబితే వెళ్లనివ్వరని. అందుకే చెప్పకుండా వెళ్లిపోయింది"

"ఏమో అనూషా! నాకు మాత్రం నచ్చలేదా అమ్మాయి పద్ధతి. ఎనీవే... అదంతా వదిలేయ్, నువ్వు మాత్రం పెళ్లిగురించి ఆలోచించు. పెద్దవాడిని, నీ శ్రేయోభిలాషిగా చెబుతున్నాను"

"థాంక్స్ డాక్టర్! ఆలోచిస్తాను. ముందు మనం ఈ ఆపరేషన్ సంగతి..."

ఆయన నవ్వాడు. "నేను కాదంటే నువ్వాగుతావా? కానీ అలాగే చేద్దాం. ముందు బ్లడ్‌కోసం ప్రయత్నించు"

"అలాగే డాక్టర్" అనూష మొహం వెలిగిపోయింది.

యాదమ్మ కూతుర్ని ఎడ్మిట్ చేయించింది అనూష. బ్లడ్‌కోసం బ్లడ్ బ్యాంక్‌లన్నిటికీ కబురు చేసింది. ఆ బ్లడ్ గ్రూప్ వాళ్లు చాలా తక్కువమంది ఉంటారు. అయిదారుగురు ముందుకు వచ్చినా అందులో ముగ్గురుకి డయాబిటిస్, ఒకళ్లకి హిమోగ్లోబిన్ తక్కువగా ఉండడం, అలా ఎవరిదీ తీసుకోడానికి అవకాశం దొరకలేదు. అనూష మళ్లీ డాక్టర్ హరిశ్చంద్రతో చర్చించింది. "చిన్న ఐడియా డాక్టర్!" అంది సీరియస్‌గా ఆలోచిస్తూ.

"ఏంటమ్మా? " అడిగాడాయన.

"ఈ పాప బ్లడ్ ప్రిజర్వ్ చేసి అదే వాడితే? "

"వాట్? " దిగ్భ్రమగా చూశాడు.

"వండ్రఫుల్ ఐడియా. కానీ ఈజిట్ పాజిబుల్? "

"నథింగ్ ఈజ్ ఇంపాజిబుల్ డాక్టర్" నవ్వింది.

అన్నట్టుగానే అసాధ్యం అన్న పదం ఆమె డిక్షనరీలోంచి తుడిచిపెట్టుకుపోయింది. ఆమె జీవిత పుటల్లో సువర్ణాక్షరాలతో లిఖించుకోతగిన రోజుగా ఆరోజు ప్రాధాన్యత సంతరించుకుంది. ఆమె జీవితం మరో విజయ సోపానం అధిరోహించింది. మరోసారి న్యూస్ పేపర్లలో ఆమె పేరు మారుమోగిపోయింది. మొత్తం హైద్రాబాద్ డాక్టర్లే కాక ఆంధ్రప్రదేశ్ నుంచే అనేకమంది డాక్టర్లు ఆమెని అభినందనల పరంపరలతో ముంచెత్తారు. డాక్టరు హరిశ్చంద్ర గర్వంగా అన్నాడు "అనూషా! నువ్వు నా శిష్యురాలివైనందుకు నేను గర్వపడుతున్నానమ్మా"

భరణి మళ్లీ కెమేరాతో, లెటర్‌పాడ్ తో వచ్చి అనూషని ఇంటర్వ్యూ చేసి ఫొటోలతో సహా దానిని ప్రచురించాడు.

లయన్స్ క్లబ్ వాళ్లంతా వచ్చి ఆమెని వాళ్ల క్లబ్ మెంబర్‌గా చేరమని వత్తిడి చేశారు. అనూష మెంబర్‌గా చేరకపోయినా తన వంతు సహకారం ఎప్పుడైనా వాళ్లకుంటుందని చెప్పింది.

★ ★ ★

భరణి దృష్టిలో ఇప్పుడు అనూష హీరోయిన్. ఆమె మీద ప్రేమ, గౌరవం ఉన్నట్టుండి పర్వతంలా పెరిగిపోయాయి. ఆమెతో మాట్లాడడం, ఆమెని కలుసుకోవడం, అతని దినచర్యలో ఓ భాగం అయిపోయింది. ఆమెని కలవని రోజు, ఆమెతో మాట్లాడని రోజు వెలితిగా అనిపించసాగింది. తను ఇంతకాలం పెళ్లి చేసుకోకుండా





ఎదురుచూసింది ఆమె కోసమేనేమో అని పించసాగింది. అనూషలాంటి స్త్రీ జీవితసహచరిగా ఉన్న మగాడిని మించిన అదృష్ట వంతుడు ఈ ప్రపంచంలో ఎవరూ ఉండరేమో అనిపించసాగింది. ఆమెతో చాలా సార్లు తన మనసులో మాట ప్రస్తావించడానికి ప్రయత్నించాడు. కానీ అతనికి ధైర్యం చాలలేదు.



ఆ రోజు భరణి వీణకి ఫోన్ చేశాడు. "మేడమ్! మీతో కొంచెం పనుంది, నేనిప్పుడు మీ ఇంటికి రావాలనుకుంటున్నాను ఉంటారా?" అడిగాడు.

"ఏం నేనేం ఘనకార్యం చేయలేదే నన్ను ఇంటర్వ్యూ చేయడానికి" నవ్వింది వీణ?

"ఇంటర్వ్యూ చేయడానిక్కాదండీ వేరే ముఖ్యమైన విషయం మాట్లాడాలి"

"ఓకే రండి... నేనివాళ ఇంట్లోనే ఉంటాను ఎన్ని గంటలకు వస్తారు?"

"బయల్దేరుతున్నాను"

'గుడ్ రండి" ఫోన్ పెట్టేసింది.

భరణి ఉత్సాహంగా స్కూటరు స్టార్ట్ చేశాడు.

ఇరవై నిమిషాల తరువాత సనత్‌నగర్‌లో ఉన్న వీణ ఇంటి కాలింగ్ బెల్ నొక్కాడు.

"కమిన్" వీణ స్వరం కమాండింగ్‌గా వినిపించింది.

భరణి దగ్గరగా వేసిఉన్న డోర్ తీసుకుని లోపలికి వెళ్లాడు.

"రండి" చిరునవ్వుతో ఆహ్వానించింది.

భరణి, ఆర్టిస్టిక్‌గా అలంకరించి ఉన్న ఆ డ్రాయింగ్‌రూమ్ అందాన్ని, గదిగోడలమీద ఉన్న ఆర్ట్‌నీ చూస్తూ కూర్చున్నాడు.

"ఏంటి మా ఇంటిమీద ఏదైనా ఆర్టికల్ రాయడానికి వచ్చారా?"

భరణి నవ్వాడు "లేదండీ, మీ ఇల్లు చాలా ఆర్టిస్టిక్‌గా ఉంది. అందుకే వచ్చిన పని మర్చిపోయి చూస్తున్నాను"

"జర్నలిస్టుననిపించారు. చెప్పండి కూల్ డ్రింక్ తీసుకుంటారా? కాఫీనా? టీనా?"

"ఇది టీ తాగే సమయం కాబట్టి టీ ఇస్తే సంతోషిస్తాను"

"ష్యూర్" వీణ లోపలికి వెళ్ళి వెంటనే వచ్చేసింది. దివాన్ మీద కొద్దిగా వెనక్కి వాలి, కుషన్‌నానుకుని కూర్చుని "చెప్పండి ఏదో మాట్లాడాలి అన్నారు"

భరణి గొంతు సవరించుకుని "వీణ గారూ" అన్నాడు.

"హమ్మయ్య చెప్పండి వింటున్నాను"

"ఏంలేదు ఈ విషయం ఆవిడతో డైరెక్టుగా మాట్లాడలేక మీతో మాట్లాడుతున్నాను"

"ఎవరితో..."

"అదే డాక్టరుగారితో"

"ఏ డాక్టరుగారండి"

"అనూషగారితో"

"ఓ అనూషా! ఏం మాట్లాడాలి ఆవిడతో?"

"నా పెళ్ళి విషయం"

"మీ పెళ్ళి విషయమా? ఏంటి మా అనూష మాకు తెలీకుండా మ్యారేజి బ్యూరో పెట్టిందా?"

"అదికాదు నేను ఆవిడని, ఆవిడని ప్రేమి

స్తున్నాను. ఆవిడ అంగీకరిస్తే వివాహం చేసుకోవాలని ఉంది"

అప్పటివరకూ చిలిపిగా మాట్లాడిన వీణ అతడివైపు అభినందనపూర్వకంగా చూసింది.

"ఎందుకు కోరుకుంటున్నారు? ఐ. మీన్ తనలో మీకు నచ్చిన లక్షణాలు ఏవిటి? "

భరణి ఆశ్చర్యంగా చూశాడు "అదేం టండి? ఆవిడలో నచ్చని లక్షణాలు ఏంటి? అంటేనన్నా కొంచెం ఆలోచించచ్చుగానీ, నచ్చిన విషయాలేంటి అంటే ఏం సమాధానం ఉంటుంది? ఆవిడలో అన్నీ నచ్చిన గుణాలే"

"మీ వయసు? "

"ముప్పై ఏడు"

"తను బహుశా మీకన్నా మూడేళ్ళు పెద్దది తెలుసా? "

"రాముడికన్నా సీత కూడా పెద్దదే అని విన్నాను"

"ఆవిడ పెద్ద పేరు ప్రఖ్యాతులున్న డాక్టరు. మరి మీరు? "

"నేను జర్నలిస్టుని. పెద్ద పత్రిక కాకపోయినా ఫర్వాలేదు అడ్వర్‌టైజ్‌మెంట్లతో నడిపించేస్తున్నాను. నా పాకెట్‌మనీ నేను సంపాదించుకోగలను. ఆవిడ అన్నం పెడతారుగా! నేను కూడా బాగానే చదువుకున్నాను. ఎమ్.ఎ. జర్నలిజం, పబ్లిక్‌రిలేషన్సు"

"చదువు గురించి వదిలేయండి. తన యాక్టివిటీసు తెలుసుగా!"

"తెలుసు... ఆవిడని పెళ్ళిచేసుకుంటే నేను కూడా ఆవిడతోపాటు అవన్నీ చూసుకోవచ్చుగా!"

"తన ఆస్తిపాస్తులన్నీ ఆశ్రమానికి, వేరే అనాథాశ్రమానికి ఇచ్చేసింది"

"ఆవిడే కోటి రూపాయల ఆస్తి"

"బాగుంది డైలాగు. తను మీకు వండి పెట్టే భార్య కాలేదు"

"ఇలాంటి స్టేజిలో నేనలా ఆశించడం ఫూలిష్‌నెస్"

వీణ తలపంకిస్తూ అంది "ఓకే! నేను అనూషతో మాట్లాడతాను. నాకు రెండురోజుల తరువాత ఫోన్‌చేయండి"

"ఓకే మీమీద భారం వదిలేస్తున్నాను ఒప్పిస్తారని నమ్ముతాను"

"లెటజ్ హోప్ ఓకే"

"ఓకే సీయూ"

భరణి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిన వైపే తదేకంగా చూస్తూ కూర్చున్న వీణ వాచీ చూసుకుని అనూష ఇంటికి వచ్చే టైము చూసుకుని ఫోన్ తీసుకుంది. అవతల రింగవగానే నాలుగు రింగ్స్ తరువాత అనూష స్వరం వినిపించింది.

"హాయ్ డార్లింగ్ నేను వస్తున్నాను" వీణ చెప్పింది.

"హలో! రా... నేనిప్పుడే ఇంట్లో అడుగు పెట్టాను. ఇంకా పూర్తిగా లోపలికి కూడా వెళ్లలేదు"

వీణ ఫోన్ పెట్టేసి వెంటనే బయలుదేరింది.

ఆమె అనూష ఇల్లు చేరేటప్పటికి చాలా ఫ్రెష్‌గా తయారై కూర్చుని టీవీ చూస్తోంది. వీణని చూడగానే "ఏంటి బెంగా? పరిగెత్తుకొచ్చావు? " అని అడిగింది.

"ఊ" నవ్వింది వీణ.

"నువ్వు ఇవాళ రావడం మంచిదైంది వీణా నా మూడ్ అసలు బాగాలేదివాళ"

"ఏం, ఏమైంది? "

"ఏంలేదు" అనూష సన్నగా నిట్టూర్చి అంది.

"మణి పెద్దకొడుకు స్టేట్స్‌కి వెళ్లాడుగా, చిన్నాడు కూడా ఇంటర్‌కాస్టు మారేజ్ చేసుకుని స్టేట్స్‌కి వెళ్లిపోయాట్ట. మణి హాస్పిటల్‌కి కూడా లీవుపెట్టుకుని కూర్చుని ఒకటే ఏడుపుట. ఎందుకంతగా వాళ్లతో అటాచ్‌మెంట్ పెట్టుకుందో నాకర్థంకావడం లేదు. చిన్నయ్యగారు ఫోన్ చేశారు"

"చిన్నయ్యగారంటే"

"మణి భర్త, ఆయనపేరు చిన్నయ్య"

"పాపం, ఈ వయసులో ఆవిడకిది పెద్ద దెబ్బే. అయినా, రెక్కలొచ్చిన పిల్లలమీద ఇంత అటాచ్‌మెంటు పెట్టుకోకూడదులే. త్వరలో మనదేశంలో కూడా పిల్లలు పద హారేళ్లు ఎప్పుడొస్తాయా, స్వేచ్ఛ ఎప్పుడు లభిస్తుందా? అని ఎదురు చూస్తారు"

"ఏవిటో అశాశ్వతమని తెలిసినా బంధం లేకుండా మనిషి బతకలేడుకదూ"

"అది సరే నీతో ఒక ఇంపార్టెంటు విషయం మాట్లాడాలని వచ్చాను"

"ఏవిటమ్మా అది? "

"ఆరోజు నా పర్సనల్ విషయాలన్నీ చెప్పాను. నిన్ను అడిగేలోపల, డిస్టర్బెన్స్ వచ్చింది, ఇవాళ నాకు నీ చరిత్ర చెప్పు వినాలని ఉంది"

"ఏం నువ్వు కూడా ఏదన్నా పేపరు ప్రారంభిస్తున్నావా? "

"పేపరులేదు ఏంలేదుగాని, ఇవాళ నువ్వు ఎట్టి పరిస్థితుల్లోనూ నీ ఫ్లాష్‌బ్యాక్ చెప్పి తీరాలి"

"చెప్పక తప్పదా? "

"నేను తెలుసుకోదగ్గ స్నేహితురాల్ని అనుకుంటే చెప్పు..."

"అదేంమాట వీణా... ఓ.కే. చెప్తాను..." అనూష వెల్లకిలా పడుకుని చెప్పడం ప్రారం భించింది.

వీణ బోర్లా పడుకుని, మోచేతులు పరుపుమీద పెట్టుకుని, అరచేతుల్లో చెంపలానించుకుని శ్రద్ధగా వినసాగింది.

గోడగడియారంలో మ్యూజిక్ వినిపించి ఇద్దరూ తలలు తిప్పి చూశారు, పన్నెండున్నర అయింది.

"సెకండ్‌షో సినిమా పూర్తయింది" వీణ నవ్వుతూ అంది సరిగా పడుకుంటూ

అనూష మాట్లాడలేదు. వీణ మృదువుగా అంది... "పిచ్చి అనూ! ఇందుకా నువ్వింత కాలం పెళ్లిచేసుకోకుండా బతుకుతున్నది. అయినా అలాంటి డబ్బుమనిషిని వదులుకున్నందుకు సంతోషంగా పెళ్ళి చేసుకోవాలి అనూ! అతను హాయిగా పెళ్లిచేసుకున్నాడు. భార్య కంప్యూటర్ ఇంజనీరట. ఇద్దరాడపిల్లలట. అతనికి పెద్ద ఆదర్శాలేంలేవు. చాలా మామూలు మగాడు. అతనిమీద రెండో మూడో ఎలిగేషన్స్ కూడా ఉన్నాయిట. ఇలాంటి వ్యక్తికోసం నువ్విలా ఉన్నావని తెలుసుకుంటే బాధనిపించడంలేదూ? "

"అతనికోసం కాదు... ఆ తరువాత నాన్నగారు కూడా రెండో, మూడో సంబంధాలు తెచ్చారు. వాళ్లు కూడా కట్నం గురించే మాట్లాడారు. అందుకే అనిపించింది, ఎవరు చేసుకున్నా నన్ను నా ఆస్తికోసమే చేసుకుంటారు అని. నన్ను నన్నుగా ప్రేమించేవాడు, నా భావాలను, నా ఆదర్శాలను గౌరవించేవాడు కావాలికానీ ఆస్తి చూసి ప్రేమించేవాళ్లు ఎందుకు? "

"అందరూ అలాగే వుండరు. నామాట విని నువ్వు పెళ్లిచేసుకో అనూషా..."

"ఇప్పుడా? " నవ్వింది. "ఏ రెండో పెళ్లివాడో వస్తాడు... వాడి పిల్లలకి, కుటుంబసభ్యులకి సేవలుచేస్తూ బతికే సహనం, ఆ హృదయవైశాల్యం, తీరిక నాకులేవు"

"అలాంటి బాదరబందీలులేని... ఇంకా పెళ్లికాని అందమైన యువకుడిని చూపిస్తే చేసుకుంటావా? "

"నీకు పిచ్చిపట్టిందా? "

"కాదు... మంచి ఆలోచన వచ్చింది. భరణి నా వద్దకు వచ్చాడు. నిన్ను ప్రేమిస్తున్నాట్ట. పెళ్ళి చేసుకుంటాడట. ఒప్పించే భారం నామీద పెట్టాడు"

"వీణా!" మందలింపుగా పిలిచింది.

"అవును అనూ! నేను చెప్పేది నిజం. యువకుడు. తల్లి, తండ్రి వేరే ఊళ్ళో ఉంటున్నారు. ఏదో మంచిపనులు చేయాలన్న ఉత్సాహం ఉంది. అతను నాతో మాట్లాడి వెళ్ళాక అతని గురించి వాకబు చేశాను. చెడు అలవాట్లేం లేవుట. మంచివాడే... నిన్ను గొప్పగా ప్రేమిస్తున్నాడట.

కాబట్టి ఇంకేం ఆలోచించకుండా రేపు ఉదయం గుడికిరా. రెండు పూలదండలతో పెళ్ళి అయిందనిపిద్దాం"

ఆశ్చర్యంగా చూసింది అనూష. ఏంటిలా మాట్లాడుతోంది? తనకన్నా చిన్నవాడైన భరణిని తను పెళ్ళి చేసుకోవాలా? అతని వయసు సంగతి అలా ఉంచితే, తనతో అతను ప్రవర్తించే పద్ధతి చూస్తేనే అతని పట్ల తనకి అలాంటి భావం కలగదు. ఎంతో వినయంగా, నెమ్మదిగా ఉంటాడు. పైగా ఓ హోదా, అంతస్థు, వ్యక్తిత్వం ఉన్న తనలో భార్యకు కావాల్సిన అణుకువ, సర్దుబాటు తత్వం లేవు. ఇవి ఉంటేగానీ స్త్రీ వైవాహిక జీవితంలో సంతృప్తిగా బతకలేదు. తను ఒంటరి కాబట్టి, సర్వస్వతంత్రురాలు కాబట్టి ఎన్నడూ ఒకరికి తల వంచాలన్న ఆలోచన కలగలేదు. అలాంటిది పెళ్ళి చేసుకోవాలా? ఆమెకి నవ్వొచ్చింది.

నవ్వి నవ్వి అలసిపోయి అంది, "నేను పెళ్ళి చేసుకుని ఓ మగాడితో కాపురం చేయడం మిలీనియం జోక్"

"షటప్..." కోపంగా అరిచింది వీణ. "పిచ్చి పిచ్చిగా మాట్లాడకు. నువ్వు పెళ్ళి చేసుకుతీరాలి. అంతే..."

"వీణా! ఈ వయసులో నేను పెళ్ళి చేసుకోవడం, పిల్లల్ని కనడం, ఇదంతా వింటే ఎవరైనా నవ్వుతారు"

"ఎవరే నవ్వేది? చంపేస్తాను. చూడు అనూ! పెళ్ళి, పిల్లలు, భర్త, ఓ కుటుంబ జీవనం కావాలని నేనెంత తహతహలాడుతున్నానో తెలుసా? అందుకే... అందుకే పెళ్ళి చేసుకుంటానన్న ప్రతి మగవాడినీ నమ్మాను. మోసపోయాను. ఇప్పుడింక నాకు ఆ అదృష్టంలేదు. భ్రష్టురాల్ని అయిన నన్నెవరు పెళ్ళి చేసుకుంటారు? నీకా అవకాశం వచ్చింది. నా మాట విని ఈ సువర్ణావకాశం వదులుకోకు"

"వీణా! అసాధ్యం అయిన వాటిగురించి ఆలోచించి టైం వేస్ట్ చేయకు. బాగా పొద్దుపోయింది పడుకో" అనూష మరో మాటకి అవకాశం ఇవ్వకుండా పక్కకి ఒత్తిగిల్లింది. వీణ వదలకుండా పెళ్ళి గురించి, జీవిత భాగస్వామి అవసరం గురించీ చెప్తూనే ఉంది. కాస్సేపటికి అనూష నిద్రపోయిందని తెలుసుకుని తానూ కళ్ళు మూసుకుంది.

★ ★ ★

నాలుగైదు నెలలు గడిచాయి. భరణి వీణని మధ్యలో చాలాసార్లు కలిశాడు. అనూష పెళ్ళికి విముఖంగా ఉందని తెలుసుకున్నాక, అతను చాలా రెస్ట్‌లెస్‌గా అయిపోయాడు. పైగా ఆరోజునుంచీ అనూష అతనికి అపాయింట్‌మెంట్ ఇవ్వడం తగ్గించింది. ఎప్పుడో ఒకసారి ఫోన్‌లో కాస్సేపు మాట్లాడుతోంది. భరణి ఇదివరకటిలా పత్రిక మీద మనసు కేంద్రీకరించలేకపోతున్నాడు. ఎలాగైనా అనూషని పెళ్ళి చేసుకోవాలన్న కోరిక బలంగా నాటుకుంది అతని మనసులో. వీణ కూడా అనూషకి వీలైనప్పుడల్లా క్లాసు తీసుకోవడం, ఎలాగైనా ఒప్పుకోమని వేధించడం చేయసాగింది. మధ్యలో రెండుమూడుసార్లు శ్యామలచేత కూడా చెప్పించడానికి ప్రయత్నించింది.

ఎవరు చెప్పినా అనూష వినలేదు.

వీణకి విసుగొచ్చింది అనూష మొండితనంమీద. కొన్నిరోజులు కావాలని ఆమెకి ఫోన్ చేయకుండా దూరంగా ఉండడం మొదలుపెట్టింది. అదీకాక, కొన్ని ముఖ్యమైన కేసుల్లో అటు హైకోర్టుకీ, ఇటు సివిల్ కోర్టుకీ తిరగడంలో చాలా బిజీగా అయిపోయింది.

★ ★ ★

ఆరోజు సుశీల జీవితంలో ఓ ముఖ్యమైన రోజు. సుశీల కేసులో ఆమెకీ, ఆమె కొడుక్కీ అనుకూలంగా తీర్పు ఇచ్చింది హైకోర్టు. జడ్జిమెంట్ కాపీ తీసుకుని ఉస్మానియా హాస్పిటల్‌కి వెళ్ళింది వీణ. ఆమె వెళ్ళేటప్పటికి అనూష సర్జరీలో ఉంది.




వీణకి అక్కడి డాక్టర్స్ అంతా బాగా పరిచయం. చీఫ్ హరిశ్చంద్రగారు వీణకి బాగా తెలుసు. అనూష స్నేహితురాలిగా వీణంటే ఆయనకి గౌరవం. అదీకాక, లీడింగ్ లాయర్‌గా ఆమెకి మంచి పేరుంది. వీణ నేరుగా ఆయన దగ్గరకి వెళ్లింది.

ఆమెని చూడగానే ఆయన ఎంతో ఆప్యాయంగా ఆహ్వానించాడు.

ఆయనకి నమస్కరించి ఆయన చూపించిన కుర్చీలో కూర్చుంది.

"ఏమ్మా... ఏంటి ప్రాబ్లమ్? " అనడిగాడు ఆయన.

"నాకేం ప్రాబ్లం లేదు డాక్టర్... అనూషతో పసుండి వచ్చాను. తనేదో సర్జరీ చేస్తోందిట. ఈలోగా మిమ్మల్నోసారి పలకరించి వెళ్దామని వచ్చాను"

"అలాగా! ఎలా వుంది మీ రొటీన్...? "

"బ్రహ్మాండంగా ఉంది డాక్టర్. ఇవాళే సుశీల కేసు జడ్జిమెంట్ వచ్చింది"

"వెరీ గుడ్" ఆయనకి సుశీల గురించి తెలుసు. అనూషకి సంబంధించినవాళ్ళంతా ఆయనకి తెలుసు. అనూష చేసే కార్యక్రమాలకు ఆయన సపోర్ట్ ఎంతగానో ఉంది. అనూషంటే ఆయనకి ప్రత్యేకమైన అభిమానం. అందుకే...

"డాక్టర్‌గారూ! మీరు అనూషకి తండ్రిలాంటివారు. అందుకే చెబుతున్నాను. తనకో మంచి మ్యాచ్ వచ్చింది. పెళ్ళి చేసుకోమంటే చేసుకోనని మొండిపట్టు పడుతోంది. మీరు కాస్త నచ్చచెపుతారని నా ఆశ"

ఆయన చాలా సంతోషించాడు. "అనూషకి మ్యాచ్ రావడానికేం ఉందమ్మా... ఆమె ఒప్పుకోవాలిగానీ, క్యూలో నిలబడతారు. నేనిదివరకు కూడా ఒకటి, రెండు సార్లు చెప్పాను వినలేదు"

"ఈ మ్యాచ్ చాలా మంచిది డాక్టర్... అతను అనూషని చాలా గాఢంగా ప్రేమిస్తున్నాడు. అంత సిన్సియర్‌గా ప్రేమించేవాళ్ళు కూడా ఉండాలిగా..."

"ఇంతకీ ఎవరతను? ఏంచేస్తున్నాడు? ఏం చదువుకున్నాడు? "

"అతను మీరూహించేంత పెద్ద ఉద్యోగి కాదు. కానీ పెద్ద మనసున్నవాడు... జర్నలిస్టు"

"అంటే! అదేదో పత్రిక... అనూష ఫొటో లవీ వేశాడు"

"అతనే... తొలికిరణం అనే పత్రిక ఎడిటర్... ఆ పత్రిక అతని స్వంతం"

"ఐసీ... జర్నలిస్టు అంటే మంచి ఆదర్శాలూ, ప్రోగ్రెసివ్ థాట్స్ ఉంటాయి. పైగా అతను స్త్రీలకోసం ప్రత్యేకంగా పేజీలు కూడా కేటాయించి ఆర్టికల్స్ వేస్తుంటాడు కదూ! మంచి కుర్రాడేనే, అనూష ఎందుకు ఒప్పుకోవడంలేదు" సాలోచనగా అన్నాడు.

వీణ మరింత ఉత్సాహంగా చెప్పింది. "అదే నేననేది... మూర్ఖంగా వాకిటిముందు నిలబడ్డ అదృష్టం కాలదన్నుకుంటోంది. మీరు ఎలాగైనా ఒప్పించాలి"

ఆయన నవ్వాడు... "ఓకే... నా ప్రయత్నం నేను చేస్తాను"

"థాంక్యూ డాక్టర్... వస్తాను" అంటూ లేచింది.

"ఓ. కే. గుడ్‌లక్"

వీణ నిశ్చింతగా లేచి, తిరిగి అనూష కోసం చూసింది. అప్పుడే అనూష తన గదిలోకి వచ్చి చేతులు కడుక్కుంటోంది.

"హాయ్... డార్లింగ్" హుషారుగా పలకరించింది వీణ.

వీణను చూస్తూనే "పద మణిని చూసొద్దాం. తన ఆరోగ్యం బాగాలేదుట" అంది అనూష.

"అలాగా" అంటూ వీణ కూడా లేచింది.

ఇద్దరూ కలిసి మణి ఇంటికి వెళ్ళారు.

మణి బాగా చిక్కిపోయింది. పిల్లలమీద బెంగతో ఆమె కళ్ళు కాంతి కోల్పోయాయి. ఆ టెన్షన్‌తో బి.పి. ఎక్కువై పడిపోయింది. ప్రస్తుతం రెస్ట్‌లో ఉంది. వీళ్ళిద్దరినీ చూడ

గానే భోరున ఏడ్చింది.

"చూశావా అనూ! నా పిల్లలు నన్ను మోసం చేశారు" అంది ఏడుస్తూ.

"మణీ! రెక్కలొచ్చాక పక్షులు, వయసొచ్చాక పిల్లలు ఎగిరిపోరూ! వాళ్ళు నీలాగా అటాచ్‌మెంట్ పెట్టుకుంటే ఎలా వృద్ధిలోకి వస్తారు? మన ప్రేమలూ, అనుబంధాలూ, అనురాగాలూ వాళ్ళ అభివృద్ధి నిరోధకాలుగా మారకూడదు. కొంచెం కంట్రోల్ చేసుకో" చిన్నగా మందలించింది అనూష.

"నేనూ అదే చెబుతున్నానండి. వినడం లేదు. హాస్పిటల్‌కి వెళ్ళడంలేదు. లీవ్ పెట్టేసింది. రోజూ ఏడుపే. అప్పటికీ పిల్లలు అడపాదడపా ఫోన్ చేస్తున్నారు. తను ఇట్లా ఉంటే ఎట్లా చెప్పండి? నన్నెవరు చూస్తారు? " ఆవేదనగా అన్నాడు మణి భర్త చిన్నయ్య.

"వింటున్నావా మణీ! పిల్లల బాధ్యత వదిలించుకుని భార్యాభర్తలు చిలకాగోరింకల్లా కొత్తజీవితం ప్రారంభిస్తున్న రోజులివి. నువ్వేంటి, చాదస్తంగా... లే. లేచి తయారవు. అలా ఎటన్నా వెళదాం. ఈ నాలుగ్గోడలమధ్యా కూర్చుని అనవసరమైన ఆలోచనలతో ఆరోగ్యం పాడుచేసుకోవడం వివేకం కాదు. వీణ మణి చేయి పట్టి లేపి కూర్చోబెట్టింది"

"నా ప్రాణానికి ప్రాణంలా పెంచుకున్నాను. ఈ అరచేతులమీద నడిపించాను. ఇవాళ స్వార్థంతో నన్నూ, నా ప్రేమనీ కాదని వెళ్ళిపోతే ఎలా భరించను చెప్పు? "

అనూష జాలిగా చూసింది.

అనుబంధాలూ, మమతానురాగాలూ, బాధ్యతలూ ఎన్నో పెనవేసుకుని ఉన్న సంసారజీవితంలో నిండా మునిగిపోయింది మణి. అవడానికి డాక్టరైనా, ముందు ఇంటికి, పిల్లలకీ కేటాయించిన కాలంలో మిగిలిన సమయాన్నే వృత్తికి వెచ్చిస్తుంది. అలాంటిది ఇప్పుడా పిల్లలు తనని వదిలిపెడితే ఎలా తట్టుకోగలదు!

"ఆరోగ్యం పాడుచేసుకుని నీ వృత్తికి అన్యాయం చేస్తున్నావు మణీ. ఇంకా బోలెడంత జీవితం ఉంది. నీ చేతులమీదుగా ఎందరికో ప్రాణం పోయాలి. మరెందరో చిన్నారులను ఈ భూమ్మీదకి తీసుకురావాలి. ఇలా అయిపోతే ఎలా? "

"ఆరోగ్యం ఉండి చేసిందేం ఉంది? నాకేం బాధ్యతలా? బంధాలా? నేను పోయినా నష్టంలేదు. ఈ ప్రపంచంలో చాలామంది గైనకాలజిస్టులున్నారు" నిర్లిప్తంగా అంది.

"ఉన్నారు. ఎందుకుండరు? కానీ, అందరూ నీలాగే అనుకుంటే! బాధ్యతలంటే కేవలం నీ కుటుంబంపట్లా, నీ భర్తపట్లా, నీ పిల్లలపట్లా నువ్వు నెరవేర్చేవని నీ అభిప్రాయం. కానీ బాధ్యతగల డాక్టరుగా ఈ సమాజంపట్లా, ఈ పౌరులపట్లా కూడా నీకు కొంత బాధ్యత ఉంది. స్త్రీలంతా తమ బాధ్యతలు, బరువులు కేవలం కుటుంబాలకే పరిమితం అనుకోబట్టి ఈ సమాజం ఇలా ఉంది. నీకు శక్తి ఉన్నంతవరకూ ఈ సమాజానికి నీ వంతు కర్తవ్యాన్ని నెరవేర్చాలి"

"అవునవును... సర్వసంగ పరిత్యాగం చేసి, బుద్ధభగవానుడిలా శాంతిప్రచారం చేస్తూ తిరగాలి" అనూషతో వెటకారంగా అని, మణివైపు చూస్తూ అంది వీణ.

"మణీ! నీతో నాకు చాలా పనుంది. అలా వెడదాం బయల్దేరు. చిన్నయ్యగారూ! ఇవాళ మీ ఆవిణ్ణి మా ఇంటికి తీసుకెళ్తాను"

చిన్నయ్య సంతోషంగా అన్నాడు. "తీసుకెళ్ళండి. కాస్త మామూలు మనుషుల్లో పడేలా బ్రెయిన్‌వాష్ చేయండి"

"విన్నావా? లే" బలవంతంగా మణిని లేపి, లోపలికి తోసింది వీణ.

పనమ్మాయి అందరికీ కాఫీలు తెచ్చింది.

కాస్సేపటికి మణి తయారై చీర మార్చుకుని వచ్చింది.

ముగ్గురూ కలిసి బయల్దేరారు.




కాస్సేపు ఐస్క్రీం పార్లర్‌లో కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు. ఐస్క్రీం తిని అనూష శలవు తీసుకుని వెళ్ళిపోయింది.

వీణ, మణి వీణ ఇంటివైపు బయల్దేరారు.

కారులో వెళ్తుండగా చెప్పింది వీణ. "మణీ! నీకో ముఖ్యమైన పని అప్పగిస్తున్నాను. నువ్వది సక్సెస్‌ఫుల్‌గా పూర్తిచేయాలి. అందుకే నిన్నివాళ మా ఇంటికి తీసుకెడుతున్నాను"

"ఏంటది? "

"ఏంలేదు. అనూషకి మంచి మ్యాచ్ వచ్చింది. భరణి అని మంచివాడు. ముఖ్యంగా అనూషని బాగా ఇష్టపడుతున్నాడు. అతడిని పెళ్ళిచేసుకోమంటే ఒప్పుకోవడంలేదు. తనని ఒప్పించే భారం నీది"

"నువ్వు చెబితే ఒప్పుకోని మనిషి నేను చెబితే ఒప్పుకుంటుందా? "

"నువ్వు పెద్దదానివి. కనీసం ఆ గౌరవం తోనైనా ఒప్పుకోవాలి. తను ఒప్పుకునేలా నువ్వు కన్విన్స్ చేయాలి"

"అనూష సుఖంకన్నా నాకు మాత్రం ఎం కావాలి? తప్పకుండా నాకు చేతనైనంత నేను ప్రయత్నిస్తాను"

"థాంక్యూ..." కారు వీణ ఇల్లు సమీపించింది.

★ ★ ★

అనూష కారు హారన్ మోగించింది.

నిద్రలో ఉన్న వాచ్‌మాన్ ఉలిక్కిపడి లేచి పరుగెత్తుకుని వచ్చాడు. జేబులో ఉన్న తాళం చేతులు తీసి గేటు తాళం తీశాడు.

అనూష కారు లోపలికి, గ్యారేజ్‌వైపు దూసుకెళ్ళింది.

వాచ్‌మాన్ వచ్చి డోర్ తెరిచాడు.

అనూష కారు దిగి, తాళం చేతులు అతనికిచ్చి నీరసంగా నడుచుకుంటూ లోపలికి వచ్చి హాల్లో లైటు వేసింది. వాచ్‌మాన్ కారులో ఉన్న వస్తువులు, స్టెతస్కోప్ తీసుకుని లోపలికి వెళ్లి అన్నీ లోపల పెట్టి వచ్చాడు.

"నువ్వెళ్లిపడుకో" చెప్పింది. అతను మౌనంగా వెళ్లిపోయాడు. రోజూ తను ఏ రాత్రివేళ వచ్చినా మెలకువగా ఉంటాడు. ఇవాళ ఎందుకో త్వరగా నిద్రపోయాడు. ఒంట్లో బాగాలేదేమో! అనుకుంటూ టైం చూసింది. పన్నెండుంబావు. ఉలిక్కిపడింది.

అబ్బో పన్నెండు దాటింది.

కడుపులో నకనకలాడుతోంది. ఆకలి ఇప్పుడు తెలుస్తోంది. ఇప్పుడు అన్నం తినాలంటే ఎలా? అర్ధగద్దూ. నేరుగా బెడ్‌రూం లోకి వెళ్లిపోయింది. లైటు వేసి వార్డ్‌రోబ్ తీసి నైటీ తీసుకుంటూ ఉలిక్కిపడింది. మంచం మీద ఎవరు? నొసలు చిట్లించి చూసింది. మంచం మీద మణి నిద్రపోతోంది. ఎప్పుడొచ్చింది మణి? వాచ్‌మాన్ చెప్పలేదేం? మర్చిపోయాడా? లేక నాకు తెలుసు అనుకున్నాడా? అనూష ఆలోచిస్తూ నిలబడిపోయింది.

లైటు వెలుతురు మొహం మీద పడేటప్పటికి మణి కళ్లు తెరిచింది. అనూషని చూసి ఆవలిస్తూ "వచ్చావా? టైమెంత? " అంది.

అనూష టైం చెప్పి అడిగింది. "ఇదేవిటి? నువ్విక్కడ ఉన్నావేం? ఎప్పుడొచ్చావు? "

మణి మంచం మీద లేచి దిండు కానుకుని కూర్చుని అంది. "నేనొచ్చి చాలాసేపైంది. బహుశా ఏడు గంటలకి టీవీలో తెలుగు వార్తలు మొదలవగానే వచ్చుంటా. రాగానే స్నానం చేసి కాఫీ తాగి పడుకున్నాను. నిద్రపట్టేసింది వాచ్‌మాన్ చెప్పలేదా? "

"లేదు, వాడు నిద్రమత్తులో ఉన్నాడు. ఇంతకీ ఏంటి సంగతి? "

మణి మాట్లాడలేదు. కొంచెంసేపాగి అంది "నువ్వు స్నానం చేసిరా, గీజర్ ఆన్ చేసే ఉంది. ఎమర్జెన్సీ కేసేదో అటెండ్ అయావుటగా. ఫోన్ చేశాను. సిస్టర్ చెప్పింది. చాలా అలసిపోయావు అనూషా! వెళ్లు వెళ్లి స్నానం చేసిరా. భోంచేద్దాం"

ఆప్యాయంగా అంది మణి

అలసిన మనసుని సేదతీరుస్తున్నట్టు, సున్నితంగా స్పృశించిందా ఆప్యాయత. అప్రయత్నంగానే ఆమె కళ్లల్లో ఓ చిన్న నీటితెర పల్చగా కమ్ముకుంది. తమాయించుకుంటూ నవ్వింది.

"ఇప్పుడేం భోజనం? మజ్జిగ తాగి పడుకుంటాను"

"నీకోసం నేనూ భోజనం చేయలేదు. నీలాగా మజ్జిగతో చల్లబడే ప్రాణం కాదిది. వెళ్లు త్వరగారా. నాకాకలేస్తోంది"

"అదేమిటి మణీ! నువ్వెందుకు కూర్చున్నావు నాకోసం. నీ ఆరోగ్యం అసలే బాగా లేదు కూడా. ఇలా వేళ తప్పి భోంచేస్తే ఆరోగ్యం మరీ పాడవదూ!"

"ఫరవాలేదులే, పోయి స్నానం చేసిరా"

"మనం డాక్టర్లం అయినంత మాత్రాన ఆరోగ్య సూత్రాలు ఇతరులకి బోధించడం కాదు. మనమూ పాటించాలి"

"పాటించాలి. కానీ ఎలా? కొన్ని సందర్భాలలో పరిస్థితులకి బానిసకాక తప్పదు"

"సర్లే స్నానం చేసివస్తా. కూర్చో" టవల్, నైటీ తీసుకుని బాత్‌రూంలోకి వెళ్లిపోయింది.

మణికి అనూషని చూస్తుంటే జాలేసింది.

కోరి వంటరితనాన్ని ఆహ్వానిస్తోంది. ఎంతకాలం ఈ ప్రయాణం తోడులేకుండా! ఎలాగైనా వీణ తన మీద పెట్టిన బాధ్యత పూర్తిచేయాలి. ఈమెనొక ఇంటిదాన్ని చేయాలి. తల్లి బతికి ఉంటే ఈమెనిలా వదిలేసేదా? తనకెంతో సాయం చేసింది. ఈనాడు ఆమెకి సాయం చేసే అవకాశం తనకి కలిగింది. ఈ అవకాశం సద్వినియోగం చేయాలి.

మణి ఆలోచనల్లో ఉండగానే అనూష స్నానం చేసి వచ్చింది.

"రా... భోంచేద్దాం" జడ విప్పి, జుట్టు వదులుగా వదిలేస్తూ పిలిచింది మణిని.

భోంచేసి పడుకున్నారిద్దరూ.

అనూష మంచం మీద పక్కకి వత్తిగిలి, మణివైపు ప్రేమగా చూస్తూ అడిగింది. నువ్వివ్వాళ నీ స్వీట్‌హోమ్ వదిలి నా దగ్గర ఎందుకున్నావో తెలుసుకోవచ్చా? "

"నువ్వు ఇంకా ఎంతకాలం ఇలా వంటరితనంతో బతుకుతావో నేను తెలుసుకోవచ్చా? "

"ముందు ప్రశ్న అడిగింది నేను"

"నా మనసులోకి ఈ ప్రశ్న వచ్చి చాలా కాలమైంది"

"ఊహు... ముందు నా ప్రశ్నకి సమాధానం చెప్పు"

"ఊహు... నా ప్రశ్నకే నువ్వు ముందు సమాధానం చెప్పు"

"బాగుంది" నవ్వింది అనూష.

"పిచ్చి మణీ! మీరంతా నాకుండగా నేను ఒంటరిదాన్ని ఎలా అవుతాను చెప్పు? "

"మేము వేరు. మేము ఉదయం అంతా నీకు తోడుగా ఉన్నా రాత్రిపూట తోడు కోసమైనా నువ్వు పెళ్లి చేసుకోవాలి? "

"రాత్రిపూట తోడుగా ఉండేవాళ్లు పగలంతా డిటాచ్‌డ్‌గా ఉంటారు. అలాంటప్పుడు రాత్రి నిద్రపోడానికి తోడు దేనికి? "

"డోంట్ బిసిల్లీ అనూ! చిన్నపిల్లలా మాట్లాడకు. మనిషివి కావా? నీకు కోరికలు లేవా? "

అనూష వెల్లకిలా పడుకుని బెడ్‌లైట్ చూస్తూ అంది.

"కోరికలు చాలా ఉన్నాయి మణీ! కొన్ని కోరికలు తీరాలంటే మరికొన్ని కోరికలు త్యాగం చేయాలి. శారీరక సుఖం కావాలనే కోరిక తీరాలంటే కొన్ని ఆదర్శాలనూ, కొంత ఆత్మ గౌరవాన్ని త్యాగం చేయాలి. మనిషి జీవితంలో ఉన్న అత్యల్పమైన కోరిక అదే. దానికోసం నేను తీర్చుకోగలిగే ఎన్నో ఉన్నతమైన కోరికలను త్యాగం





చేసేందుకు సిద్ధంగా లేను"

"ఏ వయసులో జరగాల్సింది ఆ వయసులో జరగాలి అనూ! ఇప్పటికే చాలా జీవితం గడిచిపోయింది. సాధించింది చాలు. ఇప్పటికైనా జీవితాన్ని అనుభవించు"

"జీవితాన్ని అనుభవించడం అంటే! భర్తతో శారీరక సుఖం పంచుకుంటూ వెన్నెల షికార్లు చేయడమా? అదే నిజమైతే నేనా అనుభవాన్ని కోరుకోవడం లేదు. నన్నిలా బతకనీ మణీ! ఎలాగా సగం జీవితం గడిచిపోయింది. ఇంక శేష జీవితం ఎలా గడిచినా చాలు"

"ఇంత వేదాంతం ఎక్కడ అలవాటు చేసుకున్నావు"

"జీవితాన్నుంచి" నవ్వింది.

మణి కోపంగా చూసింది. "చాల్లే ఆ నవ్వొకటి... ఇట్లా సమాజసేవ చేసుకుంటూ బతికేస్తావా? ఏం సాధించావు దీనివలన... అంత సాయం చేశావు మృదుల ఏం చేసిందాఖరికి? "

"ఒకపిల్ల ఏదో స్వార్థంతో ప్రవర్తించిందని, ఆమెనే ఎగ్జాంపుల్‌గా తీసుకుని అందర్నీ నిందించడం బాగాలేదు మణీ! చూడు వాళ్లు కష్టంలో ఉన్నప్పుడు మానవతా ధర్మంగా సాయం చేశాను. అలాగని వాళ్ల జీవితాన్ని శాసించలేంకదా! వాళ్లు మంచి జీవితం వెతుక్కుంటూ వెళ్తే కాదనడానికి నేనెవరిని? సాయం చేశానుకదా! అని నువ్విలా చేయద్దు, ఇలాగే చేయాలి, ఇలాగే బతకాలి అని శాసించే అధికారం మనకెక్కడుంది? అది నిరంకుశంకాదా!"

"నువ్వు చెప్పేది నిజమే అనూ! కానీ ఇదే లోకంగా బతకద్దంటున్నాను. ఆ కుర్రాడెవరో ఇష్టపడ్డాట్ట. ఎందుకు కాదంటున్నావు? "

"ఓహో! వీణ పంపించిందా నిన్ను" అప్పుడర్థమైనట్టుగా అడిగింది.

"అదంతా నీకనవసరం. నేను చెప్పినట్టు విని ఈ పెళ్లికి ఒప్పుకో. పెద్దదాన్ని చెబుతున్నా విను"

అనూష ఆమెవైపు ప్రేమగా చూసింది.

హమ్మయ్య... మణి మామూలు మనిషైంది చాలు. ఈమెనీ స్థితిలో రెచ్చగొట్టకూడదు అనుకుంది. చిరునవ్వుతో అంది "కొంచెం ఆలోచించుకోనీ చెప్తాను. ఆవేశపడకుండా పడుకో. చూడు టైం రెండవుతోంది"

మణి మొహం వికసించింది.

"నిజంగానా? "

"నిజం"

"ప్రామిస్"

"నీకు నమ్మకం ఉంటే ప్రామిస్"

"హమ్మయ్య. నాకున్న మరో బాధ్యత తీరింది. ఇంక నేనేమైపోయినా ఫర్వాలేదు" మణి నిశ్చింతగా కళ్లు మూసుకుంది.

"ఏం మాటలవి? ఇంకెప్పుడూ అలా మాట్లాడకు" వణికే స్వరంతో అంది అనూష.

"పిచ్చిదానా? ఈ మాత్రానికే ఎందుకలా బాధపడతావు? " మణి అనూషవైపు తిరిగి ఆమె వీపు మీద నుంచి చేయి చుట్టుకుని పడుకుంది.

అనూష కూడా కళ్లు మూసుకుంది. ఏంటి వీళ్లంతా సామూహికంగా తన పెళ్లి మీద పడ్డారు. ఇదేదో ఉద్యమంలా చేస్తోంది వీణ. రేపు క్లాస్ తీసుకోవాలి. అనవసరంగా మణికి ఇలాంటి విషయాలు చెప్పి టెన్షన్ పెట్టద్దని..

కాస్సేపటికి ఇద్దరూ నిద్రపోయారు.

★ ★ ★

అనూషకి హఠాత్తుగా మెలకువ వచ్చింది. సన్నగా మూలుగు వినిపిస్తోంది. అనూషకి కొన్ని క్షణాలు ఏం అర్థంకాలేదు.

చుట్టూ చూసింది. ఏ.సి నిశ్శబ్దంగా చల్లద నాన్ని అందిస్తోంది. పక్కకి తిరిగి చూసింది. మణి మూలుగుతోంది. ఖంగా రుగా పిల్చింది. "మణీ!"

"ఊ..." బలవంతంగా మూలిగింది.

"ఏంటి? ఏమైంది?"

"నొప్పి..." గొంతు పెగల్చుకుని నెమ్మ దిగా చెప్పింది మణి.

"ఎక్కడ?"

మణి చేయికొద్దిగా కదిలింది. కానీ పైకి ఎత్తలేకపోయింది. అనూష గాభరాగా లేచి లైటు వేసింది. మణి దగ్గరకు నడిచి పల్స్ చూసింది. అంత ఏసిలో కూడా మణి ఒళ్లంతా చెమటకి చల్లగా అయిపోయింది. మణి గుండెమీద పరీక్షచేస్తూ "ఎక్కడ నొప్పి? చెప్పగలవా?" అడిగింది.

"గు... గుండెలో ఊ..." నొప్పికి బాధగా అరిచింది.

"మైగాడ్!" అప్రయత్నంగా అనేసింది అనూష.

"ఎటు పక్క... ఇక్కడా? ఇక్కడా?" అంటూ చేత్తో మృదువుగా రాస్తూ అడి గింది.

"ఎడంపక్క. వెనకాల వీపులోదాకా వస్తోంది. సూ.. సూదుల్తో గుచ్చుతున్న ట్టుగా ఉంది. ఆయాసంగా ఉంది. అనూ! నేను... నేను చ.. చచ్చిపోతానా? నా పిల్లలు... నా పిల్లలు కావాలి"

"మణీ! ఏం కాదు. ఖంగారుపడకు"

అనూష ఆలస్యం చేయకుండా లేచి తలు పులు తీసింది. మణిని జాగ్రత్తగా లేపి పట్టుకుని నడిపించుకుంటూ హాల్లోకి తీసు కొచ్చింది. సోఫాలో కూర్చోబెట్టి అక్కడే ఓ మూల గాఢంగా నిద్రపోతున్న రాజుని లేపింది. వాడు నిద్ర కళ్లతో లేచి మణి వాలకం, అనూష ఖంగారు చూసి "ఏమైం దమ్మా" అడిగాడు.

"ముందు తలుపులు, కిటికీలు అన్నీ తెరి చిరా" అంది.

వాడు వెళ్లి అన్ని కిటికీలు, తలుపులు తెరి చాడు. చల్లగాలి వీచింది.

"నువ్విక్కడ కూర్చుని అమ్మని పట్టుకో" అంటూ వాడిని మణి పక్కన కూర్చోమని చెప్పి లోపలికి వెళ్లింది. రెండు నిమిషాల్లో చేతిలో మాత్రతో తిరిగి వచ్చి "మణీ! ఇదిగో ఈ టాబ్లెట్ నాలుకకింద పెట్టుకో" అంది. మణి టాబ్లెట్ కోసం కొద్దిగా నోరు తెరిచి, నాలుక పైకెత్తింది. అనూష టాబ్లెట్ నాలుక కింద పెట్టింది. రాజుని పంపించి లోపల్నించి బీపీ ఆపరేటస్ తెప్పించి బీపీ చెక్ చేసింది.

"మైగాడ్! బీపీ సడన్‌గా పెరిగింది. టెన్షన్ వద్దంటే వినవు. అన్ని విషయాలూ నీకెందుకు? పిచ్చిదానిలా సెంటిమెంటల్‌గా బతికితే ఎట్లా? కొంచెం మెటీరియలిస్ట్‌గా బతకడం అలవాటు చేసుకోవాలి. కాలంతో పాటు మనమూ మారాలి. పిల్లల గురించి టెన్షను, నా గురించి టెన్షను ఎందుకు?" నీరు చిలకరిస్తున్నట్టుగా చిరుచిరు మంద లింపులతో చిన్నచిన్న పరీక్షలు చేసింది.

కొంచెం సేపటికి చల్లగాలికి మణికి చెమట పట్టిందంటే "ఛ చాలా పొరపా టైంది. నిన్నలా వదిలేయడం.." అనూష సణుగుతూ మణి నుదుట చెమట తుడి చింది.

"నీకు చాలా శ్రమ ఇస్తున్నానుకదూ!" మణి బాధగా చూసింది.

"చాల్లే... పరాయివాళ్లతో అన్నట్టు ఏంటా మాటలు? సరేగానీ కొంచెం నొప్పి తగ్గిందా?"

"ఊ..."

"ఇలా ఇక్కడే పడుకో. నాలుగున్నర అయింది. ఇంకో గంటలో తెల్లవారిపో తుంది. నొప్పి తగ్గితే ఆ మాత్ర ఉమ్మెయ్. లేదంటే మింగేసెయ్"

"అలాగే డాక్టర్" హాస్యంగా అంది మణి నీరసంగా నవ్వుతూ.

ఆమె నవ్వు చూడగానే అనూషకి




హాయిగా అనిపించింది. "రాజూ నువ్వు పడుకో" అంటూ రాజుని పంపించి తను కూడా మరో సోఫాలో వాలింది.

"తెల్లవారాక హాస్పిటల్ కి వెడదాం. కొన్ని పరీక్షలు చేయాలి"

"సరే" కళ్లు మూసుకుంది మణి.

అనూషకి మాత్రం మళ్లీ నిద్రపట్టలేదు. మణి ఎందుకొచ్చిందో తన దగ్గరకి వచ్చింది రాత్రి. బహుశా ఇందుకే వచ్చి ఉంటుంది. ఇదే నొప్పి మణి ఇంట్లో వచ్చి ఉంటే పాపం చిన్నయ్య ఎంత ఇబ్బంది పడేవాడో ఎంత గాభరాపడేవాడో. కొన్ని సంఘటనలు మంచికే జరుగుతాయి అంటారు. ఇదీ అంతేనా? మణివైపు చూసింది. గాఢంగా నిద్రపోతోంది.

ఓ గంటసేపు అలా ఆలోచిస్తూ పడుకున్న అనూష ఐదున్నర అవుతుండగా లేచి ముందు వీణకి ఫోన్ చేసింది. కాస్సేపు రింగైంది కానీ వీణ తీయలేదు. బహుశా మార్నింగ్ వాక్ కి వెళ్లి ఉంటుంది. అనుకుని ఫోన్ పెట్టేసి రొటీన్ లో మునిగిపోయింది. ఏడు గంటలకల్లా స్నానం, పూజ చేసుకుని తయారై కూర్చుంది. వంటావిడ భారతమ్మ వచ్చింది. ఆవిడని త్వరగా కాఫీ కలపమని చెప్పి మణి దగ్గరకి నడిచింది. మణి ఇంకా నిద్రపోతోంది. ఆమెని డిస్టర్బ్ చేయలేదు. నిశ్శబ్దంగా లోపలికెళ్లిపోయింది.

కాఫీతాగి ఎనిమిదిన్నరకి మణిని లేపింది. మొహం కడిగించి, భారతమ్మగారి సాయంతో స్నానం చేయించి, కాఫీ ఇచ్చింది. అరగంట తరవాత ఇద్దరూ కలిసి ఉస్మానియా హాస్పిటల్ కి బయలుదేరారు.

మణికి అంతకుముందు కూడా అప్పుడప్పుడు గుండెల్లో సన్నగా నొప్పి వస్తుండేది. రాత్రిళ్లు నిద్రలో కూడా సడన్ గా భయం వేసి రెస్ట్ లెస్ గా అనిపిస్తుండేది. కొంచెం సేపు బాల్కనీలో నిల్చుంటే నొప్పి తగ్గటం ఎలా ఉన్నా హాయిగా అనిపిస్తుండేది. ఆ విషయాలన్నీ అనూషకి కారులో కూర్చున్నప్పుడు చెప్పింది.

అంతా విన్నాక అనూష చెడామడా తిట్టింది. "డాక్టర్ వి అయి ఉండీ ఇంత నిర్లక్ష్యం చేస్తావా? బుద్ధుందా నీకు?"

మణి నవ్వుతూ అంది, "నువ్విలా తిడుతోంటే ఎంత హాయిగా ఉందో తెలుసా!"

"చాల్లే" విసుక్కుంది అనూష మలుపు దగ్గర స్టీరింగ్ తిప్పుతూ.

ఆమెనలా చూస్తుంటే మణికి ఎంతో సెక్యూర్డ్ గా అనిపించసాగింది. ఎవరీ అనూష? తల్లా? చెల్లా? స్నేహితురాలా? ఇంత ఆప్యాయత, అనురాగం పంచిచ్చే ఈ ప్రేమమూర్తి తనకేమవుతుంది? ఆ మాటల్లో అనురాగమేకాదు ఆజ్ఞాపన కూడా ఉంటుంది. ఆమె గట్టిగా ఏదన్నా చెబితే కాదనే సాహసం ఎవరికీ ఉండదేమో! ఆమె ఆలోచిస్తుండగానే కారు హాస్పిటల్ చేరింది.

లోపలికి వెడుతూనే చకచకా మణికి బెడ్ కేటాయించి ఛెస్ట్ ఎక్స్రే, ఇ.సి.జి, యూరిన్ అనాలసిస్, బ్లడ్ అనాలసిస్ మొదలైన ఇన్వెస్టిగేషన్స్ కి ఏర్పాటు చేసింది. అన్ని పరీక్షలయాక "ఇక్కడ పడుకుని రెస్టు తీసుకో నేనీ లోపల రౌండ్స్ కి వెళ్లి వస్తాను" అంది.

"అలాగే, అయినా తగ్గిందిగా ఎందుకివన్నీ?"

"చూడూ నేను కార్డియాలజిస్టుని, నువ్వు గైనకాలజిస్టు. నీకు తెలుసా గుండె సంగతి నాకు తెలుసా?"

"అబ్బ కోపం వచ్చిందే" నవ్వింది.

అనూష సిస్టర్ కి మణిని అప్పచెప్పి తను రౌండ్స్ కి వెళ్లింది. పరీక్షలన్నీ అయాక మణి తనకి కేటాయించిన బెడ్ మీద పడుకుని విశ్రాంతి తీసుకుంది.

దాదాపు రెండు గంటల తరువాత అనూష వచ్చింది. ఆమె వెనకాలే చిన్నయ్య వచ్చాడు. ఖంగారుగా అడిగాడు "ఎలా ఉందమ్మా అనూషా"

"ఖంగారేంలేదు. మీరు ప్రశాంతంగా కూర్చోండి" అంది అనూష.

"నాకు తెలుసు. ఇలా జరుగుతుంది ఎప్పుడో అని. అబ్బ రాత్రి మీ దగ్గర ఉండడం ఎంత బాగైంది?" అన్నాడు గుండెలమీద చేయి వేసుకుని నిశ్చింత ప్రద ర్శిస్తూ.

మణి ఆయనని "భోంచేశారా?" అని అడి గింది.

"చేశానులే. నువ్వు ఇహ నుంచీ జాగ్ర త్తగా ఉండాలి మణీ! రాత్రి ఈ పాప లేక పోయి ఉంటే ఏమయ్యేది?" అన్నాడు ఆయన అనూషని అప్పుడప్పుడు పాప అంటుంటాడు.

"ఏవీకాదు, ఫోన్ చేస్తే ఎక్కడున్నా రెక్కలు కట్టుకుని వస్తుంది. ఇంతకీ రిపోర్ట్సు వచ్చాయా అనూ" అడిగింది.

"వస్తాయి... అప్పుడేనా?"

చిన్నయ్య ఖంగారుగా ఏదో మాట్లాడు తుంటే చెప్పింది అనూష. "మీరు వెళ్లి ఇడ్లీ తీసుకురండి. మణికి ఏం ఫర్వాలేదు. నేను చూసుకుంటాను"

"అలాగే" చిన్నయ్య లేచి వెళ్లిపోయాడు. అతను వెడుతోంటే మణి కొంచెం గట్టిగా అరిచింది. "అనూషక్కూడా తీసుకురండి"

"అలాగే" వెళ్లిపోయాడు.

అనూష ఏం మాట్లాడలేదు. 'తినాలి ఆక లేస్తోంది' అనుకుంది.

సాయంకాలానికి రిపోర్ట్సు వచ్చాయి. "రక్తంలో కొలెస్ట్రాల్ పెరిగింది. నూనె వాడకం మానేయాలి. రోజూ మార్నింగ్ వాక్ చేయి. పచ్చికూరలు, పళ్లు తీసుకో వాలి. ఈ టెన్షన్‌లు, ఆయాసాలు, ఆలోచ నలు మానేసి మెడిటేషన్ చేయి. నిజంగా రాత్రి నా దగ్గర ఉండడం చాలా అదృష్టం" అంది.

"లేకపోతే పోయేదాన్ని కదూ!"

కోపంగా చూసి మందులిచ్చింది.

వీణ, శ్యామల హడావుడిగా వచ్చారు.

కులాసాగా ఉన్న మణిని చూసి హాయిగా నిట్టూర్చారిద్దరూ "చాలా ఖంగారుపడ్డాను అనూ! ఎలా ఉంది ఇప్పుడు?" మణి నుదు టిమీద చేయివేస్తూ అడిగింది వీణ.

"ఫర్వాలేదు, షిఈజ్ ఓకే. ఏం శ్యామా! మీరెలా ఉన్నారు"? ఆప్యాయంగా పలకరిం చింది శ్యామలను.

"నీ దయవలన మాకే ఇబ్బందీలేదు" అంది శ్యామల.

ఆ రాత్రికి శ్యామలని మణి దగ్గర వది లేసి అనూషా, వీణా ఇంటికెళ్ళిపోయారు.

★ ★ ★

తెల్లవారి లేచేటప్పటికి ఊహించని, పిడు గులాంటి వార్త మోసుకొచ్చాయి టెలిఫోన్ తీగలు.

డాక్టర్ అనూష, ఫేమస్ కార్డియాలజిస్టు జీవితంలో మొదటిసారిగా ఓటమి చవిచూ సింది. ఏమాత్రం ఆనవాలు తెలియకుండా నిశ్శబ్దంగా వచ్చి, తనతో మణిని తీసికెళ్ళిపో యింది మృత్యుదేవత.

కులాసాగా కబుర్లు చెప్పుకుని, వీణతో కలిసి, హోటల్లో భోంచేసి, ఇంటికి వచ్చి నిశ్చింతగా నిద్రపోయిన అనూషని గణగణ మంటూ లేపి, మణి చనిపోయిందన్న వార్త తెలియచేసింది టెలిఫోన్... వణికే స్వరంతో, గుండె పగిలేలా ఏడుస్తూ చెప్పింది శ్యామల.

అనూషకి తన నెత్తిమీద పిడుగుపడినట్టు అనిపించింది.

"నిజం చెప్పు శ్యామలా? మణి బతికే ఉందికదూ!" వెర్రిదానిలా అడిగింది.

శ్యామల ఏడుస్తూ ఫోన్ పెట్టేసింది.

కుప్పకూలిపోయింది అనూష.

ఇంతవరకూ ఈ చేతుల్తో చికిత్స చేసిన పేషెంటు ఎవరూ చనిపోలేదు. పెద్దపెద్ద సర్జరీలు చేసి ఎంతోమందికి పునర్జన్మ ప్రసా దించిన అనూష ప్రాణస్నేహితురాల్ని బతి కించుకోలేకపోయిందా? ఇంకెందుకీ డిగ్రీ? ఇంకెందుకీ పేరుప్రతిష్టలు... ఇంకెందుకీ జీవితం?

"మీ భార్యకి ఏం ఫర్వాలేదు. నా ప్రాణం




అడ్డేసి కాపాడి, ఇంటికి పంపిస్తాను. మీరు నిశ్చింతగా వెళ్ళండి" అని చిన్నయ్యకి భరోసా ఇచ్చి ప్రశాంతంగా ఇంటికి వచ్చింది. ఇప్పుడు నా భార్య ఏదమ్మా అంటూ ఆయన అడిగితే ఏం సమాధానం చెప్పాలి?

హాయిగా నవ్వుతూ, కోలుకున్న మణి హటాత్తుగా ఎలా చనిపోయింది? అంటే! అంటే! మణికి మృత్యువు సమీపించిందా? దాన్ని తను ఆపలేకపోయిందా? మరి డాక్టర్లు పునర్జన్మ ఇస్తారంటారే. ఇదేనా? ఎలా? ఎలా బతికించుకోవాలి? నో! మణి చనిపోలేదు. ఏదో పొరపాటు జరిగింది.

అనూష ఎలా ఉన్నది అలాగే లేచి హాస్పిటల్‌కి వెళ్లింది. మణి నిర్జీవంగా పడి ఉంది. శ్యామల గుండె పగిలేలా ఏడుస్తోంది. డాక్టర్స్, సిస్టర్స్ అనూష కోసం ఎదురుచూస్తున్నారు. "ఎప్పుడు వచ్చిందో మళ్లీ ఎటాక్ వచ్చింది. నిద్రలోనే పోయారు" ఎర్రబడ్డ కళ్లతో చెప్పాడు డ్యూటీ డాక్టర్. అనూషకేమీ వినిపించడం లేదు. కళ్లముందు మసకలు కమ్మినట్టుగా ఉంది. జరుగుతున్నది, జరిగింది వాస్తవం కాదేమో... కలేమో అనిపించసాగింది. కలైతే బాగుండుననిపిస్తోంది.

సరిగ్గా పది గంటలక్రితం తన దగ్గర పాటలు విన్న మణేనా? ఇంత చైతన్యరహితంగా ఎలా పడుకుంది? తనిచ్చిన ట్రీట్‌మెంట్‌లో లోపం ఎలా జరిగింది? ఇదేనా మానవమేథకీ, దేవుడిశక్తికీ జరిగే పోరాటంలో మానవుడు అంగీకరించవలసిన ఓటమి? మృత్యువుని వాయిదా వేయగలిగిందికానీ, ఆపలేకపోయిందన్నమాట.

డెడ్‌బాడీని తీసుకుని అందరూ ఇంటికి వెళ్లాక పిల్లలకి మెసేజ్ పంపించింది వీణ. అనూష దగ్గరకెళ్లి నెమ్మదిగా పిలిచింది "అనూ!".

మాట్లాడలేదు అనూష.

"అనూ! నిన్నే... మాట్లాడు..." వీణ భయంగా అరిచి అనూషని గట్టిగా కుదిపింది.

అనూష నెమ్మదిగా వీణవైపు చూసి "నేనే చంపాను కదూ? " అంది.

"పిచ్చి పట్టిందా? నువ్వు చంపడం ఏమిటీ? డాక్టర్స్ బతికిస్తారు. చంపరు"

"నో! నేనే చంపాను... అవును... చంపాను" హిస్టీరిక్‌గా ఏడవసాగింది.

ఆమెను ఓదార్చడానికి వాళ్లకి చాలా శక్తి కావాల్సివచ్చింది.

మర్నాడు దహనసంస్కారాలు జరిగాయి. పిల్లలు అంతా అయాక వచ్చారు. చిన్నయ్యను వాళ్లకి అప్పగించి శ్యామలా, వీణా అనూషని తీసుకుని ఇంటికెళ్లారు.

దారిలో అంది వీణ "పాపం! పిల్లలంటూ తల్లడిల్లిపోయింది. ఎంత అనుబంధం? ఎంతప్రేమా? పిచ్చిది. ఎవరికెవరు శాశ్వతం? బతికున్నంతకాలమేగదా ఈ బంధాలూ, అనుబంధాలూ... ఆమె ఫొటోకి దండ వేసినంత మాత్రాన ఆమె వాళ్ల జీవితాన్ని ఇకముందు ఏవిధంగా ప్రభావితం చేయగలదు? "

"అలాగని మమతలు పెంచుకోకుండా ఉండగలమా? " శ్యామల బాధగా అంది.

అనూష మాత్రం మాట్లాడలేదు. ఆమెను ఇంటికి తీసుకెళ్లి బలవంతంగా కాఫీ తాగించారు. కాఫీలో నిద్రమాత్ర కలిపిచ్చింది వీణ. కాస్సేపు నిద్రపోయి లేస్తే సెటిలవుతుందనుకుంది.

అనూష నిద్రపోయింది. ఆమె లేచిందాకా శ్యామలా, వీణా జాగ్రత్తగా కనిపెడుతూ కూర్చున్నారు. రెండు గంటల తర్వాత కళ్లు తెరిచింది అనూష.

"అనూ! ఎలా ఉన్నావు? " మృదువుగా అడిగింది వీణ.

కాస్సేపు ఆమె మొహంలోకి చూసి గట్టిగా ఏడవడం ప్రారంభించింది అనూష. ఎన్ని మరణాలు, ఎన్ని జననాలు చూసి

ఉంటుందీ డాక్టర్. అలాంటిది... మణి మరణం ఎందుకింతగా కదిలించింది? అర్థంకాలేదు వీణకి. కాసేపు ఏడవనిచ్చి అంది "కొంచెం ఏమన్నా తిందువుగాని"

"ఏం తినను? ఎలా తినను? ఈ ఓటమి భరించలేకపోతున్నాను వీణా... ఎందుకిలా జరిగింది? మణికి వచ్చింది కూడా చాలా మైల్డ్ ఎటాక్. నేనసలు ఊహించలేదు. ఒక్కరోజు ఉంచి డిశ్చార్జ్ చేయాలనుకున్నాను"

"ఊహించనిది జరగడమే జీవితం... అన్నీ మన ఊహకు అందితే ఆ దేముడెందుకు? ఆయన ఉనికి ఎందుకు?"

కుమిలి కుమిలి ఏడ్చిన అనూషని శ్యామలా, వీణా చాలాసేపు ఏవో కబుర్లతో కొంతవరకూ ఉపశమింపచేశారు. మర్నాటికి కొద్దిగా తేరుకుంది. శ్యామలా, వీణా ధైర్యం చెప్పి వెళ్లిపోయారు.

★ ★ ★

రోజులు మామూలుగా గడిచిపోతున్నాయి. మణి మరణంతో అనూష కుంగిపోయింది. ఇదివరకు లేని భయం ఏదో ఈమధ్య ఆమెను ఆవహించింది. ఎన్నడూ లేనిది ఇప్పుడు ఒంటరిగా ఉండాలంటే భయమేస్తోంది. రాత్రిళ్లు ఎంతో ధైర్యంగా ఇంటికి వచ్చేది. ఈమధ్య చీకట్లో నిర్మానుష్యంగా ఉన్న రోడ్లమీదనుంచి రావాలంటే ధైర్యం చాలడంలేదు. ఎక్కడినుంచో మణి తనని వెంటాడుతున్నట్టు, నాభర్తకి నన్ను సజీవంగా ఇస్తానని చెప్పి మోసం చేస్తావా? అని నిలదీస్తున్నట్టు అనిపిస్తోంది. ఆశ్రమానికి ఫోన్ చేసి డ్రైవర్ని పిలిపించుకుంది.

తరచూ వీణకి ఫోన్ చేసి, మాట్లాడుతూ, తన ఒంటరితనం మర్చిపోడానికి ప్రయత్నం చేయసాగింది.

మధ్యలో భరణి వచ్చి చూసి వెళ్లాడు.





"ఇది లైఫ్‌కదా! మర్చిపోండి. కంట్రోల్ చేసుకోండి" అంటూ అతనికి తోచిన నాలుగు వాక్యాలు చెప్పాడు.

"పుట్టుట గిట్టుట కొరకే కదండీ. మీ ప్రయత్నం మీరు చేశారు. ఆవిడ పోయారు. దానికి మిమ్మల్ని మీరు నిందించుకుంటే ఎలా?" అన్నాడు. "ఎప్పటికైనా అందరం పోయేవాళ్లమే కదా" అని తేల్చాడు.

"అవునా?" హటాత్తుగా వేదాంతసారం తెలిసినట్టు అనిపించింది. అవును... అందరూ చచ్చిపోతారు. తనూ చచ్చిపోతుంది. అవును....

ఎప్పటికైనా నేనూ మణిలా చచ్చిపోతాను కదూ! అనుకుంది. పాపం మణి... తన జీవితం సెటిల్ చేయాలని... పెళ్లికి ఒప్పించాలనీ తన ఇల్లునీ, భర్తనీ ఒదులుకుని నా దగ్గరకు ఒక రాత్రికోసం వచ్చింది. ఆ రాత్రే ఆఖరి రాత్రి అయింది. మళ్లీ ఇంటికి వెళ్లలేదు. ఇటునుంచి ఇటే శాశ్వతంగా వీడ్కోలు తీసుకుని వెళ్లిపోయింది.

ఆరోజు మణికి ఎటాక్ వస్తే పక్కనే తనుండి కూడా కాపాడలేకపోయింది. కానీ... ఆ పరిస్థితి తనకే వస్తే? కనీసం తనని హాస్పిటల్‌కి తీసుకెళ్లడానికి కూడా ఎవరూ లేరు. ఎవరొస్తారు? ఎవరాదుకుంటారు? ఆదుకునే వాళ్లు లేక నొప్పితో విలవిల్లాడి చచ్చిపోతుంది.

నోనో అలా జరక్కూడదు. ఎంతమాత్రం జరక్కూడదు. తను అనాథలా చనిపోకూడదు. ఏం చేయాలి? మంచంమీంచి లేచి అస్థిమితంగా అటూఇటూ తిరిగింది. ఇంట్లో ఉండాలనిపించలేదు. ఆ రాత్రివేళ కారు తీసుకుని ఆశ్రమంవైపు బయలుదేరింది.

అంత రాత్రి వేళ వచ్చిన అనూషని చూసి ఖంగారు పడింది శ్యామల.

"నాకు భయంగా ఉంది శ్యామా! అందుకే నీ దగ్గరకు వచ్చాను" బేలగా అంటూ తనని వాటేసుకున్న అనూషని ప్రేమగా దగ్గరకు తీసుకుంది.

"ఎందుకు భయం? మేమంతా లేమూ! పిచ్చిదానా? నువ్వింత బేలవనుకోలేదు. అంతా మేకపోతు గాంభీర్యమేనా"

"ఏవిటో, మణి మరణం నన్నింతగా కృంగతీస్తుందనుకోలేదు. అనుకోకుండా జరగడంతో తట్టుకోలేకపోతున్నాను. నా కళ్లతో అమ్మా, నాన్నల మరణం చూశాను. హాస్పిటల్లో ఎందరి మరణమో చూశాను. కానీ, ఇలా ఎన్నడూ జరగలేదు. నా నీడే నన్ను భయపెడుతోంది"

"మణి మరణానికి నువ్వే కారణం అన్న భావన నీ మనసులోంచి తుడిచెయ్..."

శ్యామల అన్న మాటలు నిజమనిపించాయి... "శారదని లేపి, ఏదన్నా పాట పాడమను శ్యామా" అంది.

శ్యామల వెళ్ళి శారదని లేపింది.

శారద వీణ తెచ్చుకుని కూర్చుని శ్రావ్యంగా పాడింది. నిధి చాలా సుఖమా... రాముని సన్నిధి చాలా సుఖమా?

కొన్ని కీర్తనలు, మరికొన్ని తత్వాలు పాడింది.

ఆ పాటలు వింటూ అనూష నిద్రపోయింది.

★ ★ ★

ఓరోజు అనూష హాస్పిటల్‌కి వెళ్ళేటప్పటికి హరిశ్చంద్రగారు కబురుచేశారు. ఆమె వెళ్ళగానే ఆప్యాయంగా మాట్లాడి, ఓదార్చారు.

"అనూషా! విద్యావతివి. నీకు తెలియనిదేం ఉంది. మనం డాక్టర్‌గా రోగికి ప్రాణం పోయడానికే ప్రయత్నిస్తాం. తీయడానికి కాదుకదా! నువ్విలా అయిపోతే ఎలా? హాస్పిటల్‌కి కూడా రావడంలేదట"

అనూష మాట్లాడలేదు.

"చూడమ్మా... నీ తండ్రిలాంటి వాడిని. నా మాట విని జరిగింది మర్చిపోయి, నీ రొటీన్‌లో పడిపో...మణిగారు నీ స్నేహితురాలే... కానీ, ఏం చేస్తాం? వుయ్ హావ్ టు కాంప్రమైజ్"

"నాకింకా ఎవరున్నారు డాక్టర్. నాకు దుఃఖం కలిగినా, ఆనందం కలిగినా పంచుకోడానికి ఎవరున్నారు? " అనూష స్వరం కంపించింది.

"ఆవిడ బతికి ఉంటే మాత్రం అనుక్షణం నీకు దగ్గరగా ఉండేవారా? అనూషా! స్నేహితులు స్నేహితులే... మనకి తోడు కావాలంటే మన అనే మనిషి ఉండాలి. ప్రతిక్షణం మనతో కలిసి బతకాలి. మనతో తిరగాలి. మనతో మాట్లాడాలి. మన భావాలు పంచుకోవాలి. అది కేవలం లైఫ్ పార్టనర్ తప్ప ఎవరూ చేయలేరు. వీణ నాకు ఒక బాధ్యత అప్పచెప్పింది. ఈలోగా బాడ్ ఇన్సిడెంట్ జరిగింది. మర్చిపో. ఆతనెవరో నిన్ను ఇష్టపడుతున్నాట్ట... పెళ్ళి చేసుకో"

అనూష అదిరిపడింది. వీణ ఈ సంగతి ఈయనకి చెప్పిందా? బుద్ధిలేదు...ఛీ.

అనూష మౌనం చూసి అన్నాడు, "తొందరలేదు. బాగా ఆలోచించుకుని ఒక నిర్ణయానికిరా... అది పాజిటివ్‌గా ఉండేలా చూసుకో. ఓకే... నీకేదన్నా సాయం కావాలంటే నా దగ్గర మొహమాటంలేకుండా అడిగి తీసుకో"

ఆయన చూపిస్తున్న ఆదరానికి అనూష మనసు కరిగిపోయింది. "థాంక్యూ సర్" సెలవు తీసుకుని వచ్చేసింది.

తరువాత కొన్ని రోజులకి అనూష మామూలుగా అయింది.

శ్యామలా, వీణా హాయిగా నిట్టూర్చారు. "కాలం ఎలాంటి గాయాన్నైనా మాన్పుతుంది. కాలం చాలా శక్తివంతమైంది" అంది వీణ.

"నిజమే" అంది శ్యామల.

★ ★ ★

వీణగానీ, మణికానీ, అనూషని ఒప్పిస్తారనుకుంటే ఇలా జరిగిందేంటి? అసహనంగా

అనుకున్నాడు భరణి. అతనికి చిరాగ్గా ఉంది. పత్రిక విషయంలో ఎంత మాత్రం ఏకాగ్రత చూపించలేకపోతున్నాడు.

అనూష తిరస్కారం అతనికి జీర్ణం కావడంలేదు. నాకేం తక్కువైంది? ఎందుకు వద్దంటోంది? పోనీ, తనే వెళ్ళి మాట్లాడదామంటే, మణి మరణంతో పూర్తిగా గంభీరంగా మారిపోయింది... ఎలా?

వీణ ఒప్పించలేకపోయింది. తన వల్ల అవుతుందా? మణి మాట్లాడిందో, లేదో! ఈవిడ ఏమన్నదో... తెలిసే అవకాశం లేదు. ఎలా? ఎంతకాలం ఇలా?

నో! లాభంలేదు. ఇలా బాధపడేకన్నా డైరెక్టుగా వెళ్లి అడగడం మంచిది. అడిగితే ఏం చేస్తుంది? లాగి పెట్టి కొడుతుందా? లేదులే... టీనేజర్సు కాదుగా ఏదో చిల్లరవేషాలేశాడని కొట్టడానికి! ఏం మాట్లాడదా? లేక సారీ! భరణీ! నాకా ఉద్దేశం లేదు అంటుందా?

లేకపోతే ఇప్పుడు ఏర్పరచుకోమనాలి.

ఏవిటో ఈ జాతకం... కోరుకున్నదేదీ జరగదు.

హు... ఎలా జరగదో చూస్తాను. ఈ జాతకాన్ని తిప్పిరాసుకోవాలి. అనూష ఎందుకు ఒప్పుకోదు? ఒప్పుకు తీరాలి అంతే, విసురుగా లేచాడు కుర్చీలోంచి.

బైటకి వచ్చి, బైక్ స్టార్ట్‌చేశాడు.

అనూష ఇంటికెళ్లాడు. ఆమె చాలా ఆప్యాయంగా ఆహ్వానించింది. అతణ్ణి చూడగానే ఆరోజు ఎందుకో ఆమెకు హాయిగా అనిపించింది. చక్కటి కబుర్లు చెప్తాడు. కాసేపు అన్నీ మర్చిపోవచ్చు అనుకుంది. భరణికి ఆమె స్వాగతం చెప్పిన తీరు కొత్త ఉత్సాహాన్నిచ్చింది. చాలా కబుర్లు చెప్పాడు. సుందరచైతన్యానంద ఉపన్యాసం కవర్ చేసిన సంగతులు చెప్తూ జీవితసారాన్ని, భగవంతుడి పరమార్థాన్ని వివరించాడు. చాలా రోజుల తరవాత అనూషకి అతని సమక్షంలో కాలం తెలియలేదు.

వీణ అన్నట్టు ఎప్పుడైతే మనిషి మనసు వేదనామయం అవుతుందో, ఆ భారాన్ని పంచుకోడానికి ఆ మనసు తోడును కోరుకుంటుంది. తన వృత్తి, ప్రవృత్తి ద్వారా అనుక్షణం బిజీగా ఉండే అనూషకి ఇంతకాలంనుంచీ జీవితసహచరుడు గురించి ఆలోచించే వ్యవధి లభించలేదు. అందుకే ఆమె ఆ విషయంలో శ్రద్ధ చూపించలేదు. ఇద్దరు, ముగ్గురు తోటి డాక్టర్లు ప్రపోజ్ చేసినా నిరాకరించింది ఇదివరకు. వీణ మాటలు, మణి మాటలు, మణి మరణం, ఒంటరితనం, తల్లి జ్ఞాపకాలు, భరణిపట్ల ఆమె మనసులో ఓ చిన్న పాజిటివ్ ఆలోచనకి బీజం వేశాయి.

భరణి వెళ్తూ వెళ్తూ ధైర్యం చేసి చెప్పాడు "అనూషగారూ! మీరంటే నాకు చాలా ఇష్టం. మీతో కలిసి బతకాలని ఉంది. మీతో మాట్లాడుతుంటే కాలం తెలియదు. మీలోని విజ్ఞానం, అంకితభావం, నిస్వార్థం నాకెంతో నచ్చాయి. ఇంత పెద్ద ఎన్‌సైక్లోపీడియాను నా స్వంతం చేసుకోవాలనుకోవడం అత్యాశ కాకపోతే, రేపు ఈ టైంకి వస్తాను మీ నిర్ణయం చెప్పండి. వస్తాను..." అంటూ ఆమె సమాధానం కోసం ఎదురు చూడకుండా వడివడిగా వెళ్లిపోయాడు.

అనూష నిర్ఘాంతపోయింది. ఎంత ధైర్యం ఇతనికి. ఎలా మాట్లాడాడిలా? ఒక విధంగా అతడి ధైర్యం ఆమెకు ఆనందాన్నిచ్చింది. చాలాకాలం తర్వాత తనని కేవలం ఓ స్త్రీగా భావించి నిర్భయంగా, నిర్మొహమాటంగా భరణి వెలిబుచ్చిన అభిప్రాయంతో ఆమెలో నిద్రాణమైన స్త్రీత్వం కొద్దిగా కళ్లు తెరిచి, ఒళ్లు విరుచుకున్నట్టు అయింది.

డాక్టరుగా, సంఘసేవకురాలిగా అందరూ తనని గౌరవిస్తారు. అభిమానిస్తారు. ఎన్నో విషయాలు చర్చిస్తారు. హాస్పిటల్లో కలిసి ఆపరేషన్లు చేస్తారు. కానీ...

ఇంతవరకూ ఏ మగవాడి సమక్షంలో

కలగని ఓ భావం సన్నజాజి పరిమళంలా ఆమె గుండెను తాకింది.

పదిహేనేళ్ల క్రితం ప్రశాంత్‌ని హత్తుకుని కూర్చుని గండిపేట వెళ్లిన రోజు గుర్తొచ్చింది. అదే లాస్ట్. మళ్లీ తన మనసులో అలాంటి అనుభూతికి ఆస్కారమే లభించ లేదు. మళ్లీ ఇన్నేళ్లకి భరణి మూసుకున్న హృదయ కవాటాలమీద తన మునివేళ్లతో సున్నితంగా తట్టాడు.

మణి తనతో మాట్లాడిన ఆఖరి మాటలు గుర్తొచ్చాయి. ఆరాత్రి నీకు కోరికల్లేవా? అని అడిగింది. తనకి కోరికల్లేవా? ఉన్నాయి. కానీ అణగారిపోయాయి, వాడి పోయాయి. అయితే, ఆ అణగారిన కోరికల మీద భరణి ప్రేమ అనే అమృతాన్ని చిలక రించి చిగురింపచేస్తున్నాడు.

ముఖ్యంగా మణి మరణానంతరం తనకి జీవితంపట్ల, భవిష్యత్తు పట్ల ఓ భయం ఏర్పడింది. ఎవరన్నా తోడు కావాలనిపి స్తోంది. ఎవరున్నారు? ఎవరొస్తారు? వీణ ఎప్పుడో ఒకసారి కలుస్తుంది. మణిలేదు. ఇకపోతే ఆశ్రమంలో ఎంతసేపుండగలదు. తన పరిధి వృత్తిపరంగా ఎంత విస్తృతమో, వ్యక్తిగతంగా అంత పరిమితం. అందుకే ఎక్కువమంది స్నేహితులు లేరు. ఈ చిన్న పరిధిలో తనకెప్పుడయినా ఏ ఆపదయినా వస్తే ఆదుకోడానికెవరొస్తారు?

ఆమె మనసులో అప్పటికప్పుడే తన భవిష్యత్తుపట్ల ఓ నిర్ణయానికి రావడానికి చిన్న బీజం పడింది. నెమ్మదిగా లేచి ఫోన్ దగ్గరకు నడిచింది. వీణ నెంబరు డయల్ చేసింది.

★ ★ ★

అనూష అంగీకారం తెలియచేయగానే వీణ వెంటనే కారేసుకుని భరణి ఆఫీసుకు వెళ్లింది. ఆమె వెళ్లేటప్పటికి టేబుల్‌మీద రకరకాల న్యూస్ పేపర్లు పడేసుకుని, ఏదో రాసుకుంటున్నాడు.

"హలో గుడ్ మార్నింగ్!"

చటుక్కున లేచాడు వీణ స్వరం వినిపించగానే. "హలో వీణగారూ! ఏంటి ఇలా వచ్చారు? రండి కూర్చోండి. ఏదన్నా న్యూస్‌గానీ, ఆర్టికల్‌గానీ తెచ్చారా? "

"ఊ.... మంచి గుడ్ న్యూస్ తెచ్చాను. రేపటి ఇష్యూలో వేస్తారా? సాయంత్రానికి స్పెషల్ ఇష్యూ తెస్తారా? "

"గుడ్ న్యూసా? ఏంటది చెప్తారా? "

"ముందు నేనడిగిందానికి సమాధానం చెప్పండి..."

"మీరు చెప్పే న్యూస్ యొక్క ఇంపార్టెన్స్ మీద ఆధారపడి ఉంటుంది"

"చాలా మంచి న్యూస్. మీరెప్పటినుంచో ఎదురుచూస్తున్నది"

భరణి మొహంలో రంగులు మారాయి. కొంచెం ఎగ్జయిటింగ్‌గా అడిగాడు, "ఊరిం చక చెప్తారా ప్లీజ్! అసలే నాకు టెన్షన్ ఎక్కువ"

"అలాగా పోనీలెండి. అందుకేనేమో హార్ట్ స్పెషలిస్ట్‌ని జీవన భాగస్వామిని చేస్తున్నాడు దేముడు..."

"వ్వాట్!? " అతని కళ్లల్లో సంతోషం, ఉద్వేగం.... చటుక్కున కుర్చీలోంచి లేచి వీణ చేతులు పట్టుకున్నాడు.

"అవును. అనూ పెళ్లికి ఒప్పుకుంది"

ఎగిరి గంతేశాడు భరణి. "నిజంగానా? చెప్పండి వీణా! ఆవిడ ఒప్పుకున్నారా? " అంటూ వీణ చేతులు పట్టుకుని ఉద్వేగంగా కుదిపేశాడు.

"మీ సంతోషానికి నా చేతులు బలిచే యడం బాగాలేదు భరణీ! మీమీద మీకింత అపనమ్మకమా? " అంది వీణ అతని చేతు ల్లోంచి తన చేతులు విడిపించుకుని కుర్చీలో కూర్చుంటూ.

భరణి సిగ్గుపడ్డాడు. "సారీ మేడమ్. హఠాత్తుగా కలిగిన అదృష్టానికి తట్టుకోలేక పోతున్నాను. ఉండండి మీకు మంచి స్వీటు తెప్పించి పెడతాను. ఏం తింటారు? " అడి గాడు బెల్ నొక్కుతూ.

"ఇప్పుడేం తినను. అంతా పెళ్ళిలో తింటానుగానీ మీ వాళ్ళకి కబురుచేసి రమ్మ నండి"

"ష్యూర్... వెంటనే టెలిగ్రాం ఇస్తాను. నో... నో... ఫోన్ చేస్తాను. ఇవాళే వెళ్ళి పురోహితుడిని కన్సల్ట్ చేస్తాను. ముహూర్తం పెట్టిస్తాను. వీణగారూ! ఆవి డకి మంచి చీరలు, నగలు కొనాలి. కొంచెం హెల్ప్ చేస్తారుగా"

అతని హడావుడి, ఆనందం చూస్తుంటే వీణకి ముచ్చటగా అనిపించింది.

"మ్యారేజ్ హాలు సత్యసాయి కళ్యాణమం డపం మాట్లాడనా? ఆవిడ సర్కిల్ చాలా పెద్దదికదా"

అతని జోరుకి అడ్డుపడుతూ అంది, "ఏంటి? ఆకాశమంత పందిరి, భూదేవంత పీటా వేసి చేసుకుంటారా?"

"ఊ... అనూషగారితో పెళ్ళంటే మాటలా? వీలైతే ఇంకా గ్రాండ్‌గా చేసుకుం టాను"

"మీ ఐడియా బాగుందికానీ తనకి ఈ హడావుడి ఇష్టంలేదు. సింపుల్‌గా ఆశ్ర మంలో చేసుకుంటానంది. కేవలం ఆత్మీ యుల సమక్షంలో దండలు మార్చుకోవాల న్నది తన కోరిక"

"కానీ... అంత అవసరం ఏం ఉంది?"

"తెలియదు. బహుశా లేట్ మ్యారేజ్ అని కాబోలు"

"కావచ్చు కానీ మొదటి పెళ్ళిగా? ఆవి డకీ, నాకూ కూడా"

"మొదటిపెళ్ళి, రెండోపెళ్ళి ఏంటి భరణీ? పెళ్ళంటే ఏంటి? అనురాగంతో పెనవేసుకున్న రెండు హృదయాలు, కలిసి బతకడంకోసం సమాజందగ్గర తీసుకునే లైసెన్సు. ఆ లైసెన్సు తీసుకోడానికి ఆర్భాటం దేనికి?"

భరణికి కొంచెం అసంతృప్తిగా అనిపిం చింది. ఇంతకాలం ఎదురుచూసి, అనూష లాంటి గొప్ప స్త్రీని పెళ్ళి చేసుకుంటూ, సింపుల్‌గా చేసుకోడం ఏంటి? గ్రాండ్‌గా చేసుకుని తన పేపర్‌లో కనీసం పెళ్ళి ఫొటో వేయాలి. అనూష తన భార్య అని ఈ ప్రపంచానికి చాటాలి.

అతని అసంతృప్తి గమనించినదానిలా కొంచెం మృదువుగా అంది వీణ, "పెళ్ళి ఎలా చేసుకున్నా, మీరు భార్యాభర్తలు అవు తారు. కాదని ఎవరన్నా అనగలరా?"

"నిజమే అనుకోండి. కానీ..." సాలోచ నగా అన్నాడు. "నిజంగానే ఆవిడకి ఆర్భాటం ఇష్టంలేదా?"

"లేదనే నా ఉద్దేశం? పోనీ ఓసారి డిస్కస్ చేద్దామా?"

"ఒద్దొద్దు ఆవిడకి ఇష్టంలేని పనిచేయ మని బలవంతం చేయద్దు. ఆవిడకెలా ఇష్ట మయితే అలాగే చేద్దాం" అన్నాడు ఖంగా రుగా. అనవసరంగా డిస్కస్‌చేసి, అనూషని ఇబ్బంది పెట్టడం, బలవంతపెట్టడం అతనికి ఇష్టంలేదు. మళ్ళీ ఆమె మూడ్ మార్చుకుం టుందేమో అనే భయం కలిగింది.

"మరి మీ వాళ్ళు రాగానే కబురుచే యండి. నేను వెళ్తాను. మళ్ళీ కలుస్తాను"

"రేపు షాపింగ్‌కి వెళ్దామా?"

"తప్పకుండా... ముగ్గురం కలిసి వెడదాం సరేనా?"

ఆమెని పంపించి లోపలికి వచ్చిన భర ణికి తను ఈ ప్రపంచాన్ని జయించిన వీరు డినన్న భావం కలిగింది. అనూష పెళ్ళికి అది కూడా తనతో, ఈ జర్నలిస్టు భర ణితో... వారెవ్వా... ఏం అదృష్టం. ఒరేయ్ భరణీ! నువ్వురా ఈ ప్రపంచంలో అదృష్ట వంతుడివంటే... అందం, ఐశ్వర్యం, హోదా, తెలివితేటలు, మంచితనం, సంఘంలో కీర్తి ప్రతిష్టలు అన్నీ ఉన్న అమ్మాయి నీకు భార్య కాబోతోంది...

ఫోన్ తీసి తండ్రికి డయల్ చేశాడు.

★ ★ ★

వీణ అనూషతో భరణి రియాక్షన్ అంతా పూస గుచ్చినట్లు చెప్పి చివరకి అంది,

"అనూ! అతని ఆనందం చూస్తుంటే హటాత్తుగా ఎలిజిబెత్ టేలర్ పిలిచి నన్ను పెళ్ళి చేసుకుంటావా? అని అడిగితే అచ్చు ఇలాగే రియాక్ట్ అవుతాడేమో అనిపించింది"

అనూష నవ్వింది. "ఇంతకీ పెళ్ళి సింపుల్‌గా జరగడానికి ఒప్పుకున్నాడా?"

"ఒప్పుకోక చస్తాడా? ఇంకోమాట మాట్లాడితే నీ మూడ్ ఎక్కడ మార్చేసుకుంటావో అని హడలిపోతున్నాడు మానవుడు. పోనీలే మొత్తానికి మంచివాడురా. హోదాదేం ఉంది? హోదా ఉన్నవాళ్ళకి మానవత్వం ఉండద్దూ. జీవితంలో ఎంతో అలసిపోయి ఉన్నావు. ఈ దశలో సేద తీర్చుకోడానికి మానవత్వం నిండిన అతని హృదయం చాలు. ఫోమ్‌బెడ్‌లు కాదు. అఫ్‌కోర్స్ ఫోమ్ బెడ్స్‌కి నీకు లోటులేదనుకో..."

అనూష ఏదో ఆలోచిస్తూ ఉండిపోయింది.

"ఏంటి ఆలోచిస్తున్నావు?" మృదువుగా అడిగింది వీణ.

నిట్టూర్చుతూ... "ఏంలేదు వీణా! అమ్మ గుర్తొచ్చింది. నా పెళ్ళికోసం కలవరించింది పిచ్చి అమ్మ. అమ్మ, మణి కూడా నా పెళ్ళి గురించి మాట్లాడుతూ చనిపోయారు. వాళ్ళిద్దరి ప్రాణాలు తీసిన నేను ఇప్పుడు పెళ్ళి చేసుకోకపోతే ఏం? అనిపిస్తోంది"

"నీకేం పిచ్చా? వాళ్ళ ప్రాణాలు నువ్వు తీయడం ఏమిటి? ఆయుష్షు తీరింది, పోయారు. పిచ్చి పిచ్చిగా ఆలోచించకు. రేపు సాయంత్రం గురుడు షాపింగ్‌కి తీసుకెళ్ళి నీకు చీరలు, నగలు కొంటాట్ట రెడీగా ఉండు"

నవ్వింది అనూష. "ముందు ఆ పేపరు సంగతి చూసుకోమను. సంకురాత్రికి, శివరాత్రికీ తీసుకొస్తున్నాడు. మరి ఏం సంపాదిస్తున్నాడో, ఎలా గెట్ ఆన్ అవుతున్నాడో"

"నువ్వు చూసుకుంటావుగా ఇకనుంచీ... ఆ ధైర్యంతో ఉండి ఉంటాడు"

"నో... నో... అలాంటి ఆలోచనలకు ఛాన్స్ ఇవ్వద్దు. నామీద ఆధారపడితే, కష్టపడడం మానేస్తాడు. నాకలాంటి లేజీ ఫెలోస్‌మీద గౌరవంలేదు"

"అబ్బా! ప్రిన్సిపుల్స్ పక్కన పెట్టు కాస్సేపు. ఆ మొహంలో పెళ్ళికూతురి లక్షణాలు చూపించు"

"అంటే సిగ్గుపడుతూ తల వంచుకుని కూర్చోమంటావా?"

వీణ నవ్వింది ఆ మాటలకి. "నిన్ను పెళ్ళికూతురి గెటప్‌లో చూడాలని మహా ఆరాటంగా ఉందిరా"

"చూద్దువుగానిలే... రా భోంచేద్దాం"

ఇద్దరూ కలిసి, కిచెన్‌వైపు నడిచారు.

"ఇవాళ వంట నేనే చేశాను" అంది ప్లేట్లు సర్దుతూ అనూష.

"ఏం? పెళ్ళి చేసుకుంటున్నానుకదా అని వంట ప్రాక్టీస్ చేస్తున్నావా?"

"నాన్సెన్స్... వంట ప్రాక్టీస్ చేయడం ఏంటి? నాకు రాదా? వంటావిడ ఊరెళ్ళింది. పదిహేను రోజులదాకా రాదు"

"అలాగా! ఏమోలే... మొగుడు గుండెల్లోకి కడుపుద్వారా వెళ్ళాలని పెద్దవాళ్ళు అన్నారుకదా అని ఏమన్నా కొత్తకొత్త వంటలు నేర్చుకుంటున్నావేమో అని"

"అంటే! ఉద్యోగం మానేసి, వంటలు చేస్తూ బతకమంటావా?"

"ఆ అవసరంలేదు. ఆ పని భరణి చేస్తాడు"

ఇద్దరూ గట్టిగా నవ్వుకున్నారు.

ప్లేట్లలో వడ్డించిన ఆలూ ఫ్రై, మామిడికాయ పప్పు చూసి, "ఓ! మామిడికాయ పప్పా? చాలాకాలమైంది. త్వరగా అన్నం పెట్టు" అంది వేళ్ళతో పప్పు తీసుకుని రుచి చూస్తూ.

అనూష అన్నం వడ్డించింది.

ఇద్దరూ భోజనం చేశాక, వీణని కోర్టుద

గ్గర దింపి, హాస్పిటల్ వైపు వెళ్ళింది అనూష.



మర్నాటి ఉదయానికల్లా భరణి తల్లితండ్రులు దిగారు.

"ఏరా? ఇంత హటాత్తుగా నీకు నచ్చిన అమ్మాయెవరు? ఇంతకాలంనుంచీ ఎవరూ నచ్చలేదు"

భరణి గర్వంగా నవ్వాడు. "చాలా ఎక్స్ట్రార్డినరీ లేడీ నాన్నా... చూస్తే మీరే ఆశ్చర్యపోతారు" అన్నాడు.

"అది సరేరా! ఎవరమ్మాయి? ఏం కులం? ఎలా ఉంటుంది? ఏం చేస్తోంది? గోత్రాలు కలిశాయా? వగైరా విషయాలు తెలుసుకోవద్దూ" ఆత్రంగా అడిగింది తల్లి లక్ష్మి.

"అవన్నీ నాకు తెలియదమ్మా. అమ్మాయి చాలా అందంగా ఉంటుంది. డాక్టరు"

"డాక్టరా? ఎవరమ్మాయి? వాళ్ళ నాన్నగారి పేరేంటి? ఏంతెలుసుకోకుండా ఎలా ఒప్పుకున్నావు? "

"నేను ఒప్పుకోవడం ఏంటి నాన్నా? ఆవిడే ఒప్పుకున్నారు... నేను ప్రపోజ్ చేశాను"

భార్యాభర్తలిద్దరూ మొహామొహాలు చూసుకున్నారు. "కుటుంబం, పరువు, ప్రతిష్ఠ అన్నీ చూసుకున్నావా? "

"హు... ఆవిడ నా భార్య అయ్యాక, నా పరువు, ప్రతిష్ఠా పెరుగుతాయి నాన్నా. ఫలానావారి అమ్మాయిగాకన్నా డాక్టర్ అనూషగా ఆవిడకే పేరు ప్రతిష్ఠలెక్కువ"

"డాక్టర్ అనూషా? అంటే కార్డియాలజిస్టు, పెద్ద సర్జన్... పేపర్లలో చూశాను. ఆ అమ్మాయా? " విభ్రాంతిగా అడిగాడు ఆయన.

"యస్" గర్వంగా అన్నాడు భరణి.

"ఏంటి? ఆ అమ్మాయితో నీకు పెళ్ళా? చిన్నదేనా? వయసెంత? ఆమెకి పెళ్ళి కాలేదా? " లక్ష్మి ఆశ్చర్యంగా అడిగింది.

"కాలేదమ్మా. నలభై ఏళ్ళుంటాయి"

"నలభై ఏళ్ళా? అదేంట్రా? నీకన్నా పెద్ది కదా"

"వయసులో సరేనే... ఆ అమ్మాయి వీడికన్నా అన్ని విషయాల్లో ఉన్నత స్థానంలో ఉంది. వీడితో పెళ్ళికెలా ఒప్పుకుందా? అని ఆశ్చర్యంగా ఉంది నాకు. ఒరేయ్ నాకేదో అనుమానంగా ఉంది. నేనోసారి ఆ అమ్మాయిని చూడాలి"

"వెడదాం నాన్నా. ఫోన్చేసి అపాయింట్మెంట్ తీసుకుంటాను"

"అపాయింట్మెంట్ తీసుకుంటావా? చూశావా లక్ష్మి, ఆమెని కలుసుకోవడానికి అపాయింట్మెంట్ లేకుండా వెళ్ళడానికి లేదు. అలాంటి పిల్లని వీడు పెళ్ళిచేసుకుంటానంటున్నాడు. అంటే... ఆమె స్థితి ఏమిటో నీకు అర్థంకాలా? "

"అది సరేరా... రేపు పెళ్ళయ్యాక కాపురం చేయడానికి కూడా అపాయింట్మెంట్ తీసుకుంటావా? " ఆవిడ అడిగింది.

"అబ్బా ఏంటమ్మా... మీ గొడవ. అనూషగారు మీ కోడలు అవబోతున్నారంటే ఎగిరి గంతేయాలి. ఇన్ని సందేహాలేంటి? " విసుగ్గా అన్నాడు.

"సందేహాలు కాదురా, భయాలు. పిల్లని





చ్చేటప్పుడు మనకన్నా ఉన్నత కుటుంబా లకు, పిల్లను తెచ్చుకునేటప్పుడు మనకన్నా తక్కువస్థాయి పిల్లను తెచ్చుకోవాలని పెద్దలు చెబుతారు. ఆవిడముందు చేతులు కట్టుకుని నిలబడాల్సినవాళ్ళం. కాళ్ళకు నమ స్కరిస్తుంటే దీవించే అర్హత మాకుందా? అని ఆలోచిస్తున్నాను" అన్నాడాయన.

"అనూషగారు చాలా మంచావిడ నాన్నా. ఆవిడకు గర్వంలేదు" అన్నాడు.

హఠాత్తుగా ఆయన గట్టిగా నవ్వాడు. భరణి, లక్ష్మి తెల్లబోయి చూశారు.

"ఏంటండీ? ఏమైంది?" అడిగిందావిడ.

"ఏం లేదు లక్ష్మీ. వీడు పెళ్ళి చేసుకోబో తున్నాడు. కాబోయే భార్యని 'గారు' అని అంటున్నాడు. మనతో చెప్పేటప్పుడైనా అనూష అనే ధైర్యం లేదు. రేపు కాపురం ఎలా చేస్తాడా? అని నవ్వొస్తోంది"

భరణి మొహం కందిపోయింది. అక్కడి నుంచి వెళ్ళిపోతూ, "మీరు స్నానాలు చేసి, రెడీగా వుండండి. వాళ్ళింటికి వెళదాం" అన్నాడు.

"ఆడపిల్లవాళ్ళు మనదగ్గరకి రావాలిరా..."

"అబ్బా, నాన్నా... నేను పెళ్ళి చేసుకునేది మామూలు ఆడపిల్లనుకాదు. పెద్ద స్టేటస్ ఉన్న లేడీని. ఫార్మాలిటీస్ పక్కన పెట్టండి" అంటూ వెళ్ళిపోయాడు.

మార్కండేయులు నవ్వుకున్నాడు.

పుట్టింది, పెరిగింది పల్లెటూరైనా, పేరుకి కేవలం రైతు అయినా, వ్యవసాయమే జీవ నాధారంగా బతికినా, మార్కండేయులు కమ్యూనిస్టు భావాలు జీర్ణించుకున్న వ్యక్తి. నిజానికి ఆయనకి డాక్టర్ అనూష తనకి కోడలు కాబోతోందని తెలియడంతో అనుకో కుండానే తమ కుటుంబ ప్రతిష్ట ఆకాశ మంత పెరిగినట్టుగా అనిపించింది. అంత గొప్ప స్త్రీని పెళ్ళి చేసుకుంటున్న భరణి మనోభావాలు తెలుసుకోడానికి చిన్న ట్రిక్ ప్లే చేశాడు. భరణికి ఆమె అంటే గౌరవం ఉంది. ప్రేమా ఉంది. కానీ కేవలం ఇవేనా? లేక ఏదో వ్యామోహంతోటో, ఆమె స్టేటస్ తనకి పనికివస్తుందన్న స్వార్ధం తోటో, ఆమె డబ్బు చూసో కొడుకు ఆమెని పెళ్ళి చేసుకుంటున్నాడా? అన్న చిన్న అను మానం ఓ మూల ఉంది. ఆ అనుమానం తీర్చుకోడానికి చిన్న చిన్న ప్రశ్నలు వేస్తూ సందేహాలు వెలిబుచ్చుతూనే ఉన్నాడు.

భరణి ఫోన్ చేసేటప్పటికి అనూష ఇంట్లోలేదు. హాస్పిటల్‌కి వెళ్ళిపోయింది.

"సాయంత్రం కలుద్దాం నాన్నా. అందాకా మీరు రెస్టు తీసుకోండి. నేను ఆఫీసుకి వెళ్తాను" అన్నాడు భరణి.

సాయంత్రందాకా పేపర్లద్వారా తెలుసు కున్న ఓ స్త్రీమూర్తి గొప్పతనాన్ని కళ్లారా చూడడానికి మార్కండేయులు, భర్త అంత గొప్పగా చెబుతున్న కోడల్ని చూడడానికి లక్ష్మి తహతహలాడుతూ ఎదురు చూస్తూ కూర్చున్నారు.

సాయంత్రం ఆరింటికి వాకిట్లో కారు ఆగింది. వీణ కారు దిగి లోపలికి వచ్చింది. జీన్స్ పాంటు, టీషర్టు వేసుకుని లోపలికి వచ్చిన ఆమెని చూడగానే డాక్టర్ అనూష ఈమేనా? అన్నట్టు కొంచెం అసంతృప్తిగా చూసింది లక్ష్మి.

"నమస్కారం సార్. నా పేరు వీణ, లాయర్‌ని. అనూష స్నేహితురాలిని" అని తనని తను పరిచయం చేసుకోవడంతో హమ్మయ్య అనుకుంది. కానీ అనూష కూడా ఇలాగే ఉంటుందేమో ఈ పాంట్లు, చొక్కాలు వేసుకుని కనిపిస్తుందేమో అని భయంగానే ఉంది లక్ష్మికి.

"రామ్మా" మార్కండేయులు ఆప్యా యంగా ఆహ్వానించాడు.

"మిమ్మల్ని మా అనూష దగ్గరకి తీసికెళ్ల డానికి వచ్చానండి. ఆడపిల్లవాళ్లంకదా!"

ఆయన నవ్వాడు. "తప్పకుండా వస్తాం. అబ్బాయి వచ్చే వేళైందికదా! ఈలోగా లక్ష్మి ఆ అమ్మాయికి కాస్త కాఫీ ఇవ్వు" అన్నాడు.



"వద్దండి. రండి వెళదాం. భరణిని ఆఫీసు దగ్గర పికప్ చేసుకుందాం. రండమ్మా, నేనే పెళ్లిపెద్దను" అంది లక్ష్మితో.

ఆవిడ నవ్వింది. "అమ్మాయి తల్లీ తండ్రి లేరా? " అడిగింది.

"లేరు, చాలాకాలమైంది పోయి"

"అలాగా పాపం! పదమ్మా వెళదాం"

ముగ్గురూ బయలుదేరారు. దారిలో అనూష గురించి క్లుప్తంగా వివరించింది వీణ. ఆమె ఇంతకాలం పెళ్లిచేసుకోకుండా ఉండిపోడానికి కేవలం వృత్తిపట్ల ఉన్న అంకితభావం తప్ప మరేం లేదని భరణి ఆదర్శాలు, మంచి మనసు చూశాక అనూషకి అన్నివిధాలా తగినవాడని భావించానని ఆమె చెపుతుంటే నా కొడుకు ఇంత గొప్పవాడా అనిపించింది మార్కండేయులకి. చాలా సంతోషించాడు ఆయన. ఫర్వాలేదు, నా భావాలకి తగినట్టు చేస్తున్నాడు అని మనసులోనే కొడుకుని అభినందించాడు.

భరణిని ఆఫీసు దగ్గర పికప్ చేసుకుని అనూష ఇంటికి వెళ్లారు.

★ ★ ★

అనూష హాల్లో కూర్చుని ఎదురుచూస్తోంది. కాటన్ చీరలో హుందాగా ఉంది. అంతులేని విజ్ఞానం ముందు పెద్దరికం తలవంచుతుందేమో! ఆమె మొహంలో కనిపిస్తోన్న తేజస్సు చూడగానే అప్రయత్నంగా నమస్కరించారు మార్కండేయులు, లక్ష్మి కూడా. అనూష కూడా నమస్కరించి మర్యాదగా ఆహ్వానించింది.

"కూర్చోండి" అంది సోఫా చూపిస్తూ.

"మావాడు నిన్ననే ఫోన్ చేశాడమ్మా. విషయం చెప్పాడు" అన్నాడు మార్కండేయులు.

అనూష మాట్లాడలేదు. వీణవైపు చూసింది.

వీణ గొంతు సవరించుకుని అంది, "మీకేమన్నా కోరికలు, ఐడియాస్ ఉంటే చెప్పండి సార్. ఐమీన్ కట్నం"

"ఛ ఛ..." చప్పున అన్నాడు. "ఏం మాటలమ్మా? మావాడిని పెళ్లి చేసుకోడానికి ఆవిడ ఒప్పుకోవడమే గొప్ప. కట్నాలు, కానుకలూనా? ఎంత మాటన్నారు? "

"మా అనూష ఇవ్వలేని స్థితిలో లేదు కదండీ. అందుకే అడిగాను"

"నేను డబ్బు ఆశించే మనిషిని కాను. వాడికి బాధ్యత తెలియాలని కొంత కఠినంగా వ్యవహరించినమాట నిజం. ఇప్పటికైనా వాడు ఒకింటివాడు అవుతున్నాడంటే చాలా సంతోషంగా ఉంది. చూడమ్మా, మా అబ్బాయి స్వభావం గురించి మీకు కొద్దిగా చెప్పాలి. వాడు చాలా మొండివాడు"

"ఆ విషయం మాకు తెలుసండి" చప్పున అంది వీణ.

"అంటే మొండిపట్టుతో నిన్ను సాధించాడా? " అడిగాడాయన అనూషతో.

"అదేం లేదండి" నవ్వింది అనూష. అలా అంటూ భరణివైపు చూసింది. అప్పుడే అతనూ ఆమెవైపు చూశాడు. ఒక్కక్షణం అనూష గుండె జల్లుమంది. వెంటనే చూపులు తిప్పేసుకుంది.

రాజు అందరికీ శ్నాక్స్, టీ తీసుకొచ్చి ఇచ్చాడు.

లక్ష్మి అనూషకి బొట్టుపెట్టి చీర, జాకెట్టు, పూలు, పండ్లు ఇచ్చింది.

అనూష అవి అందుకుని "థాంక్సండీ" అంది. అందరూ వెళ్ళిపోయాక...

జీవితంలో మొదటిసారిగా ఓ వింత అనుభూతికి లోనవుతూ, మంచంమీద పడుకుని ఆలోచనలలో మునిగిపోయింది అనూష.

★ ★ ★

మర్నాడు ఉదయమే భరణి ఫోన్ చేశాడు. అప్పుడే హాస్పిటల్ కి వెళ్లడానికి




బయలుదేరుతోంది అనూష.

ఫోన్ మోగగానే రిసీవర్ తీసుకుని "హలో! అనూషా హియర్" అంది.

"అనూషగారూ నేను భరణిని"

అతని స్వరం వినగానే ఒక్కక్షణం ఆమె గుండె లయతప్పింది. కొంచెం ఖంగారుగా "హ హలో" అంది.

"నేనండి భరణిని సారీ డిస్టర్బ్ చేశానా? " అడిగాడు.

"అబ్బే లేదు చెప్పండి" అంది. మనసులో మాత్రం అనుకుంది 'అవును చాలా డిస్టర్బ్ చేశావు భరణీ! నీకింత ధైర్యం ఎలా వచ్చింది? అనూష గుండె స్పృశించే అధి కారం నీకెవరిచ్చారు? '

"అనూషగారూ! వినిపిస్తోందా? ఏంటి ఫోను బాగాలేదా? ఎనీ ప్రాబ్లెమ్? " అతని స్వరం గట్టిగా వినిపించడంతో ఉలిక్కిపడి "ఆ కొంచెం సరిగా వినిపించడంలేదు. చెప్పండి ఇప్పుడు బాగానే ఉంది" అంది.

"ఏం లేదు. అమ్మానాన్నా ఇవాళ వెళ్లిపో తున్నారు. మిమ్మల్ని కలవాలనుకున్నాను కానీ కలవలేదు. మరోసారి మీ నోటిమీ దుగా మన పెళ్లి విషయంలో అంగీకారం వినాలనుకుంటున్నాను. నిజంగా మీకేం అభ్యంతరం లేదుకదూ? "

అతని స్వరంలో వినిపించిన ఆదుర్దా, సందేహం నవ్వు తెప్పించింది.

చిలిపిగా అంది "ఒకవేళ అభ్యంతరం అంటే ఏం చేస్తారు? నిన్న మీ అమ్మగారు చీర, జాకెట్టు ఇచ్చేశారుగా. రిటర్న్ తీసుకుం టారా? "

"అనూషగారూ! అంత మాటనకండి ప్లీజ్"

జాలేసింది అనూషకి.

"నాకు మనస్ఫూర్తిగా ఇష్టమే. సరేనా? " మృదువుగా అంది.

"థాంక్యూ... థాంక్యూ వెరీమచ్. ఉంటాను. రేపు కలుస్తాను. షాపింగ్‌కి వెడదాం" ఉద్వేగంగా అంటూ ఫోన్ పెట్టే శాడు.

చిత్రమైన భావాలతో నిండిపోయింది ఆమె మనసు. ఏవిటిది? ఈ మధురోహలు, ఈ పులకింతలు! ఇంకా నాలో స్పందనలు మిగిలి ఉన్నాయా? నేనింకా పెద్దదాన్ని కాలేదా? నా గుండె బండబారిపోయిందను కున్నాను. నాలో కూడా స్త్రీ సహజమైన అనుభూతులు ఉన్నాయన్నమాట. ఆశ్చర్య పోతూ హాస్పిటల్‌కి వెళ్లిపోయింది.

★ ★ ★

సరిగ్గా వారం రోజుల తరువాత విధివం చితులైన స్త్రీలకు స్ఫూర్తినిస్తూ, ఆశ్రయాన్ని కల్పిస్తూ తన చేతులతో, తన ఆస్తితో, ఒక ప్రయోజనంతో అనూష నిర్మించుకున్న ఆశ్రమ ప్రాంగణంలో వీణ, డా. హరిశ్చంద్ర, చిన్నయ్య, భరణి తల్లితండ్రులు, శ్యామల, శారద, నీరజా మొదలైన ఆశ్రమవాసుల సమ క్షంలో మంచితనం, మానవత్వం సాక్షిగా అనూష, భరణిల వివాహం జరిగింది.

అందరి అభినందనల పరంపరలో హరి శ్చంద్ర దీవెనల మధ్య డాక్టర్ అనూష, సుప్రసిద్ధ కార్డియో థొరాసిక్ సర్జన్ మిసెస్ భరణి అయింది.

వీణ అనూషకి నెక్లెస్ బహూకరించింది.

అనూష వీణని కౌగలించుకుని "నువ్వు కూడా పెళ్లికూతురివి అయితే చూడాల నుందే" అంది.

వీణ నవ్వింది. కానీ ఆ నవ్వు వెనక దాగిన విషాదం అనూష కళ్లల్లో పడింది.

ఆమె మనసు మూగబోయింది. 'ఏనాటి కైనా ఈ విషాదం నీ జీవితంలోంచి చెరిపే యాలి వీణా' అనుకుంది.

శ్యామల తనే స్వయంగా వంట చేసింది అందరికీ. సుశీల సాయం చేసింది. పెరట్లో కాసిన నిమ్మకాయలు తెంపి పులిహోర చేసింది. టమాటా పెరుగుపచ్చడి, గుత్తివం కాయ, సాంబారు, పాలకూర పప్పు, అప్ప డాలు, వడియాలు, వేపుడుముక్కలు, దోసా వకాయ, గులాబ్‌జామ్, పాయసం వగైరా

వంటకాలతో నిండుగా ఉన్న అరిటాకులు చూస్తుంటే ఇలాంటి శుభకార్యం ఒకటి ఆశ్రమంలో జరపచ్చు అన్న సంగతి మొదటిసారిగా అర్థమైంది అనూషకి. మృదుల ఒక్క మాట తనతో చెప్పి ఉంటే ఈ ఆశ్రమంలో ఆమె పెళ్లి జరిపించేది. మృదులను తల్చుకోగానే గుండెల్లో ఎక్కడో కలుక్కుమంది. ఎంత ప్రేమగా చూసుకుంది తను? ఒక్క మాట చెప్పకుండా వెళ్లిపోయింది. ఆమె వెళ్లిపోవడంతో ప్రతివాళ్లు తనని విమర్శించారు. తన దయాగుణం మీద దాడిచేశారు. కృతఘ్నురాలు.

మృదులలాగా ప్రవర్తించకముందే నీరజక్కూడా మంచి సంబంధం చూసి పెళ్లిచేయాలి. ఈ బాధ్యత ఒకటి తనమీద మిగిలిపోయింది. తన ఈ కొత్త జీవితం సెటిల్ అయాక నీరజ సంగతి చూడాలి. ఈ శుభవేళ మరో శుభకార్యం జరపాలని అప్పటికప్పుడే నిశ్చయించుకుంది.

వంటకాలు అన్నీ రుచి చూసిన భరణి తల్లి మనసారా మెచ్చుకుంది. "ఎంత బాగుందమ్మా నీ చేతి వంట. మా అత్తగారు బతికున్న రోజుల్లో తిన్నానింత రుచికరమైన వంట. మళ్లీ ఇప్పుడు తింటున్నాను"

"శ్యామల చాలా బాగా చేస్తుందండి వంట" అనూష అంది.

ఎందుకో ఆవిడని అత్తయ్యగారూ, అని ఆయన్ని మావయ్యగారూ అని పిలవాలంటే కొత్తగా, కొంచెం ఇబ్బందిగా అనిపిస్తోంది.

ఆవిడ చాలా చిన్నదానిలా ఉంది. సన్నగా, తెల్లగా, పొట్టిగా ఉంది. కోటేరు ముక్కు, చిన్నవైనా ఆకర్షణీయంగా ఉన్న కళ్లు, సన్నటి పెదాలు, సగం నెరిసిన జుట్టు ముడివేసి ముడి చుట్టూ పూలు పెట్టుకుంది. ఆయన మంచి ఒడ్డు, పొడుగూ ఉండి నల్లగా ఉన్నా ఆకర్షణీయంగా గంభీరంగా ఉన్నాడు. భరణికి ఆయన పర్సనాలిటీ ఆవిడ రంగు, మొహం తీరు వచ్చింది. అందుకే అతను అందగాడు అయాడు అనుకుంది.

అందరికన్నా ముందు వీణ భోజనం ముగించి లేచి చేయి కడుక్కుంది. నేప్‌కిన్‌తో చేతులు తుడుచుకుంటూ వచ్చి "అనూ! నేను అర్జంటుగా ఓ చోటికి వెళ్లాలి. నిన్ను మీ ఇంటి దగ్గర కలుస్తాను" అంది.

"మళ్లీ అను ఇంటికి వెళ్లడం దేనికి? ఈ రాత్రి ఇక్కడే ఉండచ్చుకదా!" అంది శ్యామల.

"ఏంటి? కూతురికి పెళ్లిచేసి అత్తారింటికి పంపించకుండా మీ ఇంట్లోనే అట్టిపెట్టుకుంటావా? " వీణ మాటలకి నవ్వారంతా.

"అదికాదు" ఏదో చెప్పబోతున్న శ్యామలకి కళ్లతోటే సైగ చేసింది వీణ. గ్రహించినదానిలా శ్యామల మారుమాట్లాడకుండా ఊరుకుంది.

"వస్తాను వస్తానండి" వీణ భరణి తల్లి తండ్రుల దగ్గర సెలవు తీసుకుంది.

"అలాగేనమ్మా వెళ్లిరా. నీ స్నేహితురాలినేకాదు, మావాడినికూడా ఓ ఇంటివాడిని చేసిన పుణ్యం నీకు దక్కింది? " అన్నాడాయన.

"నాదేం ఉందండి. అంతా దైవ నిర్ణయం" నవ్వింది.

వీణ కారు వెళ్లిపోయింది.

అందరూ భోజనాలు ముగించారు.

"అమ్మాయ్! నిన్ను ఏకవచనంతో సంబోధించాలంటే నాకు నిజంగా మనసు రావడం లేదు. మా కోడలి హోదాలో రాకుండా ఉండి ఉంటే నీ ముందు మేము చేతులు కట్టుకుని నిలబడాల్సిన వాళ్లం. కానీ మరి మా అదృష్టమో, మా వాడి అదృష్టమో నువ్వు మా ఇంటి కోడలివైనావు. ఏది ఏమైనా వీడి గురించి నీకు కొంత చెప్పాలి" భోజనాలు ముగించి పెరట్లో కుర్చీల్లో కూర్చున్నాక అన్నాడు మార్కండేయులు.

"బాగుందండి. అమ్మాయికి పెళ్లిచేసి పంపిస్తూ అంపకాలు పెడతారు ఎవరైనా.





మీరు అబ్బాయికి అంపకాలు పెడుతున్నారా?" లక్ష్మి మాటలకి అనూష చిరునవ్వుతో చూసింది.

"అంపకాలు కాదు. రేపట్నించి వీడిని భరించాల్సింది ఆ అమ్మాయి. వీడి కోపం, పంతం వగైరా చెప్పకపోతే ఎలా తెలుస్తుంది? వీడుత్త మొండివాడమ్మా. భూమ్యాకాశాలు తల్లకిందులైనా వాడు అనుకున్నది సాధించాలి అంతే"

"ఆ విషయం మీరు వేరుగా చెప్పాలా మా అనూషను భార్యగా సాధించడంలోనే అతని పట్టుదల తెలిసింది మాకు" శ్యామల చిరునవ్వుతో అంది.

"మంచిమాట అన్నావమ్మా. పోనీలే ఆలస్యం చేసినా బంగారంలాంటి భార్యను సంపాదించుకున్నాడు"

అనూష కొంచెం ఇబ్బందిగా అంది "మీరలా మాటిమాటికి పొగుడుతుంటే నాకు ఇబ్బందిగా ఉందండి"

"సరేలే పొగడను." అన్నాడాయన.

సుశీల అందరికీ పాన్‌లు చుట్టుకుని తీసుకొచ్చి ఇచ్చింది. భరణి వీళ్ల మాటలతో తనకేం సంబంధం లేనట్టు, ఆశ్రమం మొత్తం కలియతిరిగి వచ్చాడు. ప్రశాంతంగా పూలమొక్కలతో కుటీరంలా ఉన్న ఆశ్రమం అతనికి బాగా నచ్చింది. ముఖ్యంగా అక్కడివాళ్లంతా అనూషకి ఇస్తోన్న గౌరవం చూస్తుంటే అతని గుండె గర్వంతో పొంగిపోతోంది. ఆమె వాళ్లకి ఇచ్చిన సౌకర్యాలు, భద్రత చూస్తోంటే గర్వంగా అనిపిస్తోంది అతనికి. ఇంతటి గొప్ప స్త్రీమూర్తి తన భార్యా? నమ్మలేని నిజాల్లో ఇదొకటి కాబోలు అనుకున్నాడు.

నీరజ కొడుకుతో కాస్సేపు ఆడుకున్నాడు. అతనలా ఆడుకోడం చూసిన శ్యామల 'భగవంతుడా! వచ్చే ఏటికల్లా మా అనూష కూడా పండంటి. పాపాయిని ఎత్తుకోవాలి' అని దీవించు తండ్రీ! అని వేడుకుంది.

ఆశ్రమంలో స్త్రీలంతా కలిసి తెల్లటి బెడ్ షీట్ మీద ఎంబ్రాయిడరీ చేసి అనూషకి బహూకరించారు.

అయిలయ్య తను దాచుకున్న డబ్బులో యాభై రూపాయలు ఇచ్చి "ఈ నాన్న ఇస్తున్నాడు అనుకుని తీసుకోమ్మా. జాకెట్టుగుడ్డ కొనుక్కో" అన్నాడు.

వాళ్లందరి ఆప్యాయత, అభిమానం చూస్తోంటే అనూష కళ్లు చెమర్చాయి.

చూస్తుండగానే ఆరు దాటింది. సంధ్య చీకట్లు ముసురుకున్నాయి. శారద ఒకటి, రెండు పాటలు పాడి వినిపించింది.

ఆ రాత్రికే భరణి తల్లితండ్రుల ప్రయాణం. "అనూషా! మేము మీ ఇంటికి వచ్చినా రాకపోయినా ఏడాదికి కనీసం ఒక్కసారన్నా ఈ ఆశ్రమానికి వచ్చి ఓ పది రోజులు ఉండి వెళతాం" అన్నాడాయన.

"అంతకంటేనా? మీరు వస్తే మా అందరికీ కొండంత అండగా ఉంటారు. ఈ ఆశ్రమం మీ రాకకోసం ఎదురుచూస్తూ ఉంటుంది" అంది శ్యామల.

నీరజ కొడుక్కి, సుశీల కొడుక్కి ఐదేసి వందల చొప్పున ఇచ్చాడు మార్కండేయులు.

భరణి తల్లితండ్రులకి ఖరీదైన బట్టలు పెట్టింది అనూష. లక్ష్మి కోడలికి రాళ్ల నెక్లెసు ఇచ్చింది. పాతకాలంనాటి నెక్లెసు అయినా అనూష సంతోషంగా తీసుకుంది.

ఆరున్నరకి అనూషా, భరణీ బయలుదేరారు. శ్యామల అనూష చెవిలో రహస్యంగా అంది "అంతా బాగుందికానీ ఆ కాస్త కార్యక్రమం కూడా ఇక్కడే జరిపిస్తే బాగుండేది"

"ఏకాస్త?" చిత్రంగా చూసింది అనూష.

"చిన్నపిల్లలా మాట్లాడకు" చిరుకోపంగా మందలించింది.

అర్థమైన అనూష చెంపలు కందిపోయాయి. మధురమైన అనుభూతి ఒకటి పిల్లతెమ్మెరలా వీచి, అణువణువుకీ పాకింది. పెళ్లంటే తోడు అనుకుంది కానీ

అనురాగంతో పెనవేసుకున్న మనసుల తాలూకు శరీరాలు రెండు ప్రేమైకమోహంతో పెనవేసుకుపోతాయన్న నిజం ఒకటి అప్పుడే గుర్తొచ్చినట్టు అనిపించింది. సిగ్గుపడి నవ్వి ఊరుకుంది.

అనూషా, భరణీ ఎక్కిన కారు బయలు దేరింది.

"మీరూ రావచ్చుగామ్మా. నాలుగు రోజులుండి వెళ్లచ్చుగా" అడిగాడు భరణి.

"మాకెలా కుదురుతుందిరా. మేమిక్కడ ఉంటే అక్కడ పొలం, పుట్ర, గొడ్డూగోదా ఏంకావాలి? మీరే కాస్త వీలు చూసుకుని మన ఊరు రండి. ఏమ్మా అనూషా! నీకు వీలవుతుందా? దీపావళికి అక్కడికి మన ఊరికి వచ్చేయండి"

"అలాగే మావయ్యా" అప్రయత్నంగా అంది అనూష. అన్న తరవాత ఆమెకే చిత్రంగా అనిపించింది. ఏంటిది? ఇదేనా వివాహబంధం అంటే అనుకోకుండా వరస కలిపేసిందేంటి?

ఆ పిలుపుకి ఆయన మొహంలో కనిపించిన వెలుగు చూశాక అనిపించింది పాపం ఎంతకాలంగా ఈ పిలుపుకోసం ఎదురుచూస్తున్నాడో ఈయన.

"గాడ్‌బ్లెస్‌యూ మైడియర్ ఛైల్డ్" మన స్ఫూర్తిగా దీవించాడు.

"జాగ్రత్తమ్మా... నీకేదన్నా ఇబ్బంది ఉంటే మాకు ఫోన్ చేయి" చెప్పిందావిడ.

"అలాగే"

"ఒరేయ్ జాగ్రత్త. ఆ అమ్మాయిని నీ తెలివి తక్కువతో విసిగించకు" భరణితో అన్నారిద్దరూ.

భరణి అదోలా మొహం పెట్టాడు. అతని మొహం చూసి నవ్వింది అనూష.

అందరి దగ్గరా సెలవు తీసుకుని ఇద్దరూ సిటీకి ప్రయాణం అయారు.

★ ★ ★

మొట్టమొదటిసారిగా అనూష పక్కన కూర్చున్న భరణికి కొంచెం బిడియంగా అనిపించింది. అమ్మో! తనసలు అర్హుడేనా ఇలా కూర్చోడానికి? అనిపించింది. అనూష ఎంత గొప్ప స్త్రీ. ఎంత గొప్ప సంఘ సేవకురాలు! ఎంత గొప్ప డాక్టరు! పెద్దపెద్ద వాళ్లంతా ఆమెతో మాట్లాడడానికి జంకుతారు. ఆమె కనిపిస్తే లేచి నిలబడి గౌరవిస్తారు. అలాంటిది ఈమె తన భార్య. గర్వంతో అతని ఛాతీ కొన్ని అంగుళాలు పెరిగినట్టు అయింది. ఆమెతో ఏదన్నా మాట్లాడాలనిపించింది. ఏం మాట్లాడాలో అర్థంకాలేదు.

అనూషది కూడా కొంచెం తేడాగా అదే పరిస్థితి. ఇద్దరిమధ్యా చిత్రమైన నిశ్శబ్దం ఆవరించింది. దాన్ని ఛేదించడానికి ఇద్దరూ ప్రయత్నించడంలేదు. ఎవరికి వారికే ఏదో ఇబ్బందిగా ఫీలవుతున్నారు. ఒకరు ఇన్‌ఫీరియర్‌గా ఫీలవుతున్నారు. ఒకరు జంకుగా ఫీలవుతున్నారు. ఎవరికివారే, ఎదుటివారు పలకరిస్తే బాగుండునని ఆశిస్తుండగానే ఇల్లు చేరింది కారు.

కారు దిగి, గుమ్మంలోపలికి అడుగుపెట్టబోతూ, ఎదురుగా హారతి పళ్లెంతో వచ్చిన వీణను చూసి ఆశ్చర్యపోయింది అనూష.

"అర్జంటు పనని చెప్పి, ఇందుకా నువ్వు ఆదరా బాదరాగా వచ్చింది? " అంది.

వీణ నవ్వి హారతిచ్చింది. "ఇప్పుడు రండి లోపలికి" అంది అడ్డు తొలుగుతూ.

లోపలికి అడుగుపెట్టగానే సన్నటి మధురమైన పరిమళం తీయగా పలకరించింది. వీణ ఇల్లంతా శుభ్రంచేసి, కడిగించి, ముగ్గులు పెట్టి, రూం స్ప్రే చేసింది. ఆహ్లాదంగా ఉంది వాతావరణం.

"లోపలికి వెళ్ళి స్నానంచేసిరా" వీణ అంది.

బెడ్‌రూమ్‌వైపు వెళ్ళబోతున్న అనూషను వారించింది. "ఏయ్! అటు వెళ్లకు... ఇటు ఇటు"

"ఏం? " ఆశ్చర్యంగా చూసింది అనూష.

"చెప్తాలే... వెళ్ళి అవతల బాత్రూంలో




చేసిరా"

అనూష ఏం మాట్లాడలేదు. వేరే బాత్ రూంలోకి వెళ్ళిపోయింది. వేడినీళ్ళు సిద్ధంగా ఉన్నాయి. మగ్‌తో నీళ్ళు తీసుకుని ఒంటిమీద పోసుకోగానే, ఓ మధురమైన పరిమళం శరీరం నిండా వ్యాపించింది. ఉడుకులోన్ కలిపినట్టుంది నీళ్లలో వీణ.

స్నానం పూర్తిచేసి నైటీతో వచ్చిన అనూషకి తెల్లచీర, జాకెట్టు, మల్లెపూలు ఇచ్చింది వీణ.

"ఏవిటోయ్ ఇది? "

"ఫస్ట్‌నైట్ హడావుడిలే... మీ ఇద్దరికీ భోజనం సిద్ధంచేశాను. రండి... వడ్డిస్తాను" కిచెన్‌వైపు నడిచింది.

"భరణి స్నానం చేయాలికదా!"

"అయిపోయింది. రండి భోంచేద్దాం" అన్నాడు వెనకనుంచి వచ్చిన భరణి. అనూష తలతిప్పి చూసింది. తెల్లని పైజమా, లాల్చీ వేసుకుని నీటుగా తయారై ఉన్నాడు.

వీణ గట్టిగా నవ్వింది.

ఇద్దరూ అయోమయంగా చూశారామె వైపు... "ఏం జరిగింది? " అడిగింది అనూష.

"మన దేశంలో ఆడవాళ్ళకి ఇంత గౌరవం ఇచ్చే మొగుళ్లున్నారా అని ఆశ్చర్యంగా అనిపించింది. బాగా నవ్వొచ్చింది. ఏం భరణీ! అనూష ఇంకా డాక్టర్‌గానే కనిపిస్తోందా? "

భరణి మొహమాటంగా నవ్వాడు. "ఆవిడ ఏమన్నా అనుకుంటారేమోనని" అన్నాడు నసుగుతూ.

అనూష నవ్వి ఊరుకుంది. ఏం మాట్లాడలేదు.

ముగ్గురూ భోజనం పూర్తిచేశాక, భరణి బెడ్‌రూంలోకి వెళ్ళిపోయాడు. వీణ అనూష దగ్గర సెలవుతీసుకుంది.

"నేను వెళ్తాను అనూ! ఇవాళ ఇక్కడ వాచ్‌మాన్ దగ్గర్నించి అందరికీ సెలవిచ్చాను. నేనూ వెళ్తున్నాను. ఎంజాయ్ ఎ లాట్... బైదిబై... రేపు ఉదయం లేవగానే, కొత్తకొత్త అనుభూతుల రుచి నాకు తెలియచేయి. వస్తాను గుడ్‌నైట్... 'అండ్ స్వీట్ మెమరీస్"

అనూషకి ఒకవైపు, వీణ అభిమానం ఉక్కిరిబిక్కిరి చేస్తోంటే, మరో పక్క ఫస్ట్‌నైట్ అనే పదం కొంచెం గాభరా కలగచేస్తోంది. అదే అంది వీణతో. "ఎందుకిలా హడావుడి చేశావు? ఏదో క్యాజువల్‌గా జరిగిపోతే బాగుండేది. ఇలా హడావుడి చేసేటప్పటికి నాకేంటో ఇబ్బందిగా ఉంది"

"ఇబ్బందిగా ఉండడం ఏంటి? టీనేజీ అమ్మాయిలా... డోంట్ బి సిల్లీ... వెళ్లు అతను ఎదురుచూస్తుంటాడు... గుడ్‌నైట్"

కారులో కూర్చున్న వీణ చేయి ప్రేమగా నొక్కింది. ఏ జన్మబంధమో మనది అనుకుంది. వీణ కారు కదిలింది. చీకట్లో కనుమరుగయిందాకా చూసి లోపలికి రాబోతూ గేటు, తలుపులు తనే వేసుకోవాలన్న సంగతి గుర్తొచ్చి, తిరిగి వెనక్కి వెళ్ళి తలుపు లేసి, గదిలోకి నడిచింది. భరణి, సోఫాలో కూర్చుని టీ.వీ. చూస్తున్నాడు. అనూషను చూడగానే లేచి నిలబడ్డాడు. అనూషకి ఎలాగో అనిపించింది. ఇంటర్వ్యూ కోసం వచ్చిన జర్నలిస్టులా లేచి నిలబడడం ఏంటి? ఇప్పుడు తను భర్త అన్న సంగతి మర్చిపోతున్నట్టున్నాడు అనుకుంది.

అతను చూస్తున్న ఛానెల్ చూసింది. డిస్కవరీ ఛానెల్ చూస్తున్నాడు.

తలతిప్పి ఒక్కసారి మంచంవైపు చూసి ఉలిక్కిపడింది. రోజూ తను పడుకునే మంచం ఇవాళ కొత్తగా, అందంగా ఉంది. మల్లెపూల తోరణాలు వేళ్లాడుతున్నాయి నాలుగువైపులా. పరుపుమీద తెల్లటి దుప్పటి. దుప్పటిమీద మధ్యలో పూలతో డెకొరేట్ చేసిన వెల్‌కం టు ఫస్ట్‌నైట్ అనే అక్షరాలు... మంచానికి కొంచెం ఎడంగా చిన్న స్టూలు మీద స్వీట్స్, పండ్లు, అగరొ

త్తులు, ఆ అలంకరణ చూడగానే సిగ్గుతో అణువణువూ కుంచించుకుపోయినట్టు అనిపించింది. భరణివైపు సూటిగా చూడడానికి సిగ్గేసింది. "వీణకసలు బుద్ధిలేదు" అంది ఎవరితోటో అన్నట్టుగా.

భరణి బిత్తరపోయి చూశాడు.

అనూష అతనివైపు చూడకుండా సోఫాలో కూర్చుని, "కూర్చో భరణీ!" అంది.

భరణి ఆమె పక్కనే కూర్చుని "థాంక్యూ" అన్నాడు.

అతని బిడియం, మొహమాటం చూస్తుంటే అనూషకి కొంచెం జాలేసింది. పంతంపట్టి, కోరి పెళ్లి అయితే చేసుకున్నాడుగానీ ఓ భర్తలా చనువుగా మసులుకోడానికి బిడియపడుతున్నాడు. తననింకా డాక్టర్ అనూషగానే చూస్తున్నాడు తప్ప భార్యగా చూడడంలేదు. తనంతట తను అతడితో చనువుగా ఎలా ప్రవర్తిస్తుంది? అయినా అనూష కొంచెం స్నేహంగా మాట్లాడి అతని బిడియం పోగొట్టటానికి నిర్ణయించుకుంది. "నీకు ఎక్కువగా ఏ ఛానెల్ ఇష్టం భరణీ?" అడిగింది.

"డిస్కవరీ, సోనీ, స్టార్‌ప్లస్"

"తెలుగూ..?"

"పొరపాటున కూడా చూడను"

"ఎందుకనీ?"

"ఎందుకేంటీ? విసుగూ, విరామం లేకుండా సీరియల్స్, ఫోనులో ప్రేక్షకులతో మాట్లాడడాలూ... అబ్బా ఏమిటో నాకసలు ఇష్టం ఉండదు."

"హాల్‌మార్క్ అని ఇంకో ఛానెల్ ఉంది. చాలా బాగుంటుంది. చూడు" అంటూ ఛానెల్ మార్చింది. ఏదో ఇంగ్లీషు నాటకం వస్తోంది. కాస్సేపు హాలీవుడ్ స్టార్స్ గురించి మాట్లాడుకుంటూ అర్ధరాత్రి దాకా ఆ ఛానెల్ చూస్తూ కూర్చున్నారు. అలాగే ఎప్పుడో నిద్రపోయింది అనూష.

తెల్లారేటప్పటికి భరణి మంచంమీద గాఢంగా నిద్రపోతున్నాడు. స్టూలుమీద ఉన్న పండ్లు, స్వీట్లు ఫక్కున నవ్వినట్టు అనిపించింది.

నిద్రపోతున్న భరణిని చూసి 'అయ్యో! ఎంత డిసప్పాయింట్ అయ్యాడో' అనిపించింది.

సోఫాలోంచి లేచింది. ఫోన్ మోగింది. బద్ధకంగా ఆవలిస్తూ వెళ్లి రిసీవర్ తీసుకుంది. అవతలనుంచి వీణస్వరం వినిపించింది. "హాయ్ అనూ! హౌ ఈజ్ లైఫ్?" ఫోన్ మోగింది.

అవతలనుంచి వీణ స్వరం వినిపించింది. "హాయ్ అనూ! హౌ ఈజ్ న్యూ లైఫ్?" హుషారుగా అడిగింది.

అనూష మధురంగా నవ్వి అంది "సో ఫ్రెండ్లీ"

"వాట్? ఫ్రెండ్లీగా ఉండడానికి పెళ్ళి అని, మంగళసూత్రం అనీ ఈ హడావుడి దేనికి?"

"పెళ్ళి మాత్రం దేనికి?" అని నవ్వి, "వీణా! నీకు చెప్పాను కదూ! స్నేహంగా కలిసి తిరుగుతూ, కలసి గడుపుతూ ఓ మహత్తరమైన క్షణంలో ఒకరినొకరు తాకాలన్న తపనతో తనువులు కలిసి, ఏకమైన క్షణం కావాలి. ఆ క్షణం పగలైనా రావచ్చు రాత్రైనా రావచ్చు ఎక్కడైనా రావచ్చు. దాని కోసం ఇంత హంగామా, హడావుడి దేనికి? ఒకరికొకరు అర్థమై, ఏకమయ్యే మధుర క్షణం వచ్చాక అనుభూతులను, అనుభవాలను మాలగా గుచ్చి అందిస్తాను. అందాకా ఓపికపట్టు"

వీణతో చెప్పినట్టుగానే అనూష జీవితంలో ఓ ముఖ్యమైన మలుపు మొదలైంది. చక్కటి స్నేహపూరిత వాతావరణంలో రెండురోజులు గడిచాయి. ఆ రెండు రోజులూ హాస్పిటల్‌కి వెళ్లలేదు. వెళ్ళినా తనని ఎవరూ రానివ్వరని తెలుసు అనూషకి. వంటమనిషి కూడా లేకపోవడంతో తనే వంటచేయాల్సి వచ్చింది. అసలు, సిసలైన గృహిణిలాగా తెల్లవారుఝామునే లేచి,




వాకింగ్ పూర్తిచేసి వచ్చి స్నానం చేసి, పూజచేసుకుని, స్టవ్ దగ్గరకి వెళ్తుంది. కాఫీ కాచి భరణిని లేపడం, ఇద్దరూ కలిసి కాఫీ తాగడం, ఆమె వంటచేస్తుంటే భరణి కూరలు తరిగిస్తూ, వస్తువులు అందిస్తూ సాయంచేయడం, ఒకరి అనుభవాలు ఒకరు పంచుకుంటూ సరదాగా గడిపేశారు. ఎంత సరదాగా ఉన్నా, అతనిలో బిడియం పోకపోవడంతో అనూష తనే చనువు చేయాల్సివచ్చింది.



భరణి రూమ్ ఖాళీచేసి సామానుతో సహా అనూష ఇంటికి వచ్చాడు.

పెళ్ళికాగానే ఆడపిల్లలు అత్తారింటికి వెళతారు. నేనిక్కడ రివర్స్, నీ దగ్గరకు వచ్చాను" అన్నాడు నవ్వుతూ.

"తనకంటూ ఇల్లులేని ఆడపిల్ల తప్పనిసరిగా అత్తారింటికి వెళ్ళాలి. కానీ ఈ ఆడపిల్ల అన్నీ అమర్చుకున్నాకే పెళ్ళిచేసుకుంది"

"అవునులే... నువ్వు అందరిలాంటిదానివి కావుగా" నవ్వేశాడు.

కోరుకున్నది సాధించాక భరణికి జీవితం రసవత్తరంగా, అద్భుతంగా అనిపించసాగింది.

అనూషలో కూడా చాలా మార్పు వచ్చింది. గంభీరంగా ఉండే ఆమెలో కొద్దిగా చిలిపితనం, సూటిగా చూస్తూ, అనుక్షణం పరిశోధనాత్మకంగా చంచలించే ఆ కళ్ళల్లో చిత్రమైన కాంతి, చర్మంలో మెరుపు, చెక్కిళ్ళలో నునుపు, పెదవులపైన ఆరనితడి, కొత్త అందంతో కళకళ్లాడుతోన్న అనూషతో అంది వీణ ఓరోజు.

"చూశావా! ఒకరోజున నీతో అన్నాను. దాంపత్యజీవితం గడిపే స్త్రీలలో ఉండే కాంతి, తృప్తి ముందు ఎంత అందమైనా వెలవెలబోతుందని. ఆ కాంతి, తృప్తి ఇప్పుడు నీ మొహంలో కనిపిస్తోంది. అబ్బ! ఇంత అందం ఎక్కడ దాచావమ్మా ఇంతకాలం"

అనూష చిరుకోపంగా చూసింది.

"భరణి బాగా చూసుకుంటున్నాడా?" అడిగింది వీణ.

"భరణి నన్ను చూసుకోవడం ఏంటి? నేనే అతడిని చూసుకుంటున్నాను. అయినా, అనూషకి కొత్తగా సెక్యూరిటీగార్డు కావాలా? కేవలం ఓ తోడుకావాలని చేసుకున్నాను... అంతే"

"అనూ! ఆత్మవిశ్వాసం, వ్యక్తిత్వం నీకు ఆభరణాలే. కానీ ఓ భార్యగా నువ్వు కొంచెం నీ మాటల్లో తీవ్రత తగ్గించాలి. భరణి నీ పేషెంటు కాదు"

ఒక్కక్షణం ఆ మాటలకి తెల్లబోయినా వెంటనే ఫక్కున నవ్వేసింది. "నిజమే! కొంచెం కమాండింగ్ తగ్గించాలి వాయిస్‌లో"

వీణ కూడా నవ్వింది. "దొరగారి పత్రిక ఎలా నడుస్తోంది?"

"ఏమో! రెండుసార్లనుంచీ రాలేదుట... ఈ సారి స్పెషల్ ఇష్యూ వేస్తాడుట"

"మీ పెళ్ళి సందర్భంగానా?"

"నో‌ర్మ్యయ్... వార్షికోత్సవంట"

"ఓ! నవ్వేసింది. బైదిబై అనూ! నేను కొంతకాలంపాటు ఇండియా టూర్ వెళ్లాలనుకుంటున్నాను"

"ఇండియా టూరా? ఎందుకు? ఒక్కదా

నివా? ”

“కాదులే నా బాయ్‌ఫ్రెండ్ వస్తున్నాడు”

“ఏయ్! నిజంచెప్పు... ఎందుకలా? ”

“నిజంగా వెళ్తున్నాను... ఒక్కదాన్నే వెళ్తున్నా. ఇండియాలో ఉన్న అన్ని ప్రదేశాలూ చూసి రావాలని ఉంది”

“మరి నీ ప్రాక్టీస్? ”

“ఏమవుతుంది? బతికుంటే మళ్ళీ వచ్చాక చేసుకుంటాను”

“ఏంటా మాటలు? ”

“సరదాకి అన్నాలే. ఏవిటో లైఫ్ బొత్తిగా మొనాటనస్‌గా అనిపిస్తోంది. ఏదన్నా మార్పుకావాలనిపిస్తోంది”

“అందుకే పెళ్ళి”

“అనూ! మందలింపుగా పిలిచింది. దయచేసి ఇంకెప్పుడూ నా పెళ్ళిమాటెత్తకు”

“ఏం? ”

“అనూ... ప్లీజ్”

అనూష మాట మార్చింది. “ఇంతకీ ఎప్పుడు బయలుదేరుతున్నావు? ”

“ఇంకా టైం ఉంది. మేలో మాకు హాలీడేస్ ఉంటాయిగా! అప్పుడు బయలుదేరతాను”

“అంటే ఇంకా నెలరోజులు టైం ఉందన్నమాట. నువ్విలా వెళితే, నేనేం కాను? ”

“ఇదివరకైతే ఈ మాట బాగుండేది. ఇప్పుడు చాలా అసహ్యంగా ఉంటుంది. భరణి ఏమనుకుంటాడు? ”

అనూష కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి... 'నాకు జీవనమాధుర్యం రుచిచూపించిన నెచ్చెలీ! నీ భవిష్యత్తేంటి? ' అనుకుంది బాధగా.

“అనూ! ఏవిటా కన్నీళ్ళు? ”

“వీణా!” చప్పున వీణని కౌగలించుకుంది. వీణ కళ్ళుకూడా చెమర్చాయి. ఏ మహత్తర క్షణంలో కలిశారో, స్నేహం పాదులా అల్లుకుపోయింది. కష్టాలూ, సుఖాలూ, కన్నీళ్ళూ, చిరునవ్వులూ ఎన్ని... ఎన్నెన్ని ఈ చిన్ని జీవితంలో.

మనిషికీ, మనిషికీ మధ్య వ్యాపారసంబంధమైన లావాదేవీలేగానీ, ఇంతటి విడదీయరాని అనుబంధం ఉంటుందని అనూష పరిచయంతోనే తెలిసింది.

విషాదం గుండెల్లో నిండిపోయి, కన్నీరు ధారా ప్రవాహంలా కారిన క్షణాలెన్నో.

కానీ, ఆనందానుభూతి అనిర్వచనీయమై గుండె కదలి, నీరై కంట్లో చెమర్చిన ఇలాంటి మధురక్షణాలు కొన్నే... అవి కేవలం అనూష సాంగత్యంలోనే అనుభవానికి వచ్చాయి.

ఆ ఇద్దరు స్నేహితురాళ్ల ఆ గాఢపరిష్వంగంలో కాలం స్నేహాన్ని కొత్తగా నిర్వచించడానికి వేగంగా కదుల్తున్నట్టు చీకటి కమ్ముకుంది.

భరణి బైక్ శబ్దం వినిపించడంతో ఇద్దరూ ఉలిక్కిపడి సర్దుకున్నారు. అనూష లైటు వేసింది.

భరణి లోపలికి వస్తూనే వీణని చిరునవ్వుతో పలకరించాడు. “బాగున్నారా? ”

“నువ్వెలా ఉన్నావు భరణీ!” అడిగింది.

“మీదయవలన చాలా సంతోషంగా ఉన్నాను”

“పత్రిక ఎక్కడిదాకా వచ్చింది? ”

“వస్తుంది. స్పెషల్ ఇష్యూ వేస్తున్నాను. మాకేవన్నా యాడ్స్ ఇప్పించకూడదూ!”

“యాడ్సా? దాందేముంది? తప్పకుండా ఇప్పిస్తాను” వీణ బ్యాగ్‌లోంచి రెండు విజిటింగ్ కార్డ్లు తీసిచ్చి, “రేపు వీళ్ళిద్దరినీ కలువు. నేను ఫోన్ చేసి చెప్తాను” అంది.

“థాంక్యూ! థాంక్యూ మేడమ్” వికసించిన మొహంతో అన్నాడు.

అనూషవైపు తిరిగి “నీ వంతుకూడా ఏదన్నా కాంట్రిబ్యూషన్ ఉందా? ” అడిగాడు.

“ఏ రకంగా? ” అడిగింది.

పని కుర్రవాడు ముగ్గురికీ మంచినీళ్ళు, బిస్కట్లు, టీ తీసుకొచ్చాడు.

“ఈ రకంగా” విజిటింగ్ కార్డు చూపిస్తూ అన్నాడు.





"దేనికివి? " అడిగింది.

"ఎందుకేంటీ? మా పత్రిక బొత్తిగా లాస్‌తో నడుస్తోంది. ఏదో నీ పేరుచెప్పుకుని, రెండుసార్లుగా సర్క్యులేషన్ పెంచుకున్నా కానీ, అడ్వర్‌టైజ్‌మెంట్లు లేవు. అవి లేకపోతే డబ్బుండదు. డబ్బులేకపోతే పత్రిక రాదు. పత్రిక రాకపోతే నేను అన్‌ఎంప్లాయిని అవుతాను"

"ఎంత డబ్బు కావాలి? "

"ఎంత ఉన్నా సరిపోదు... లక్షల్లో కావాలి"

"ఎందుకంత? " ఆశ్చర్యంగా చూసింది.

"డబ్బులేకుండా ఎలా? పత్రిక నడపడం అంటే తమాషాకాదు. నీలాగా పర్‌నకోసి, సర్‌న డబ్బులు తీసుకోడం కాదు. ఎంత కష్టపడాలో తెలుసా! ఫైనాన్షియల్‌గా చాలా ఇబ్బందిగా ఉంది"

అనూష చివ్వున సోఫాలోంచి లేచి లోపలికెళ్లింది. ఆమె ఎందుకలా వెళ్ళిందో అర్థంకాని, వీణ, భరణి ఒకరిమొహాలొకరు చూసుకున్నారు. రెండు క్షణాల్లో అనూష చేతిలో చెక్కుతో వచ్చింది. "ప్రస్తుతానికి నా తరపున కాంట్రిబ్యూషన్ ఇది. అడ్వర్‌టైజ్‌మెంట్లు ఇప్పించే శక్తి నాకు లేదు" అంది చెక్కు భరణి చేతికిస్తూ.

భరణి మొహంలో ఆ క్షణంలో కనిపించిన ఆనందం, వెలుగు చూసిన వీణ మనసెందుకో చివుక్కుమంది. భరణి మంచివాడేనా? ఒక ప్రశ్న బాణంలా గుండెని తాకింది. తిరిగి తనకుతానే సర్దుకుని సోఫాలోంచి లేచింది.

"ఓకే అనూ! నే వస్తాను. గుడ్‌నైట్, గుడ్‌నైట్ భరణీ!"

"భోంచేసి వెళ్ళకూడదు!" అనూష అంది.

"వద్దు... ఇవాళ పార్టీ ఉంది. ఒక సీనియర్ లాయర్‌కి జడ్జీగా ప్రమోషన్ వచ్చింది. ఆయన పార్టీ ఇస్తున్నారు"

"అలాగా!" అనూష కూడా లేచింది.

వీణ గుమ్మందాకా నడిచి, ఒక్కసారి వెనక్కి తిరిగింది. హాల్లో పైన గోడకి తగిలించిన నిలువెత్తు వెంకటేశ్వరస్వామి పటం చూసింది. ఆ పటానికి అటూఇటూ ఉన్న అనూష తల్లిదండ్రుల ఫోటోలు చూసి బైటికి నడిచింది.

"భక్తి ఎక్కువైనట్టుంది" వెనకే వచ్చిన అనూష అంది.

వీణ ఏం మాట్లాడకుండా, ఆమె చేయి నొక్కి వదిలేసింది. వీణ కారు కదిలిందాకా చూసి అనూష లోపలికి నడిచింది.

ఆ రాత్రి అన్యమనస్కంగా ఉన్న అనూషని దగ్గరకి తీసుకుంటూ, "ఏంటి డల్‌గా ఉన్నావు" అని అడిగాడు భరణి.

అనూష సన్నగా నిట్టూర్చి అంది. "ఏంలేదు. వీణక్కూడా ఎవరన్నా తోడు దొరికితే, పెళ్ళి చేయాలని ఉంది"

"ఆవిడ్ని ఎవరు చేసుకుంటారు? "

చివ్వున దూరం జరిగింది. "ఎందుకలా అన్నావు? "

ఆమె ప్రశ్నలోని తీవ్రతకి కొంచెం జంకి, తమాయించుకుని అన్నాడు. "ఆవిడ క్యారెక్టర్ మంచిదికాదంటారు. చాలామందితో సంబంధాలున్నాయిట"

"భరణీ!" తీవ్రంగా పిలిచింది. "ఇంకెప్పుడూ వీణ గురించి ఇలా మాట్లాడకు. మొదటిసారి కాబట్టి క్షమిస్తున్నాను. జర్నలిస్టువి, చదువుకున్నవాడివి నువ్వు కూడా ఇలా మాట్లాడగలవా? "

"వీణగారు నాకూ ఫ్రెండేగా... నువ్వు పెళ్ళిమాట ఎత్తావుకాబట్టి, నలుగురూ అనుకునే మాట నేను అన్నాను. ఆవిడ జీవితం సెటిల్ అయితే నాకు మాత్రం ఆనందం కాదా!" నెమ్మదిగా అన్నాడు.

అనూష మాట్లాడలేదు. దూరంగా జరిగి పడుకున్న ఆమె దగ్గరకి జరిగి "సారీ అనూ! నువ్వింత హర్ట్ అవుతావనుకోలేదు. ఎక్స్‌ట్రీమ్లీ సారీ" అన్నాడు.

అతడి మొహంలో, కళ్లల్లో, స్వరంలో కదిలిన పశ్చాత్తాపం గమనించిన అనూష అతడి

దగ్గరగా జరిగి నెమ్మదిగా అంది. "ఎవరి జీవితం వాళ్ళది. ఎవరికి నచ్చినట్టు వాళ్ళు బతికే అధికారం, హక్కు ఉన్నాయి. ఇంకెప్పుడూ ఇతరుల జీవితవిధానాన్ని విమర్శించద్దు"

"అలాగే" మరి మాట్లాడకుండా పెదవులు మూశాడు.

★ ★ ★

భరణి పేపర్ స్పెషల్ ఇష్యూ వచ్చింది. పెళ్ళి ఫొటోలు, వార్తతో ఓ పేజీ మొత్తం స్పెషల్‌గా కేటాయించాడు. అనూష కొద్దిగా అసంతృప్తి ప్రదర్శించింది.

"ఎందుకీ పబ్లిసిటీ? " అంది.

"నీ అంత గొప్ప స్త్రీకి భర్తనైనానన్న విషయం ప్రపంచానికి చాటాలనిపించింది" అన్నాడు ఆమె ఒళ్లో తలపెట్టుకుని పడుకుంటూ.

"కోరిక బాగుంది కానీ చూసేవాళ్ళకి అసహ్యంగా ఉండదూ!" అంది అతని క్రాఫ్‌లో వేళ్ళుజొనిపి సవరిస్తూ.

"ఏం ఉండదు? అసలింకా ఆర్భాటంగా వేద్దామనుకున్నాను. కానీ పెళ్ళి సింపుల్‌గా జరగాలన్నావని వీణగారు చెప్పడంతో కాంప్రమైజ్ అయ్యాను. కానీ నాకు మాత్రం పెళ్ళి గ్రాండ్‌గా చేసుకోలేదన్న అసంతృప్తి అలాగే ఉంది"

"ఈ వయసులో పెళ్ళిచేసుకోవడమే సిగ్గుగా అనిపించింది. పైగా ఆర్భాటం, హడావుడి దేనికని వద్దన్నాను"

"నిజమే... కానీ వయసు సంగతలా ఉంచు. మొదటి పెళ్ళి కదా మనిద్దరికీ. పెళ్ళి అనేది మళ్లీ మళ్ళీ చేసుకోం... అదొక మధురానుభూతిగా జీవితాంతం మిగలాలంటే కొంచెం ఆర్భాటం తప్పదు"

"మనం కలిసి బతకడమే ఓ మధురానుభూతిగా మిగుల్చుకుందాం... సరేనా? "

"అఫ్‌కోర్స్... నిజమే... నువ్వు దక్కావు చాలు నాకు, నా జీవితం ధన్యమైంది అనిపిస్తుంది"

"ఇంత హెవీ డైలాగ్స్ అవసరమా? "

"ఇంకా హెవీ డైలాగ్స్ అవసరం. కానీ నాకు రావు... అనూ! ఐ లవ్ యూ... నిజంగా నువ్వు పెళ్ళికి ఒప్పుకుంటావో, లేదో నని ఎంత టార్చర్ అనుభవించానో తెలుసా! అదేవిటో అమ్మా, నాన్న కూడా ఇంత త్వరగా అంగీకరిస్తారనుకోలేదు నేను"

"కలిసొచ్చేకాలం వస్తే నడిచొచ్చే పిల్లలు పుడతారట. బహుశా మనకి కాలం కలిసి వచ్చి, అన్ని విధాలా సహాయసహకారాలు అందాయనుకుంటా"

"అలాగా! అయితే ఇంకేం మనకి తప్పకుండా నడిచివచ్చే పిల్లలు పుట్టేస్తారన మాట. పోనీలే పుట్టగానే వాడిని షికారు తీసికెళ్ళచ్చు" అన్నాడు మురిపెంగా.

అనూష నవ్వేసింది. ఆరోజు వాళ్ళకి కంచాలు గుర్తురాలేదు, మంచం తప్ప.

★ ★ ★

అనూష కొత్తకాపురం రసవత్తరంగా సాగుతోంది. వీణ మధ్య మధ్య వచ్చి చూసి వెళుతోంది.

ఓరోజు అంది అనూష, "పెళ్ళి అయిన దగ్గర్నించీ ఆశ్రమానికి వెళ్ళడంలేదు. వాళ్ళంతా ఎలా ఉన్నారో! ఓసారి వెళ్ళొద్దామా? "

వీణ గట్టిగా చెప్పింది. "కొంతకాలం ఆశ్రమం పనులు వదిలెయ్... హాస్పిటల్‌కి కేటాయించే సమయం తగ్గించి, భరణికి కేటాయించు... ఇంతకాలంనుంచీ కోల్పోయిన జీవనమాధుర్యం పూర్తిగా, సంపూర్తిగా అనుభవించు"

వీణ మాటలకి నవ్వింది అనూష "గీతాబోధనలా ఉంది"

"అలాగే అనుకో... అనూ! దాంపత్య జీవితం అమృతంలాంటిది. సాగరమథనంలా, జీవన సాగర మథనం జరిగింతరువాత పొందే అనుభవం. కాబట్టి జాగ్రత్తగా, అపురూపంగా కాపాడుకో. నా అనుభవంతో చెబుతున్నాను. నిజం చెప్పు. ఇదివరకన్నా




ఇప్పుడు నీ వృత్తిలో నీకు ఆసక్తి, ఉత్సాహం పెరగలేదూ!" సూటిగా అడిగింది.

అనూష క్కూడా అనిపించింది. నిజమే! ఎన్నడూ లేని కొత్త ఉత్సాహం, చలాకీతనం పెరిగింది తనలో. కానీ వీణ దగ్గర ఒప్పుకోడానికి సిగ్గు అడ్డం వచ్చింది. నవ్వి ఊరుకుంది. ఆ నవ్వు అర్థమైన వీణ తృప్తిగా నిట్టూర్చింది.

అయితే అనూష మనసులో మాట తెలుసుకున్నట్టుగా ఓరోజు ఉదయాన్నే శ్యామల ఫోన్‌చేసింది. అనూషని ఓసారి ఆశ్రమానికి రావలసిందిగా కోరింది.

శ్యామలచేత అడిగించుకోవాల్సి వచ్చినందుకు అనూషకి సిగ్గనిపించింది. ఛీ, నేనింత బాధ్యతారహితంగా ప్రవర్తించానేంటి? అని మనసులో అనుకుంది.

ఆ రోజు హాస్పిటల్ నుంచి పెందలాడే బయలుదేరి నేరుగా ఆశ్రమానికి వెళ్లింది. ఆమెని చూస్తూనే అందరూ ఎంతో సంతోషంగా ఆహ్వానించారు. తనకి పరిచయం అయిన దగ్గర్నుంచీ కేవలం మెడలో సన్నటి గొలుసు, కుడిచేతికి ఒక వెడల్పాటిగాజు, ఎడం చేతికి వాచీ, కాటన్ చీరల్లో హుందాగా కనిపించిన అనూష ఇవాళ కొత్తగా ఉంది. బంగారు గొలుసుకి వేళ్లాడుతున్న మంగళసూత్రాలు, నల్లపూసల గొలుసు, గద్వాల్ చీర అందంగా ఉంది. రహస్యంగా అడిగింది శ్యామల "విశేషమా? "

"ఛీ.." ఎర్రగా కందిపోయిన చెంప చేతులమధ్య దాచుకుని "ఇది పిల్లల్ని కనే వయసా? " అంది.

"ఏం ఫర్వాలేదు. కనచ్చు నీకంటూ పాపో, బాబో ఉండాలి"

"వీడున్నాడుగా" బాబునెత్తుకుని వచ్చిన నీరజ చేతుల్లో బాబునందుకుంటూ అంది.

సుశీల కొడుకు వచ్చి అనూష కాళ్లకి నమస్కరించాడు.

"ఏంట్రా ఏంటి సంగతి? " అడిగింది.

"నేను టెంత్ పాసయానమ్మా. ఫస్ట్‌క్లాస్ వచ్చింది"

"అలాగా! శభాష్" వాడిని దగ్గరకు తీసుకుంది. నీ కష్టాల పర్వం పోయింది సుశీలా. నీ కొడుకు చేతికందివస్తే అంతా సుఖమే" అంది సుశీలతో.

"అంతా మీ దయే మేడమ్!" వినయంగా అంది సుశీల.

శారద అందంగా అల్లిన జాజిపూలమాల తెచ్చిచ్చింది. జడలో తురుముకుంటూ "ఇంకా ఏంటి విశేషాలు? " అడిగింది అనూష.

"ఏంలేదు. మనవాళ్లు నిన్నిదివరకు ఏదో మిషన్ కావాలని అడిగారుకదా! అదోసారి గుర్తుచేద్దామని. తరవాత ఈమధ్య ఎవరో నలుగురు ఆడవాళ్లు వచ్చి ఆశ్రమంలో చేరతామన్నారు. నీతో మాట్లాడమని అడ్రస్ ఇచ్చాను వచ్చారా? "

"లేదే! ఎవరూ రాలేదు"

"రాలేదా? " శ్యామల సాలోచనగా అంది. "నాకెందుకో వాళ్లని చూస్తే అనుమానం వచ్చింది. ఎందుకైనా మంచిది. మన ఆశ్రమానికి పోలీస్ ప్రొటక్షన్ కావాలని అడుగుదాం"

"ఏం? ఏమన్నా ప్రాబ్లెమా? "

"ఈమధ్య ఒకటీ, రెండుసార్లు ఎవరో కాంపౌండ్‌వాల్ దూకి తలుపుకొట్టారు. చూసేలోపల పారిపోయారు. ఏదో ఇలా ఒకటీ, అరా చిన్నచిన్న సంఘటనలు. పెద్దవి కాకముందే జాగ్రత్తపడితే నయం కదా!"

అనూషకి చాలా బాధనిపించింది. తను కొత్తకాపురం మోజులో వీళ్ల సంగతి పట్టించుకోలేదు. తన ఆనందాన్ని భంగం చేయడం ఇష్టంలేక వీళ్లు కూడా డిస్టర్బ్ చేయలేదు. పాపం! ఎన్ని ఇబ్బందులు పడ్డారో! పైగా ఎప్పుడనగా వాళ్లకి మిషన్ల గురించి ప్రామిస్ చేసింది. వెంటనే ఈ పనులు చూడాలి. దృఢంగా నిశ్చయించు

కుంది.

"సారీ శ్యామా! మిమ్మల్నందరినీ చాలా నిర్లక్ష్యం చేశాను నా సంతోషం కోసం. రేపే వెళ్లి మినిస్టర్‌గారిని కలుస్తాను. వెంటనే పోలీస్ ప్రొటక్షన్ గురించి కూడా మాట్లాడతాను"

"నువ్వు మాకు సారీ చెప్పడం ఏంటి? ఇంతకాలం నుంచీ మా సంతోషం కోసం, మా సుఖం కోసం, నీ జీవితంలో ఎంతో త్యాగం చేశావు. అదంతా మర్చిపోతామా? నిన్ను డిస్టర్బ్ చేయద్దనుకున్నాగానీ మినిష్టర్ల దగ్గరికి నేను వెళ్లలేనుగా. నన్నెవరు రానిస్తారు? "

"శ్యామా!" విచలితంగా పిలిచింది.

ఇద్దరిమధ్యా కాస్సేపు మాటలు కరువయాయి. పరస్పరావగాహనతో కలిసిన రెండు మనసులమధ్య ఆనందం హద్దులు దాటితే ఆ అనుభూతి వ్యక్తం చేయడానికి భాష కరువవుతుంది. భాష్పాలే అక్షరాలై ఒకరినొకరు పలకరించుకుంటారు. ప్రస్తుతం వాళ్లిద్దరి విషయంలో అదే జరిగింది.

వాళ్లందరికీ మళ్లీ వస్తానని చెప్పి సెలవు తీసుకుని బయలుదేరింది.

ఆమె ఇల్లు చేరేటప్పటికి పదకొండు దాటింది. భరణి సోఫాలో కూర్చుని ఉన్నాడు. ఆమె కారు పార్క్ చేసి రాగానే అడిగాడు "ఎక్కడికెళ్లావు అనూషా? ఇంత లేటైందేం!"

అనూష అతడివైపు చూసింది. ఆ మొహంలో ఆందోళనకన్నా ఒక విధమైన సీరియస్‌నెస్ కనిపిస్తోంది. "ఆశ్రమానికి వెళ్లాను. లేటైంది. భోంచేశావా? "

"లేదింకా. ఎందుకెళ్లావు ఆశ్రమానికి? "

జీవితంలో మొదటిసారిగా తను చేసిన పనిని ఎందుకు చేశావు? అని ఒకరు ప్రశ్నించడం ఆమెకి చాలా అవమానంగా అనిపించింది. తను సర్వస్వతంత్రురాలు. తనేం చేసినా ఎవరూ కూడా ఇలా ఎందుకు చేశావు? అని ఇంతవరకూ ప్రశ్నించలేదు. ఇవాళ భరణి అలా అడగడంతో కొంచెం చిరాకొచ్చింది. ఎవరిచ్చారితనికి ఈ అధికారం? అనిపించింది. తనని తను కంట్రోల్ చేసుకుంటూ అంది "నేను పెళ్లి అయిందగ్గర్నించి వెళ్లడంలేదు. ఉదయం శ్యామల ఫోన్ చేసింది. ఒక్కసారి వచ్చి వెళ్లమంది. హాస్పిటల్ నుంచి అటే వెళ్లాను"

"శ్యామల ఎక్కడికి ఫోన్ చేసింది? "

"ఇంటికే"

"మరి నాకు చెప్పలేదేం"

"ఏమని? "

"శ్యామల ఫోన్ చేసింది. ఆశ్రమానికి రమ్మంది అని చెప్పచ్చుగా. కనీసం వెళ్తాను అనైనా చెప్పలేదు. నేను చాలా ఖంగారు పడ్డాను"

అనూష అతడి మొహంలోకి నిశితంగా చూసింది. చెప్పకుండా వెళ్లి టెన్షన్ పెట్టాననా? లేక తనకివ్వాల్సిన మర్యాద ఇవ్వలేదని కోపమా? భావాల కోసం వెదుకుతూ నెమ్మదిగా అంది. "సారీ నేనెప్పుడూ ఏదీ ఎవరికీ చెప్పలేదు. చెప్పాల్సిన అవసరమూ రాలేదు. ఈసారి చెప్పి వెళతాను"

"అయినా ఎందుకు అస్తమానం ఆ ఆశ్రమానికి నువ్వు వెళ్లడం. ఇంతకాలమంటే నీకు వేరే పర్సనల్ లైఫ్ లేదు కాబట్టి వెళ్లావు. ఇంకా ఎందుకు? "

అనూష సీరియస్‌గా చూసింది. "ఆశ్రమం నాది. నేను ఫౌండర్ సెక్రెటరీని. నేనెళ్లి మంచీచెడ్డా చూడకపోతే ఎవరు చూస్తారు? ఇటీజ్ ఎ పార్ట్ ఆఫ్ మై డ్యూటీ. నేను స్నానం చేసివస్తాను. భోంచేద్దాం" మరోమాటకి అవకాశం ఇవ్వకుండా లోపలికెళ్లిపోయింది.

భరణి అహం దెబ్బతింది. ఇంతకాలం నుంచీ తను సర్వస్వతంత్రురాలు కాబట్టి ఏ సమయంలో ఎక్కడికెళ్లినా చెల్లేది. ఇప్పుడు భర్త అనేవాడు ఒకడున్నాడని ఈమెకి ధ్యాసలేనట్టుందే. భర్త చెప్పడం అనుమతి

కోరడం నామోషీగా భావిస్తోందా? అలా అయితే ఈమె అహాన్ని తనెలా భరించగ లడు? ఆలోచనల్లో మునిగిపోయిన భరణి అనూష పిలుపుతో లోపలికెళ్లాడు.

★ ★ ★

మర్నాడే అనూష ఫండ్స్‌కోసం లెటర్ రాసుకుని తీసుకుని మినిస్టర్‌గారిని కలవడా నికి వెళ్లింది. ఆమె కలెక్టర్‌ని కలవదల్చుకో లేదు. అంతగా అతడిని కలవాల్సిన అవ సరం వస్తే ఇంకెవరినైనా పంపించచ్చు అనుకుని డైరెక్టుగా మినిస్టర్‌గారి దగ్గరికే బయలుదేరింది.

అదృష్టవశాత్తూ మినిస్టరుగారు మంచి మూడ్‌లో ఉన్నారేమో లేక అనూష పేరు అడపాదడపా పేపర్లద్వారా తెలుసుకుని ఉండడంచేతనో మొత్తానికి కారణం ఏదైనా వెంటనే ఆమెకి అపాయింట్‌మెంటు ఇచ్చారు. ఆశ్రమం గురించి అంతా వివ రించి లెటర్ ఇచ్చింది. ఆయన ఎక్కువ తాత్సారం చేయకుండా ఆమె కోరిన మొత్తం మంజూరు చేశారు. అంతేకాక తన ఆరోగ్య సమస్యలు ఆమెతో చర్చించాడు. అనూష అప్పటికప్పుడే పరీక్ష చేసి ప్రిస్క్రిప్షన్ రాసి చ్చింది. ఓసారి తప్పనిసరిగా కొన్ని మెడి కల్ చెకప్స్ అవసరం అనీ హాస్పిటల్‌కి వస్తే ఏర్పాటు చేస్తాననీ చెప్పింది. ఆయన చాలా ఆప్యాయంగా మాట్లాడాడు. సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్స్ గురించి మాట్లాడి "మీలాంటి గొప్ప డాక్టర్లు ఉస్మానియాలో ఉన్నప్పుడు ఇంక సూపర్ స్పెషాలిటీ ఎందు కమ్మా" అన్నాడు.

చిరునవ్వుతో సెలవు తీసుకుని వచ్చే సింది.

కలెక్టర్‌ని కలవాల్సిన అవసరం కలగనం దుకు సంతోషపడుతూ బైటకి వచ్చింది. మిగతా ఫార్మాలిటీస్ పూర్తిచేసి ఇంటికి బయలుదేరింది.

రోజూకన్నా హుషారుగా వచ్చిన ఆమెని చూసి అడిగాడు భరణి.

"ఏంటి చాలా సంతోషంగా ఉన్నావు?"

అనూష తను సాధించిన విజయం గురించి చెప్పింది.

"ఎంత శాంక్షన్ చేశారు?" అడిగాడు ఆశ్చర్యంగా.

"ఐదు లక్షలు"

"మైగాడ్! ఐదు లక్షలా?" నిర్ఘాంతపో యాడు. ఒక ఆశ్రమంకోసం ఉన్నపళంగా మినిస్టరుని కలిసి ఐదు లక్షలు సంపాదిం చిన అనూష తన పత్రికకి ఎందుకు సాయం చేయకూడదు అనిపించింది.

"నీకు మినిస్టర్స్ దగ్గర ఇంత పలుకుబడి ఉందని నాకు తెలియదు" అన్నాడు.

"నాకు మాత్రం ఏం తెలుసు? ఇదే మొదటిసారి నేనాయనని కలవడం? చాలా గౌరవం ఇచ్చారు. నాకే ఆశ్చర్యం వేసింది"

"అదేంటి? ఇంతకుముందు పరిచయం లేదా?"

"ఎందుకుంటుంది?" ఆశ్చర్యంగా చూసింది.

"మరెలా వెళ్లావు?"

"ఏం ఉంది భరణీ! నేనొక పనిమీద మినిస్టరుని కలిశాను. డాక్టర్ అనూషగా వెళ్లలేదు. ఆశ్రమం నిర్వాహకురాలిగా వెళ్లాను. మేము చేస్తుంది సత్కార్యం కాబట్టి సంతోషించారు. అడిగిన ఫండ్స్ మంజూరు చేశారు"

"మైగాడ్! నీకు చాలా ధైర్యం. ఈ ధైర్యం తోటే మా పత్రికక్కూడా ఏదన్నా సాయం చేయచ్చుగా"

"చేశాగా నాకు చేతనైంది"

"అదెంత? లక్ష రూపాయలు. సరిపోవు. చాలా డబ్బుకావాలి అనూ! ముందు రెగ్యు లర్‌గా పత్రిక వస్తే తరవాత డైలీ చేస్తాను. ఎప్పటికైనా డైలీ పేపర్ చేయాలని నా కోరిక. ఎంత డబ్బు కావాలో తెలుసా?"

"నువ్వే వెళ్లి కలవచ్చుగా మినిస్టరుని"

"నీ అంత ధైర్యం తెగింపు నాకు లేవు.

అందుకే ఇలా వెనకబడి ఉన్నాను. అది సరే ఈ డబ్బు ఏం చేస్తావు? " అడిగాడు ఆరాగా.

"ఏం చేయడంఏంటి? బోలెడు చేయాలి. కొత్త రకం సూయింగ్ మిషన్స్ వచ్చాయిట. అవి నాలుగు కొనాలి. వాళ్ల భోజనాలక్కా వాలి. ఇంకా చాలా చేయాలి"

"అన్నట్టు వీణగారు ఫోన్ చేశారు. రేపు ఉదయం రైలుకి ఢిల్లీ వెళ్తున్నారుట. నిన్ను ఫోన్ చేయమన్నారు"

"అలాగా! అయ్యో... ముందు చెబితే ఆ పని చేశాకే నీతో మాట్లాడేదాన్ని" ఖంగారుగా అంది. వీణ టూరు ప్రోగ్రాం రేపట్నించే మొదలన్నమాట. ఫోన్ చేయాలి. లేవబోతుంటే అడిగాడు. "వీణగారు కూడా ఉండడంలేదుకదా! ఒక్కదానివీ ఎంతని చేస్తావు? నీకేదన్నాసాయం కావాలంటే చెప్పు"

అనూష కృతజ్ఞతగా చూసింది. పాపం మంచివాడే తనే అపార్థం చేసుకుంటోంది. అందర్నీ అనుమానించడం అలవాటైంది. "థాంక్స్ భరణీ! రేపోసారి సెక్రెటేరియట్ కి వెళ్లి చెక్కుకోసం కొంచెం ఫాలో అప్ చేయాలి" అంది.

"ష్యూర్... తప్పకుండా. ఇంకా? "

"చెక్ వచ్చాక కొన్ని మిషన్స్ ఆర్డర్ ఇవ్వాలి"

"అలాగే, ఇంకా"

"ప్రస్తుతం ఇవి చాలు. తరువాత మళ్లీ చెప్తా" అంటూ ఫోన్ దగ్గరకి నడిచి వీణ నెంబరు తిప్పింది.

"హలో వీణా! ఏంటి రేపేనా నీ ప్రయాణం? " అడిగింది.

అవతల నుంచి వీణ స్వరం వినిపించింది. "అవునురా. ఎక్కడికెళ్లావు? హాస్పిటల్ కి వెళ్లలేదుటగా"

"అవును" జరిగిన సంగతి వివరించింది అనూష.

"గుడ్ గుడ్ లక్. మరి నేను వెళ్తున్నా. సారీ కలవలేకపోతున్నా"

అనూషకి ఎలాగో అనిపించింది "హాపీ జర్నీ వీణా" అంది బరువుగా.

"అబ్బా అంత బాధగా చెప్పకు. కొంచెం ఉత్సాహంగా చెప్పు" వీణ నవ్వుతూ అంది.

"ఏంటో నాకు చాలా దిగులుగా ఉంది. ఏంటసలు? ఈ టూర్ ప్రోగ్రాం ఏంటి? ముసలాళ్లలాగా"

"ముసలాళ్లం అయితే అసలు కదల్లేం. ఏం ఫర్వాలేదు. లెటర్స్ రాస్తుంటాను. వీలైతే మెయిల్ ఇవ్వు ఎక్కడో అక్కడ చూసుకుంటాను"

"అలాగే"

"బై అనూ!"

"బై..." భారమైన మనసుతో వీడ్కోలు చెప్పింది. ఆవేళ అనూషకి అన్నం సయించలేదు. వీణ గురించి ఆలోచిస్తూ హాల్లోనే ఒంటరిగా పడుకుని ఉండిపోయింది. భరణి కాస్సేపు చూసి ఆమె రాకపోడంతో డిస్టర్బ్ చేయకుండా నిద్రపోయాడు.

ఆరోజు భరణి ప్రెస్సుకి వెళ్లలేదు. చాలా రోజుల్నించీ సరిగా వెళ్లడంలేదు. పెళ్లి అయాక ఒకే ఒక ఇష్యూ వచ్చింది పత్రిక. అయితే ఎప్పటికన్నా ఎక్కువ కాపీలు అమ్ముడుపోయింది కానీ బొత్తిగా అడ్వర్ టైజ్ మెంట్లు రాలేదు. వీణ ఇచ్చిన విజిటింగ్ కార్డ్లు పట్టుకుని ఇద్దరు కాంట్రాక్టర్లను కలిసాడు. వాళ్లకి సంబంధించిన ఏ అడ్వర్ టైజ్ మెంట్ అయినా తప్పకుండా ఇస్తామని ప్రామిస్ చేశారు. మళ్లీ వెళ్లలేదు, కలవలేదు.

ఈసారి బై మంత్లీ అయినా వస్తుందో లేదో అని దిగులుగా ఉంది. సర్క్యులేషన్ ఈమధ్య కొంచెం పెరిగింది. కానీ పత్రిక నిలబడాలంటే కేవలం సర్క్యులేషన్ సరిపోదు. అడ్వర్ టైజమెంట్లు కావాలి. భరణికి అంతగా పలుకుబడిలేదు. కొందరు పెద్ద వాళ్లు తెలిసినా వాళ్ల సర్వీసు ఉపయోగించుకోవడం తెలియదు అతనికి. మోహ





మాటం, బిడియం ఉన్నా కొంచెం అహం కూడా ఉంది. నేను వెళ్లివాళ్లని అడగడం ఏంటి నాన్సెన్స్! అనుకుంటాడు. పైగా కొందరు ఉద్యోగస్తులు వేరే మంచి ఉద్యోగాలు చూసుకుని వెళ్లిపోయారు. ఇద్దరో ముగ్గురో మిగిలారు. మ్యాన్‌పవర్ లేకుండా ఏం చేయగలడు? మంచి జీతాలిస్తే ఉంటారు. లేకపోతే వెళ్లిపోతారు. తనిచ్చే వేయి, రెండువేలకి ఎవరు మాత్రం ఎంత కాలం చేస్తారు? జీతాలు పెంచాలి. అద్దెకట్టాలి. పేపర్ ధర పెరిగిపోయింది. ఎలా? ఈ పరిస్థితి ఎదుర్కోవడం?

అనూషతో పత్రిక గురించి డిస్కస్ చేయాలి. అనుకున్నాడు. ముందు దీన్ని రెగ్యులర్‌గా మంత్లీ చేయాలి. ఆ తరవాత వీక్లీ. అంచెలంచెలుగా ఎదగాలి. తన ఎదుగుదలకి అనూష సహాయసహకారాలు చాలా అవసరం. ఇవాళ రాత్రికి ఎలాగైనా అనూషతో మాట్లాడాలి అనుకున్నాడు.

అయితే అతనాశించినట్టు ఆరోజేకాదు వారం రోజులదాకా అనూషతో మాట్లాడడం కుదరలేదు. ఆమె చాలా బిజీగా ఉంటోంది. రాత్రి పదకొండు దాటుతోంది ఇంటికి వచ్చేటప్పటికి. పేపర్ వర్క్ లేకపోవడంతో భరణి ఇంట్లోనే ఉంటున్నాడు. అనూష అలా పొద్దుపోయాక రావడం అతనికంతగా రుచించలేదు.

అతని పత్రికలో మహిళలకోసం ప్రత్యేకించిన ఓ పేజీలో రాసే ఆడవాళ్లంతా స్త్రీకి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు లేవని పురుషుడితో స్త్రీకి సమానహక్కులు కావాలని, మగవాళ్లు అనేక రకాల బంధాలతో స్త్రీ చైతన్యాన్ని అణిచేస్తున్నారని పగలే ఆడపిల్లలు బైట వంటరిగా తిరగలేని స్థితిలో ఉన్నారని రాయడం తెలుసు అతనికి. కానీ ఇదేంటి? అనూష జీవితం అందుకు విరుద్ధంగా ఉంది. రాత్రి పదకొండుదాటాక వంటరిగా వస్తోంది ఈమె. ఇదెలా సాధ్యం? మిగతా వారికి లేని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఈవిడకి ఎక్కడినుంచి వచ్చాయి? అనిపిస్తోంది.

భరణి జర్నలిజం మీద ఆసక్తితో ఆ కోర్సు చదువుకుని ఓ చిన్న పత్రిక నడిపిస్తున్నాడు కానీ నిజానికి అతని పరిధి చాలా చిన్నది. పుస్తక పరిజ్ఞానం తప్ప లోక జ్ఞానం తక్కువే. ముఖ్యంగా ఆడవారి గురించి చాలా తక్కువ విషయాలు తెలుసు అతనికి.

అతని జీవితంలో అతనికి సన్నిహితంగా వచ్చిన స్త్రీలు చాలా తక్కువ. కాలేజీరోజుల్లో ప్రేమాయణం తరవాత దాదాపు అమ్మాయిలతో స్నేహాలు మానేశాడు. అమ్మాయిలతో స్నేహం చేయాలని కలిసి తిరగాలని కూడా అతనికి ఎప్పుడూ అనిపించలేదు. అతని ఆశయం, అతని లక్ష్యం ఒక్కటే. తన చేతులమీదుగా ఓ డైలీ పేపరు తీసుకురావాలి. మంచి జర్నలిస్టు అనిపించుకోవాలి. అందుకోసం అతను కృషి చేస్తున్నాడు. అయితే జర్నలిస్టుగా తన పరిధి పెంచుకోవాలన్న ధ్యాసలేదు. అందుకే అనూష అలా రాత్రిళ్లు పొద్దుపోయాక రావడం జీర్ణించుకోలేకపోయాడు. కొన్ని రోజులు భరించగలిగినా అతనిలో రానురాను అసహనం పెరిగిపోసాగింది. పైగా ఆమెతో కలిసి ఎటన్నా వెళ్లాలని సరదాగా గడపాలనే కోరిక తీరడం లేదు. ఆమె అనుక్షణం బిజీబిజీ. ఆ బిజీని తట్టుకోలేకపోతున్నాడు భరణి.

ఆరోజు రోజూలాగానే పదకొండున్నర అయింది. అనూష కారు బైట ఆగింది. భరణి అప్పటికి భోజనం చేసి సోఫాలో పడుకుని టీవీ చూస్తున్నాడు. అనూష లోపలికి వస్తూనే "హాయ్ భరణీ! భోంచేశావా? " అడిగింది.

"చేశాను" ముభావంగా సమాధానం చెప్పాడు టీవీ మీద నుంచి చూపు మరల్చకుండా. అనూష అతని మూడ్ పట్టించుకోలేదు. లోపలికి వెళ్లిపోయింది.

ఆమె స్నానం చేసి నైటీ వేసుకుని

ప్లేటులో చపాతీ కూరా పెట్టుకుని భరణి దగ్గరకి వచ్చింది. భరణి డిస్కవరి ఛానెల్ చూస్తున్నాడు.

"నీకీ ఛానెల్ అంటే చాలా ఇష్టంలా ఉందే" అతని పక్కన కూర్చుని చపాతీ ముక్క తుంచుకుని కూరతో తింటూ అడిగింది.

"టైమెంత తెలుసా? " అడిగాడు.

"పన్నెండు అవుతోందేమో!"

"ఏంటి అనూషా! ఇంతరాత్రివేళ ఒక్కదానివీ ఇలా రావడం ఏంటి? ఏదన్నా జరిగితే" అన్నాడు.

"ఏం జరుగుతుంది? నాకేం జరగదు. చిన్నపిల్లనా? అయినా నాకిది అలవాటే"

"ఏంటి అలవాటు? ఇంత రాత్రివేళ వస్తోంటే ఏం బాగుంటుంది? "

"ఎవరికి? " చిత్రంగా చూసింది.

తడబాటుగా అన్నాడు. "ఎవరికైనా. వేరే వాళ్ల సంగతలా ఉంచి నీకు మాత్రం భద్రత ఏది? " నవ్వింది.

"నాకు భద్రత ఏంటీ? నేనే పదిమందికి రక్షణ ఇస్తున్నాను"

భరణికి ఆ మాటతో ఏం మాట్లాడాలో తోచలేదు. కొన్ని క్షణాలాగి అన్నాడు. "అయినా అసలు డాక్టరువైతే అయావు. ఏ గైనికో చదివితే సరిపోయేది మగవాళ్లు చదవాల్సిన కార్డియాలజీ నువ్వు చదివావేంటి? "

అనూష విస్మయంగా చూసింది. ఫకాల్న నవ్వేసి "ఈ జబ్బు నీక్కూడా ఉందా? " అంది.

"జబ్బా? జబ్బేంటి? "

"అదే ఆడవాళ్లు అనగానే కొన్ని వృత్తులు, కొన్ని చదువులు కేటాయించేవాళ్లు. ఆడవాళ్లు చదువులకోసం గడపదాటిన కొత్తల్లో టీచర్లుగా, నర్సులుగా, టెలిఫోన్ ఆపరేటర్లుగా, టైపిస్టులు, స్టెనోలు ఇలాంటి వృత్తులు, చదువులైతే డొమెస్టిక్ సైన్సు, బ్యాచిలర్ ఆఫ్ ఆర్ట్సు ఇలా కొన్ని చదువులు. అందుకనే కార్డియాలజిస్టులు ఆడవారిలో తక్కువగా ఉన్నారు. ఏం? ఎందుకు? మగవాళ్లలో గైనకాలజిస్టులు లేరా? ఆడవాళ్లు కార్డియాలజిస్టులు ఎందుకు కాకూడదు? "

"కాకూడదని నేను అనడంలేదు. కాని గైనిక్ అయితే ఇంత రాత్రిదాకా ఉండనవసరంలేదుకదా!"

"ఎవరన్నారలా? ఇంకా ఎక్కువ టైం స్పేర్ చేయాల్సి ఉంటుంది. బాధ్యత కూడా ఎక్కువే. ఏ అర్ధరాత్రో తొమ్మిదో నెల నిండిన అమ్మాయికి పెయిన్స్ స్టార్ట్ అయితే అప్పుడే తలుపులు కొడతారు. పిచ్చి భరణీ పిచ్చి ఆలోచనలు మానెయ్ నీకేం కావాలో చెప్పు"

"నీతో కలిసి కొన్ని రోజులు ఎటన్నా తిరిగిరావాలని ఉంది"

"అంతేకదా! వెడదాం. ఎప్పుడు వెడదామో చెప్పు లీవు పెడతాను. సరేనా? ఈ లోగా సెక్రటేరియట్‌లో చెక్ కలెక్ట్ చేసుకుని మిషన్స్ కొని ఆశ్రమానికి పంపించాలి"

"ఓకే! నేనాపని చూస్తాను. నువ్వు వచ్చే వారం నుంచీ పది రోజులు లీవు పెట్టు"

"సరే! ఇంక ఆ టీవీ కట్టేస్తే బాగుంటుందనుకుంటా" చేతులు కడుక్కోడానికి లోపలికెడుతూ అంది.

"నువ్వు ఎదురుగా ఉంటే టీవీ ఎందుకు? " భరణి కూడా లేచి టీవీ ఆఫ్ చేసి ఆమె వెనకే వెళ్లాడు.

★ ★ ★

భరణి రోజూ చెక్కుకోసం ఏదో ఒక టైంలో వెళ్తూనే ఉన్నాడు. రోజూ తిప్పిస్తున్నారు. రేపురా మాపురా అంటూ. అయితే అలా తిరగడంలో పూర్తిగా అనూషకి సాయం చేయాలని కాదు, ఆశ్రమం మీద మమతతోకాదు. అతని స్వార్థం కూడా కొంత ఉంది. అందుకే ఓపిగ్గా తిరుగుతున్నాడు.

"విసుగొస్తోంది అనూ! వాళ్ల చుట్టూ తిరిగి" అన్నాడు అనూషతో

"దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వ నట్టుగా ఉంది. బాగా లంచాలు మరిగారు వెధవలు. ఎవరికీ ఒక్క పైసా కూడా ఇవ్వద్దు భరణీ! ఎలా రాదో చూస్తాను. మళ్లీ ఓసారి మినిస్టరుగారిని కలుస్తాను వీలు చూసుకుని" అంది అనూష.

"అయితే అప్పుడే నా పత్రిక గురించి కూడా మాట్లాడు" అన్నాడు.

"పత్రిక గురించా? " నవ్వింది "అలాగేలే"

అలాగేలే అన్న తీరుకి భరణికి కోపం వచ్చింది. తన పత్రిక అంటే బాగా చులక నైపోయింది అనూషకి. ఏంటీ ఈవిడ ఉద్దేశం? తనేపనీ లేకుండా కూర్చుంటే పర్స నల్ అసిస్టెంట్‌లా వాడుకోవాలనుకుం టోందా?

మర్నాడు ఉదయం ఐదున్నరకే ఆశ్రమం నుంచి ఫోన్ వచ్చింది. ఫోన్ మోగగానే టక్కున లేస్తుంది అనూష ఎంత నిద్రలో ఉన్నా. ఆమె రిసీవర్ తీసుకోగానే సుశీల స్వరం వినిపించింది. "మేడమ్! శ్యామల క్కకి గుండెల్లో నొప్పిగా ఉందిట. విలవిల్లా డుతోంది" ఏడుస్తూ చెప్పింది.

అనూష చివుక్కున లేచి కూర్చుంది. మరోమాట మాట్లాడకుండా "నేను వస్తు న్నాను" అంటూ ఫోన్ పెట్టేసింది. భరణిని లేపి "త్వరగా రెడీ అవు భరణీ! ఆశ్రమానికి వెడదాం" అంది.

"ఎందుకు? " బద్ధకంగా అడిగాడు.

"శ్యామలకి హార్ట్‌ఎటాక్ వచ్చిందిట. సుశీల ఫోన్ చేసింది. మనం త్వరగా వెళ్లాలి... లే"

"శ్యామల ఎవరు? " అతనడిగిన ప్రశ్న వినిపించలేదు. గబగబా నైటీలోంచి చీర లోకి వచ్చింది.

అప్పటికీ భరణి లేవలేదు. నిద్రపోతూనే ఉన్నాడు.

"భరణీ! తరవాత నిద్రపోవచ్చు లే ప్లీజ్" మరోసారి లేపింది.

మంచి నిద్రనుంచిలేపినందుకు చిరాగ్గా అన్నాడు. "అబ్బ ఏంటి అనూ! ఎవరికో హార్ట్ ఎటాక్ వస్తే వెళ్లడం ఏంటి? పైగా అంత దూరం. దగ్గర్లో హాస్పిటల్స్‌లేవా? తీసికెళ్లమని ఫోన్ చేయి"

అనూషకి కోపం వచ్చింది. అయితే అత నితో వాదనేసుకునే సమయం కాదది. అందుకే మారుమాట్లాడకుండా తను హడా విడిగా కారు తీసుకుని వెళ్లిపోయింది.

ఆమె వెళ్లేటప్పటికి నీరజ, సుశీలా మిగతా వాళ్ళు శ్యామల చుట్టూ కూర్చుని ఉన్నారు. శ్యామల బాధతో ఉంగలు చుట్టుకుపో తోంది. అనూష ముందు అందర్నీ దూరం జరగమని ఫ్యాను స్పీడు పెంచింది. గాలి తగిలేలా కిటికీ తలుపులన్నీ తెరిచింది. శ్యామల నాలుకకింద సార్‌బిట్రేట్ టాబ్లెట్ పెట్టి, ప్రాథమిక చికిత్స ప్రారంభించింది.

అరగంట తరవాత శ్యామల కొద్దిగా కోలు కుంది. సుశీలసాయంతో ఆమెని కారులో కూర్చోబెట్టుకుని, హాస్పిటల్‌వైపు పోని చ్చింది.

అనూషకి మణి గుర్తొచ్చింది. ఎంతో ఆప్యాయంగా తన భవిష్యత్తు గురించి మాట్లాడడానికి వచ్చిన మణి, తన చేతుల్లో గుండెనొప్పితో మరణించింది. ఆమె మరణం తనకి జీవనసారాన్ని, జీవనవేద నని తెలియచేసింది. ఆమె మరణం తనకి జీవితంపట్ల తెలియని మరెన్నో వాస్తవా లను తెలియచేసింది. ఎన్నో క్రిటికల్ కేసులు కూడా విజయవంతంగా సాధించిన తను మణిని బతికించలేకపోయింది. భగ వంతుడా! శ్యామల విషయంలో నాకలాంటి ఓటమిని చవిచూపించకు. మౌనంగా, స్పీడుగా కారు పోనిస్తున్న అనూషతో మాట్లాడే ధైర్యంలేని నీరజా, సుశీలా శ్యామ లమీద చేయి వేసి కూర్చున్నారు.

కారు హాస్పిటల్ సమీపించింది. మిగతా ఏర్పాట్లన్నీ చకచకా పూర్తయాయి. ఆ హాస్పిటల్ అనూష సామ్రాజ్యం. ఆ సామ్రాజ్యంలో అడుగుపెట్టాక ఆమెకి



ఎంతో నిశ్చింత కలుగుతుంది. అదే నిశ్చింతతో శ్యామలకి ట్రీట్‌మెంట్ స్టార్ట్‌చేసింది. ఆ రోజంతా మరో విషయం ఆలోచించకుండా హాస్పిటల్లో శ్యామల దగ్గరే గడిపింది.

ఉదయం వెళ్ళిన అనూష రాత్రి పన్నెండైనా ఇంటికి రాకపోడంతో భరణి హాస్పిటల్‌కి ఫోన్‌చేశాడు. చాలాసేపు రింగైంది. కానీ ఎవరూ తీయలేదు. వీణ ఊళ్లో లేదు. ఎక్కడికి వెళ్ళి ఉంటుంది? బహుశా ఆశ్రమంలోనే ఉన్నట్టుంది. ఆశ్రమం నెంబరు కలిపాడు. అయిలయ్య మాట్లాడాడు.

భరణి స్వరం వినగానే ఎంతో గౌరవం ఉట్టిపడే స్వరంతో... "పెద్దమ్మగారికి గుండెనొప్పి వస్తే, ఆస్పత్రికి తీసికెళ్ళారయ్యా. ఇంకా రాలేదు" అన్నాడు.

భరణికి చాలా కోపం వచ్చింది. ఇంటిదగ్గర మొగుడు అనేవాడు చచ్చాడన్న సంగతి కూడా గుర్తు రాలేదా అనూషకి. ఇలా ఎంతకాలం ప్రజాసేవ చేస్తుంది? ఎంతకాలం తనీపద్ధతి సహించాలి? అసలీ ఆశ్రమాన్ని మూసేస్తేగానీ సుఖంలేదు. ఎక్కడినుంచి తెచ్చిపెట్టుకుందో ఈ జనాన్ని.

ఆశ్రమ నిర్వహణ చేయడం అనేది పెళ్ళికిముందు ఎంతో ఉన్నతంగా అనిపించినా, ఆ ఎఫెక్ట్ ప్రాక్టికల్‌గా తనమీద పడడంతో భరణికి చిరాగ్గా ఉంది.

ఎవరికోసమో అనూష తనని నిర్లక్ష్యం చేయడం తట్టుకోలేకపోతున్నాడు.

హాస్పిటల్‌కి వెళ్ళాలన్న ఆలోచన విరమించుకుని ఎప్పుడు వస్తుందో రానీ, చూద్దాం అనుకున్నాడు.

అనూష ఆత్మవిశ్వాసం శ్యామలని బతికించింది. ఆమెకి వచ్చింది చాలా మైల్డ్ ఎటాక్... మూడు రోజుల తరువాత డిశ్చార్జి చేసింది. ఆ మూడురోజులు మాత్రం ఓ తపస్వినిలా హాస్పిటల్‌లో గడిపింది.

డిశ్చార్జి అయ్యాక ఆశ్రమంవైపు బయలుదేరిన శ్యామలతో అంది. "ఓ వారం రోజులు నా దగ్గర ఉండు శ్యామలా! తరువాత వెడుదువుగాని"

శ్యామల మృదువుగా తిరస్కరించింది. "నీ పనులు నీకు గాక, నేను భారంకానా? ఇప్పటిదాకా చేసింది చాలు. అవతల భరణి ఎలా ఉన్నాడో. నువ్విప్పుడు ఇదివరకులా వంటరిదానివికావు అనూషా... భర్త ఉన్నాడు. అతని మంచీ, చెడ్డా చూడాల్సిన బాధ్యత నీకుంది. ఇవాళ నా మాట విని నువ్వు కూడా విశ్రాంతి తీసుకో"

అప్పుడు గుర్తొచ్చింది అనూషకి. మూడు రోజులనుంచీ ఇంటికి వెడుతోంది వస్తోంది. కానీ భరణి ఎలా ఉన్నాడో, ఏం చేస్తున్నాడో తెలియలేదు. అతను కనిపించినా మాట్లాడలేదు. నిజమే... తనిప్పుడు వంటరికాదు. తనని ప్రేమించి, తనతో జీవితం పంచుకోడానికి ఓ జీవి తనకోసం ఎదురుచూస్తూ ఉన్నాడు. అతడిని నిర్లక్ష్యం చేయడం అన్యాయం కదా! పైగా ఊరు వెళదామంటూ ఆశపడ్డాడు. ఆ విషయం కూడా మర్చిపోయింది తను.

నీరజకీ, సుశీలకీ మందుల వాడకం, తీసుకోవాల్సిన జాగ్రత్తలు, ఆహారం గురించిన నియమాలు అన్నీ చెప్పి, డ్రైవరుని ఇచ్చి వాళ్ళని కారులో పంపించింది. అనూష కారు తనే డ్రైవ్‌చేసుకుంటుంది. ఆశ్రమం వాచ్‌మన్ ఎప్పుడన్నా డ్రైవరుగా కావాలంటే వస్తాడు. అలాగే ఆరోజూ అతడితో వాళ్లని పంపించి, తిరిగి కారు ఇంటికి తీసుకురమ్మని చెప్పి తను ఆటో తీసుకుని ఇంటికి వెళ్ళింది.

ఆమె ఇంటికి వెళ్లేటప్పటికి సాయంత్రం ఆరైంది. భరణి ఇంట్లో లేడు. అంతలో భరణి బైక్ చప్పుడు వినిపించింది. హుషారొచ్చింది అనూషకి. అప్పుడు ఆమె మనసు భరణి సాన్నిహిత్యాన్ని కోరుకుంటోంది.

అంతా మర్చిపోయి ఇవాళ ఆనందంగా గడపాలి అనుకుంది.

భరణిని చూసి నవ్వుతూ పలకరించింది.





"హలో భరణీ! సమయానికి వచ్చావు. రా, అలా మేడమీదికెడదాం. నీకోసం మీ ఆఫీసుకి ఫోన్‌చేశాను. ఎవరూ లేరేంటి? ఇలాగేనా పేపరాఫీసు నడిపేది"

"ఆఫీసులకి టైమింగ్స్ ఉంటాయి. ఎప్పుడు పడితే అప్పుడు పరిగెత్తడానికి ఇల్లు వాకిలీ వదిలి అంకితం అయిపోడానికి అది హాస్పిటల్ కాదు"

అతని స్వరంలో వినిపించిన విసురుకి ఆమె మనసు కొంచెం చివుక్కుమంది. కోపంగా ఉన్నాడు.

అంతలోనే సద్దుకుని మృదువుగా అంది. "ఆఫీసులవాళ్లకి ప్రజల ప్రాణాలను రక్షించే బాధ్యత ఉండదుకదా! అది డాక్టర్లవంతు... జన్మనిచ్చే దేవుడిగుడి తలుపులు కొంచెంసేపు మూసి ఉంచినా నష్టంలేదు. కానీ పునర్జన్మనిచ్చే దేవాలయాలు... హాస్పిటల్సు మూసేస్తే ఎలా? "

భరణి మాట్లాడలేదు. కోపంగా చూశాడు ఆమెవైపు. ఇవాళ ఎందుకో చాలారోజుల తరువాత ప్రసన్నంగా ఉంది. హమ్మయ్య అనవసరంగా అలిగి, మూడ్ పాడుచేయడం ఎందుకు? అనుకున్నాడు.

అనూష తీయగా నవ్వి అంది. "రా పైకి వెడదాం... చల్లటిగాలి వీస్తోంది. వాతావరణం హాయిగా ఉంది"

ఇద్దరూ మేడమీదకి వెళ్ళారు.

ఆమె అన్నట్టుగానే ఆరోజు వాతావరణం చాలా హాయిగా ఉంది. చల్లటిగాలి వీస్తోంది. అనూషకి చమేలీ పూలంటే చాలా ఇష్టం. డాబాపైకి పాకిన ఆ తీగకు గుత్తులు గుత్తులుగా పూశాయి చమేలీలు. అవి విరజిమ్ముతున్న పరిమళాలు పరిసరాలమీద స్ప్రే చేసినట్టు అనిపిస్తోంది. గాలికి గచ్చుమీద రాలి, పూల తివాచీ పరిచినట్టు ఉంది. మరోవైపు పాకిన సన్నజాజి తీగ, చమేలీ పూలతో పోటీపడుతూ సువాసనలు వెదజల్లుతోంది.

అనూష అప్రయత్నంగా అతనిచేయి అందుకుని ముద్దుపెట్టుకుంది. ఆమె స్వరం తీయగా పాడింది. 'ఎంత హాయి ఈ రేయి, ఎంత మధుర మీహాయి'

భరణి ఆశ్చర్యంగా చూశాడు. "నీకీ అనుభూతులు కూడా ఉంటాయా? "

అనూష నవ్వింది. "నాకివాళ చాలా సంతోషంగా ఉంది భరణీ! నా ప్రాణస్నేహితురాలు శ్యామలని బతికించుకున్నాను. ఓ స్నేహితురాలిని పోగొట్టుకున్న ఆ దురదృష్టకరమైన రోజు ఇంతవరకూ మర్చిపోలేకపోతున్నాను. దానికి పరిహారంగా మూడురోజులు కంటికి రెప్పలా కాపాడి శ్యామలని బతికించుకున్నాను. థాంక్యూ భరణీ! నువ్వు కోపరేట్ చేశావు"

"నేనా? " ఆశ్చర్యంగా చూశాడు. "నేనేం కోపరేట్ చేశాను"

"మూడురోజులు నిన్ను పట్టించుకోకపోయినా, నాతో దెబ్బలాడకుండా ఉండడమే భర్తగా నువ్వు నాకిచ్చే సహకారం"

అప్పటిదాకా ఆమెతో తీవ్రంగా దెబ్బలాడడానికి నిశ్చయించుకున్న భరణి, ఆ మాటలతో నీరుకారిపోయాడు. ఆయాచితంగా అనూష అందించిన మంచితనం అనే పురస్కారం అతని నోరు మూయించింది. అయితే, అతని మనసులో ఎన్నో రోజులు నుంచీ మెదులుతోన్న మరో ఆలోచన ఆమెతో చెప్పడానికి ఇదొక మంచి సమయంగా భావించాడు.

అనూష ఇల్లు చాలా పెద్దది. మూడు పెద్ద పెద్ద బెడ్‌రూంలు, పెద్ద డైనింగ్‌హాలు, అంతకన్నా పెద్దహాలు, లివింగ్‌రూమ్. చుట్టూ విశాలమైన ఖాళీస్థలం, డాబామీద ఉన్న అందమైన గది. అక్కడికి వచ్చిన దగ్గర్నించి అనూష ఇంత పెద్ద ఇంట్లో ఒక్కతీ ఇన్నేళ్లనుంచీ ఎలా ఉందా? అని ఆశ్చర్యంగానే ఉంది. పైగా అంత పెద్ద ఇల్లు ఏం చేసుకుంటుంది అన్న ఆలోచన కూడా కలిగింది. అందులో కొంత భాగం తనకిస్తే ఆఫీసు పెట్టుకోవచ్చు ప్రస్తుతం ఆఫీసు

ఉన్న దగ్గర ప్రెస్సు పెట్టుకోవాలి. అందుకు తగిన మెషినరీ కొనడానికి అనూషని పెట్టుబడి పెట్టమనాలి అని చాలారోజులునుంచీ ప్లాన్ చేస్తున్నాడు. అయితే వివరంగా ఈ విషయాలు చర్చించడానికి తగిన సమయం ఆమె కేటాయించకపోవడం కూడా అతనిలో అసంతృప్తికి మరో కారణం అయింది. ఇవాళ అనుకోకుండా అనూష మంచి మూడ్‌లో ఉండి, ఇద్దరిమధ్యా ఏకాంతం కల్పించింది. ఈ అవకాశం వదులుకోకూడదు. నిశ్చయించుకున్నాడు.

కంఠాన్ని వీలైనంత మృదువుగా మార్చి అన్నాడు. "నీలో ఏ అంకితభావం చూసి ప్రేమించానో ఆ అంకితభావానికి నా సహకారం లేకుండా ఎలా ఉంటుంది అనూ! కాకపోతే, అస్తమానం హాస్పిటలు, రోగుల గురించి ఆలోచిస్తూ, నీ ఆరోగ్యం పాడుచేసుకుంటున్నావని, నీ జీవితంలో ఆనందించి, అనుభవించాల్సిన సమయం రోగులకి వెచ్చిస్తున్నావని నాకు బాధగా ఉంటుంది. ఇతరులకి సేవచేయాలంటే నీలో శక్తి కావాలి కదా! ఆ శక్తి పుంజుకోవాలంటే వేళకి భోజనం, నిద్ర కావాలి కదా!"

అతడివైపు మురిపెంగా చూసింది. "థాంక్స్ భరణీ! నువ్వన్నది నిజమే. ఇప్పటినుంచీ మన గురించి కూడా ఆలోచిస్తాను సరేనా? ఈ కబుర్లాపి ఏవన్నా మంచిమాటలు చెప్పకూడదూ!"

భరణి నిశ్శబ్దంగా ఉండిపోయాడు. చీకటిపడింది. ఆకాశం చుక్కలతో మెరుస్తోంది. నెల పొడుపు చంద్రుడు సన్నని గీతలా కనిపిస్తున్నాడు.

అనూష హటాత్తుగా అంది "ఆకాశం ఇలా తారా చంద్రులతో చూసినప్పుడు నాకు భయం వేస్తుంటుంది"

"ఎందుకు? "

"శాస్త్రజ్ఞులు మనిషి అంతరిక్షంలో నివసించడానికి అవకాశాలు ఎన్ని ఉన్నాయో పరిశోధనలు చేస్తున్నారు. అన్నివిధాలా అనుకూల ఫలితాలు సాధిస్తున్నారు. నిజంగా అలా జరిగితే మనలాంటి ప్రేమికులకి స్ఫూర్తినిచ్చే ఈ తారాచంద్రులు ఏమైపోతారు? "

భరణి ఆమెకి దగ్గరగా జరిగి హత్తుకు కూర్చున్నాడు. గాలికి ఆమె మొహంమీద పడుతోన్న ముంగురులు సవరించి, ముద్దు పెట్టుకుంటూ అన్నాడు. "నీలో ఇంత భావుకత ఉందా? "

"ఏం? కత్తులతో, కటార్లతో గుండెకోసే అనూషకి గుండెని స్పందింపచేసే భావుకత ఉందన్న నిజం జీర్ణించుకోలేకపోతున్నావా. పిచ్చిభరణీ! నేనూ మనిషినేగా. నాకూ కోరికలు, ఆశలూ, ఆశయాలు అన్నీ ఉన్నాయి. అవకాశాన్నిబట్టి, పరిస్థితులనుబట్టి అవి నిద్రలేస్తాయి... అంతే"

"ఏది ఏమైనా నా అనూష గ్రేట్... నీలాంటి స్త్రీ నా భార్య అయిందంటే నాకు ఒక్కోసారి నమ్మబుద్ధికాదు సుమా!"

"వీణ కూడా నీలాగే అంటుంటుంది"

"అన్నట్టు వీణగారు ఫోన్ చేశారు. కన్యాకుమారిలో ఉన్నారుట. ఫోన్ చేయమన్నారు. మా ఆవిడ నాకే అపాయింట్‌మెంట్ ఇవ్వడంలేదు. మీకేం ఇస్తుంది అన్నాను"

"అలాగా! అదేంటి శ్యామల విషయం చెప్పలేదా? "

"చెప్పలేదు అనూ... ఆవిడ హడావిడిగా మాట్లాడి ఫోన్ పెట్టేశారు. తరువాత మాట్లాడతానన్నారు"

"అదేంటి భరణీ! చెప్పాల్సింది కదా!"

"సారీ అనూ... ఆలోచనరాలేదు. ఏవిటో మూడ్ బాగాలేక"

"ఓ. కే. నేను మాట్లాడతాలే. ఇప్పుడెందుకు మూడ్ పాడుచేసుకోడం ఇంకేదన్నా చెప్పు" అతని ఒడిలో తలపెట్టుకుని అంది. ఆమెకివాళ ఎందుకో చాలా ఉల్లాసంగా ఉంది మనసంతా. మంచి రొమాంటిక్ మూడ్ కూడా ఉంది. అందుకే వేరే విషయాలకు అంతగా ప్రాధాన్యత ఇవ్వాలనిపిం




చలేదు. భార్యభర్తల ఏకాంతంలో పరాయి వాళ్ళ గూర్చిన వాదోపవాదాలు జరగడం అంత ఆమోదయోగ్యంకాదు అనిపించింది.

"నీ మూడ్ బాగుచేయనా? " అతడి బుగ్గ మీద ముద్దుపెట్టుకుంటూ అంది.

ఆమె చేష్టలకి పరవశించిపోయాడు భరణి. ఓ పక్క పరవశిస్తూనే, ఆమెతో తనకున్న కార్యం సఫలం చేయడానికి ఇదే సమయం అని ఆ విషయం మాట్లాడడానికి తననితను ప్రిపేర్ చేసుకుంటున్నాడు.

"నీతో ఓ విషయం చెప్పాలి అనూ!" అన్నాడు.

"ఏంటది? చెప్పు"

భరణి గొంతు సవరించుకుని మెల్లిగా ప్రారంభించాడు. "అనూ! నాకు ఒక్క విషయం చాలా ఆశ్చర్యంగా అనిపిస్తుంది. ఇంతకాలం నుంచీ ఇంత పెద్ద ఇంట్లో ఒక్క దానివీ ఎలా ఉన్నావు? "

"ఒక్కదాన్ని ఎందుకున్నాను? వాచ్‌మన్ ఉన్నాడు. రాజు ఉన్నాడు. అయినా, నేను ఇంట్లో ఉండేది రాత్రిళ్లేగా... భయం దేనికి? "

"భయంకాదు. అసలింత ఇల్లు అవసరం ఉందా అని"

"మా నాన్నగారు కట్టించారు. అవసరం ఉంటుందని కట్టించి ఉంటారు. ఇప్పుడు ఇద్దరం ఉన్నాంగా"

"నాకో చిన్న ఐడియా వచ్చింది చెప్పనా? "

"ఏంటి? చెప్పు"

"ఏం లేదు... నేను ప్రింటింగ్ ప్రెస్సు కూడా పెట్టాలనుకుంటున్నాను. చూస్తున్నావుగా... నా పత్రిక వేరే ప్రెస్సులో ప్రింటింగ్‌కి ఇవ్వాల్సివస్తోంది. బొత్తిగా అడ్వర్‌టైజ్‌మెంటులు లేవు. ఇప్పుడన్నా ఒకసారి ఐదు వేల కాపీలు అమ్ముడవుతుంది. దానికే సర్క్యులేషన్ పెరిగిందని సంతోషపడతాను. ఈ సారి ఇష్యూరాలేదు. కొందరు ఎంప్లాయిస్ వేరే చూసుకుని వెళ్ళిపోయారు. బొత్తిగా నష్టాల్లో పడింది నా పేపరు"

"పోనీలే... ఏం పోయిందిప్పుడు... వేరే మంచి పేపర్‌లో ఉద్యోగం చూసుకోవచ్చుగా. నడవని పత్రికతో కుస్తీ ఎందుకు? "

"నో! నేను ఇంకోదగ్గర పనిచేయడం ఏంటి? నా స్వంతంగా నాకు ప్రెస్ కావాలి"

"ఇంకేం. దాందేం ఉంది భరణీ! ప్రెస్సు పెట్టుకో"

"ఆ... అదే... దానికి కావాల్సిన రెండు మిషన్లు కొనాలి. దానికి కొంత డబ్బు ఖర్చవుతుంది. ఆ డబ్బు నువ్వు పెట్టుబడి పెడితే, నా పేపరు కుంటినడక మానేసి, చక్కగా హంసనడకలు నడుస్తుంది. మంత్లీ పేపరు చేయాలన్న నా కోరికా తీరుతుంది"

"నీ కోరికా, ఆశా నెరవేరాలని నేను ఆకాంక్షిస్తాను. తప్పకుండా నీకు పెట్టుబడి పెడతాను. అయితే కొంతకాలం ఆగాలి. ప్రస్తుతం నా దగ్గర అంత డబ్బులేదు"

"అందుకే చిన్న ఐడియా వేశాను"

"ఏంటది? "

"మనిద్దరికైనా ఇంత పెద్ద ఇల్లు అవసరంలేదు. అందుకని... ఈ ఇల్లు అమ్మేసి"

"భరణీ!" గట్టిగా అరిచింది.

ఉలిక్కిపడ్డాడు.

అనూష సర్దుకుని అంది "సారీ!... ఈ ఇల్లు అమ్మాలన్న ఆలోచన రావడమే మహాపాపంగా భావిస్తాను నేను. ఇది మా నాన్నగారు కట్టించిన ఇల్లు. అమ్మా, నాన్నా తిరిగిన ఇల్లు. నేను పుట్టి, పెరిగిన ఇల్లు... ఆడి, పాడిన ఇల్లు... వాళ్ళిద్దరూ భౌతికంగా లేకపోయినా ఈ ఇంట్లో వాళ్ళ పదధ్వనులు నాకు వినిపిస్తూనే ఉంటాయి. ఎక్కడ అడుగుపెట్టినా, ఏం చేసినా వాళ్ళు కోటిస్వరాలతో నన్ను దీవిస్తున్నట్టుగా అనిపిస్తుంటుంది. అమ్మ స్వరం, ఆవిడ పాదాల మంజీరనాదాలు, మట్టెల శబ్దం, నాన్నగారి గంభీరస్వరం నాకు అనుక్షణం వినిపిస్తూ ఉంటాయి. నేను పూజించే దేవుళ్ళు మా

అమ్మా, నాన్నా. ఈ ఇల్లు వారిద్దరి విగ్రహా లున్న దేవాలయం... నేను వేరే దేవాలయాలకి ఎక్కువగా వెళ్లను ఎప్పుడో తప్ప. ఇదే నాకు దేవాలయం... ఇంకెప్పుడూ ఇలాంటి ఆలోచన రానివ్వకు"

భరణి ఆమె మాటల్లో వినిపించిన ఉద్రేకానికి కొంచెం జంకాడు... ప్రస్తుతానికి ఆ సబ్జెక్టు మాట్లాడకపోవడమే మంచిది అనిపించింది. నెమ్మదిగా అన్నాడు, "సారీ!"

అనూష ఆవేశం తగ్గించుకుని నవ్వింది. "ఇట్సాల్ రైట్... పద కిందికి వెడదాం. అన్నట్టు చెక్ సంగతేమైంది? నేను పట్టించుకోలేదు"

"ఇంత త్వరగా అవుతాయా గవర్నమెంటు ఆఫీసుల్లో పనులు... నువ్వు మళ్ళీ ఒకసారి మినిస్టర్‌గారిని కలిస్తేగానీ, రాదు" అన్నాడు.

"ఓ.కే. రేపే వెళతాను"



అన్నట్టుగానే అనూష మర్నాడు మళ్ళీ మినిస్టర్‌గారి దగ్గరకి వెళ్ళింది. "దాదాపు నెల అవుతోంది నేను శాంక్షన్ చేసి, ఇంకా రిలీజ్ అవలేదా?" అంటూ ఆయన వెంటనే పి.ఎ.ని పిలిచి వెంటనే చెక్ రిలీజ్ అవడానికి ఏర్పాట్లు చేయమన్నాడు.

"మీరు రానవసరంలేదు. చెక్కు మీకు పంపిస్తాను" అన్నాడు పి.ఎ.

అనూష థాంక్స్ చెప్పి వచ్చేసింది.

మర్నాడు మధ్యాహ్నానికి హాస్పిటల్‌కి వచ్చి ఇచ్చాడు పి.ఎ. అతనికి ఏదో ప్రాబ్లెమ్ ఉంటే చెక్‌చేసి, మందులు రాసిచ్చి పంపించింది.

ఆ చెక్కు భరణికి ఇచ్చి డిపాజిట్ చేయమంది. క్యాష్ తీసుకున్నాక ఏమేం చేయాలో చెప్పింది.

"నీకెందుకు? నువ్వు ఆశ్రమం సంగతి మర్చిపో... నేను చూసుకుంటాను" అన్నాడు.

"అంతకన్నానా? థాంక్యూ" అంది ఆనందంగా. అనూష భరణిని మనసారా నమ్మి ఆశ్రమం బాధ్యతలు అతనికి అప్పగించింది.

భరణి చెక్కు తీసికెళ్ళి, డిస్కౌంట్‌చేసి, క్యాష్ తీసుకున్నాడు. అనూష చెప్పిన పనులు చేయడానికి హుషారుగా బయలుదేరాడు. అతనలా హుషారుగా ఆ బాధ్యతలు తీసుకోడానికి కారణం డబ్బు తన చేతి మీదుగా ఖర్చుచేస్తాడు కాబట్టి ఎంతో కొంత మిగుల్చుకోవచ్చనే ఆశ...స్వార్థం.

ఎవరో దిక్కులేనివాళ్లకోసం అనూష అంతగా శ్రమపడడం, అంత డబ్బు ఖర్చుచేయడం భరణికి నచ్చలేదు. చూస్తూచూస్తూ అన్ని లక్షలు ఆశ్రమానికి ఇవ్వడం ఎంత మాత్రం నచ్చలేదతనికి. అందుకే నిర్మొహమాటంగా, కొంచెం ధైర్యంగా ఆ డబ్బులో కొంత దాచుకోవాలని నిర్ణయించుకున్నాడు. పైగా, అనూష ఆశ్రమంకోసం పడే శ్రమలో తన పత్రికకోసం పడకపోవడం అతడి కడుపుమంటకి కారణం అయింది. అదేం బైట పడకుండా మామూలుగా ఎంతో నమ్మకంగా ఆ బాధ్యతలు స్వీకరించాడు. సక్రమంగా చేస్తున్నట్టుగా అనూష దగ్గర మంచి పేరు సంపాదించుకున్నాడు.

అనూష చెప్పిన సంఖ్యలో సగం తగ్గించి మిషన్లు కొన్నాడు. అతను కొన్న మిషన్లు

మంచి కంపెనీవికాదు. చౌకలో వస్తున్నా యని లోకల్ కంపెనీవి కొన్నాడు. అలాగే సరుకులు, ఇతర వస్తువులు తనే తీసుకొచ్చి ఇచ్చాడు శ్యామలకి.

"మీరెందుకు శ్రమతీసుకున్నారు భరణి గారూ!" అన్న శ్యామలతో అన్నాడు.

"ఇంతకాలం మగవాళ్ళ అండలేక అన్ని పనులూ మీరే చేసుకున్నారు. ఇప్పుడు నేను ఉన్నాను కదా! ఏం కావాలన్నా నన్ను అడ గండి. అనూష ఎంతో నేనూ అంతేగా"

శ్యామల సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయింది. ఆలస్యంగా పెళ్ళి చేసుకున్నా, భరణిలాంటి అమృతహృదయుడిని చేసుకు న్నందుకు మనసారా సంతోషించింది.

నీరజ కొడుకుని స్కూల్లో వేయడానికి అతని సహాయం కోరింది.

అతను నీరజని, బాబునీ తీసికెళ్ళి అక్క డికి దగ్గరగా ఉన్న కాన్వెంటులో చేర్పిం చాడు.

అందంగా, సన్నజాజి మొగ్గలా ఉన్న నీర జని చూశాక భరణికి అనిపించింది, ఈ అమ్మాయికి అనూష పెళ్ళి చేయకుండా ఆశ్రమంలో ఎందుకు ఉంచింది? అని. అదే అన్నాడు నీరజతో.

"నువ్వు పెళ్ళిచేసుకోవచ్చుగా నీరజా"

నీరజ ఉలిక్కిపడింది. పెళ్ళా... తనకి పెళ్ళా...

ఒక్కసారి గతం గుర్తొచ్చి వణికిపో యింది. తను ఏవిధంగా అర్హురాలు? ఈ శరీరాన్ని ఎంతమంది వాడుకున్నారు? ఎంత దరిద్రంగా వాడుకున్నారు. పెళ్ళి, కాపురం, శృంగారం అంటే వెగటు పుట్టేలా, రోత కలిగేలా అమ్మో... పెళ్ళి చేసుకోవ డం...భర్త అనే మగవాడి స్పర్శ భరిం చడం.

ఏం మాట్లాడకుండా మౌనంగా ఉండిపో యింది.

ఆమె మౌనం వహించడంతో అతనేం మాట్లాడలేదు. పిల్లవాడిని స్కూల్లో చేర్పిం చాడు. తండ్రి పేరు దగ్గర నిర్భయంగా ఫాదర్ అని కొట్టేసి, మదర్ అని రాసి, తన పేరు రాసింది నీరజ. ఆమె ధైర్యానికి ఆశ్చ ర్యపోయాడు.

"నీకింత ధైర్యం ఎలా వచ్చింది? " అడి గాడు.

"మేడమ్ దగ్గర నేర్చుకున్నాను. ఇది ధైర్యం కాదు. ఆత్మవిశ్వాసం"

నివ్వెరపోయాడు. మంచి ట్రైనింగే ఇస్తోంది అనూష.

ఆమెని ఆశ్రమం దగ్గర దింపి, అందరి దగ్గరా సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆశ్రమం ఖర్చులకోసం అనూష ఇచ్చిన డబ్బులో మిగుల్చుకున్న రెండున్నర లక్షలు తీసుకుని ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

అనూషమీద ఉన్నకోపం, తన పత్రిక డైలీ పేపర్ కావాలన్న ఆశా, తను పైకి రావాలన్న స్వార్థం కలిసి, ఓ సత్కార్యం కోసం తనని నమ్మి ఇచ్చిన డబ్బుని నిర్మొ హమాటంగా స్వకార్యంకోసం ఖర్చుపెట్టుకో డానికి నిర్ణయించుకున్నాడు.

అయితే, ఆ డబ్బు మంత్లీ పత్రిక నిరాటం కంగా సాగడం కోసం... కానీ, డైలీ పేపర్ చేయాలన్న ఆశ నెరవేరాలంటే ముందు స్వంతంగా ప్రెస్ పెట్టుకోవాలి. దానిక్కావల సిన ఎక్విప్‌మెంటు కొనాలి. అందుకు చాలా డబ్బు కావాలి.

★ ★ ★

భరణి పత్రిక మాసపత్రికగా మారింది.

అనూష మరో ఐదు లక్షలు తన స్వంత డబ్బు పత్రిక్కి పెట్టుబడి పెట్టింది. భరణికి స్వంత ప్రెస్సు పెట్టుకోవాలన్న కోరిక రోజురోజుకీ పెరగసాగింది. అనూషని ఎలాగైనా ఒప్పించి ఈ ఇంట్లో ఓ భాగంలో ప్రెస్సు పెట్టుకోవాలి. ఎందుకు ఒప్పుకోదు? తన భర్త పైకి రావాలనుకుంటే ఒప్పుకతీ రాలి. నిజంగా డైలీపేపరు తీసుకురాగలిగితే అనూషక్కూడా ఎంత పబ్లిసిటీ! రోజూ ఆమె గురించి వార్తలు వేయచ్చు ఆ మాటే

అన్నాడోరోజు.

"అనూషా! ఇంతవరకు సాయంచేశావు. బాగానే ఉంది. స్వంత ప్రెస్సు పెట్టుకోడాని క్కూడా సాయంచేయచ్చుగా"

"చెప్పానుగా భరణీ! చేస్తాను. వీలైనంత మటుక్కి చేస్తాను. నెమ్మదినెమ్మదిగా అభివృద్ధి సాధించాలి. ఒక్కసారే పైకెళితే ఢాం అని పడిపోతాం"

"నేను పడిపోకుండా నువ్వు పట్టుకోగలవు. నువ్వంత సమర్థురాలివి కాబట్టే నిన్ను నమ్ముకున్నాను. ఏమవుతుంది ఈ ఇంట్లో సగం ప్రెస్సు పెట్టుకుంటే"

"ఆ మాట మాట్లాడద్దన్నానా? "

"నేను అమ్మమనడంలేదు. కొంచెం భాగం నాకివ్వమంటున్నాను"

"రెసిడెన్షియల్ కాలనీలో ప్రెస్సు పెడితే ఎంత డిస్టర్బెన్స్‌గా ఉంటుందో తెలుసా!"

"నీకేం ఇబ్బంది కలక్కుండా చూసుకుంటాగా"

"భరణీ! ఎట్టి పరిస్థితుల్లోనూ ఈ ప్రపోజల్ అంగీకరించను. ఇంకోసారి ఈ విషయం మాట్లాడకు ప్లీజ్" నిర్మొహమాటంగా చెప్పింది.

"అవునులే నువ్వు నాకెందుకు సాయంచేస్తావు? ఆ దిక్కుమాలిన వాళ్ళకు చేస్తావు" అనుకున్నాడు మనసులో.

భరణికి చాలా అనీజీగా అనిపించింది. అనూష ఇల్లెందుకు అమ్మకూడదు? వెధవ సెంటిమెంటు. ఆ ఇల్లు అమ్మితే యాభై లక్షలు పైన వస్తుంది. పదిలక్షల్లో డబుల్ బెడ్‌రూం ఫ్లాట్ కొనుక్కుని మిగతా డబ్బు బ్యాంకులో వేసుకుని, కొంత డబ్బు పేపర్‌కి పెట్టుకోవచ్చు

అతనలా అలగటం, ముభావంగా ఉండడం అనూషకి బాధనిపించింది. ప్రతీదీ అలిగి సాధిస్తాడీ మనిషి. ఏంటి ఈతని మనస్తత్వం? అనుకుంది. మావగారు చెప్పిన మాటలు గుర్తొచ్చి అతడిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించింది. ఆ రాత్రి కొన్ని డాక్యుమెంట్లు అతని చేతికి అందిస్తూ అంది "ఇవి నా స్థలం తాలూకూ డాక్యుమెంట్లు. బంజారాహిల్స్‌లో రెండొందల గజాల స్థలం ఉంది. నీకు అవకాశం ఉంటే ఈ స్థలంలో నాలుగ్గదులు వేసుకో. ఆ గదుల్లో ప్రెస్ పెట్టుకో"

భరణి మొహం వికసించింది. బంజారా హిల్స్‌లో రెండొందల గజాల స్థలం అంటే మాటలా? కానీ నాలుగ్గదులు వేసుకోవడానికి డబ్బో? అదే అన్నాడు.

"మీ నాన్నగారిని అడగచ్చుగా? "

"మా నాన్నగారు నా వాటా ఆస్తిలో కొంత ఇదివరకే ఇచ్చారు పత్రిక్కి. మళ్లీ ఇవ్వమంటే ఇవ్వరు. నువ్వే ఏదన్నా చూడచ్చుగా..."

"నేనా!!" దిగ్భ్రాంతిగా చూసింది.

"ఏం నీకు బోలెడు పరపతి ఉందిగా. ఏవన్నా ఫండ్స్ ఇప్పించు"

"ఫండ్స్ ఎలా ఇస్తారు భరణీ? ఆశ్రమం వేరు. పదిమంది అనాథలకి కూడూ, గుడ్డా, నీడా ఇచ్చే సంస్థ... పత్రిక వేరు"

"ఏం? నేనూ ఇస్తున్నాను, పదిమందికి కూడా గుడ్డా నీడా... నా దగ్గర ఎంత మంది పని చేస్తున్నారో తెలుసా? "

"నువ్విలా మాట్లాడితే ఏం చెప్పను? కావాలంటే ఏదన్నా బ్యాంకులో లోన్ తీసుకుందాం. నేను ష్యూరిటీ ఉంటాను"

"అవసరంలేదు. లోన్ తీర్చద్దా? నాకసలే భయం"

"మరెలా? "

అతనేం మాట్లాడలేదు. భరణికి బాగా కోపం వచ్చింది. రెండు రోజులు మాట్లాడడం మానేశాడు. 'ఆశ్రమం కోసం మినిష్టరుగారిని కలిసి ఫండ్స్ పొందిన అనూష తన భర్తకోసం ఏమీ చేయలేకకాదు. నిర్లక్ష్యం. అన్నం పెడుతున్నానుకదా! వీడి ప్రెస్ ఇంక నడిస్తే ఏం? నడవకపోతే ఏం? అనే నిర్లక్ష్యం కాకపోతే ఎందుకిప్పిం




చదు. బ్యాంక్‌లో లోన్ ఇప్పిస్తుందిట, తను ష్యూరిటీ ఇస్తుందిట. లోన్ మళ్లీ తీర్చద్దా? ఎక్కడినుంచి తీరుస్తాడు. పేపర్ నడపడం, నిలదొక్కుకోవడం అంత ఈజీనా? ఎంతో ప్రఖ్యాతి గాంచిన పేపర్లు మూతడ్డాయి. ఆఫ్టరాల్ తనదెంత? రెండు లక్షలు, ఐదు లక్షలు ఎందుకు పనికొస్తాయి. హిందూ పేపర్‌లా, ఈనాడు పేపర్‌లా తన పేపర్ అత్యధిక సర్క్యులేషన్ సాధించాలంటే డబ్బు కావాలి. బాగా డబ్బు కావాలి. ఎలా? ఎలా?' ఆలోచించాడు.

అతని ప్రవర్తన ఆమెకి చిరాకు తెప్పించింది. అయిందానికీ, కానిదానికీ ఇలా వాదనేసుకోవడం, అలగడం, మాట్లాడకపోవడం ఇలాంటి చేష్టలు ఆమెకి చిరాకు. పెళ్లి అయిన దగ్గర్నుంచీ ఇతని అలకలు తీర్చడం దినచర్యలో ఓ భాగం అవుతోంది. పరస్పర అవగాహనతో, పరస్పర సహకారంతో జీవితకాలం స్నేహితుల్లా ఉండాల్సిన తమ మధ్య ఈ మధ్య ఏదో ఒక లోటు ఏర్పడుతోంది. అది కేవలం కమ్యూనికేషన్ గ్యాప్ వల్ల ఏర్పడిందే. దీని వలన స్పర్థలు పెరుగుతాయేగానీ తరగవు. ఈ వయసులో ఇలా దెబ్బలాడుకుంటూ బతకడం చాలా అసహ్యంగా ఉంటుంది. అతను అవివేకంగా ప్రవర్తిస్తే తనన్నా వివేకంగా ప్రవర్తించాలి.

అనూష వీలైనంత మృదువుగా అంది "కొన్ని రోజులు ఓపిక పట్టు భరణీ! ఆ స్థలంలో రెండు గదులు వేయిస్తాను"

భరణి వెంటనే కాకపోయినా, కొన్ని క్షణాల తర్వాత తన అంగీకారం తెలిపాడు. అతని టార్గెట్ లో స్వంత బిల్డింగ్... బిల్డింగ్ అయిపోతే... ప్రెస్‌లోకి కావలిసిన మెషినరీ సంపాదించాలి. ఇవి సంపాదించాక తన కోరిక తీరడానికి పెద్దగా కష్టపడక్కర్లేదు. కానీ... ఆ కోరిక తీరేదెలా?

అనూష ఇచ్చిన ప్లాట్‌లో బిల్డింగ్ కట్టడానికి ఆర్కిటెక్టుని కాంటాక్ట్ చేశాడు. ప్లాన్ తీసుకెళ్లి అనూషకి చూపించాడు.

"ప్లాన్ చాలా బాగుంది. తప్పకుండా కొన్నిరోజులయ్యాక కనస్ట్రక్షన్ స్టార్ట్ చేద్దాం" అంది.

అయితే అతను కొద్దిరోజులు ఆగడానికి సుముఖంగా లేడు. అతని మనస్తత్వం ప్రకారం అనుకున్నపని వెంటనే జరగాలి.

అనూషకి అసలు తన భర్తమీద కన్నా, ఆశ్రమంమీద అంత శ్రద్ధ ఎందుకు? అనిపించింది. అలా ఆలోచించినకొద్దీ, ఆశ్రమవాసులమీద పీకలదాకా కోపం వస్తోంది. ఆ కోపం తీర్చుకోడానికి అతనికి ఒకటే మార్గం కనిపించింది. ఆశ్రమం విషయంలో తనెంతో శ్రద్ధ వహిస్తున్నట్లుగా అనూష ముందు నాటకం ఆడి, ఆ డబ్బు తన కోరిక తీర్చుకోడానికి ఉపయోగించుకోవాలి. అలా అనుకున్న వెంటనే అందుకు కావలసిన ఏర్పాట్లు చేసుకోవడంలో మునిగిపోయాడు.

★ ★ ★

వీణ దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది.

తను చూసిన అందమైన ప్రదేశాలు వర్ణిస్తూ 'నువ్వూ, భరణీ ఓ ట్రిప్ వెయ్యరాదూ' అంటూ రాసింది.

వీణ ఉత్తరం చదివాక అనూష మనసంతా తేలిగ్గా, ఉల్లాసంగా మారింది. నిజమే! ఓసారి ఎటన్నా తిరిగిరావాలి. బొత్తిగా జీవితం మొనాటనస్ అయిపోయింది. పాపం! భరణి అంటూనే ఉన్నాడు. ఎటన్నా వెళ్లాలని. అప్పుడు వెళ్లాలనుకుంటే శ్యామలకి అనారోగ్యం రావడంతో కుదరలేదు. ఈసారి ప్లాన్ చేయాలి అనుకుంది. అప్పటికప్పుడే డైరీ తీసి, తన అపాయింట్‌మెంట్స్ చూసుకుంది. దగ్గర్లో ఇంపార్టెంట్ ప్రోగ్రామ్స్ ఏవీలేవు. డేట్ ఫిక్స్‌చేసి ఆ రాత్రి భరణికి చెప్పింది.

"ఐదో తారీకు మనం మద్రాస్ వెళదాం... ఇవాళ టికెట్స్ తెప్పించు భరణీ!"

"ఏంటి దేవిగారు అడక్కుండా వరాలిస్తు

న్నారు" సంతోషంగా అడిగాడు.

"అంతే... దేవతలు అలాగే చేస్తారు" అని నవ్వింది.

అయితే ఈసారి కూడా అనుకున్నట్లుగా బయల్దేరలేకపోయింది.

మర్నాడు హాస్పిటల్‌కి వెళ్లగానే సిస్టర్ చెప్పింది. "డాక్టర్! మిమ్మల్ని ఛీఫ్‌గారు రమ్మన్నారుట. చాలాసార్లు మీ గురించి అడిగారుట"

అనూష ఆశ్చర్యంగా చూసింది "ఎందుకు? "

"తెలియదు... వెళ్లిరండి"

"సరే... ముందు రౌండ్స్ పూర్తిచేసి వెడతాను. బెడ్ నెంబర్ 10 పేషెంట్ కండిషన్ ఎలా ఉంది? "

"చాలా బాగా కోలుకున్నాడు డాక్టర్. చక్కగా మాట్లాడుతున్నాడు"

"వెరీగుడ్... డాక్టర్ ప్రవీణ్ వచ్చారా? "

"వచ్చారు"

"రౌండ్స్‌కి వెళదాం రమ్మని చెప్పండి"

"ఓ. కే. డాక్టర్" సిస్టర్ వెళ్ళిపోయింది.

అనూష రౌండ్స్ పూర్తిచేసి, డాక్టర్ హరిశ్చంద్రగారిని కలుసుకోడానికి వెళ్ళింది.

చాలారోజులైంది ఛీఫ్‌ని కలిసి. ఈమధ్య లీవులు బాగా తీసుకుంది. ఎందుకు పిలిచి ఉంటారు? పెళ్ళి చేసుకోమన్నది వృత్తిని నిర్లక్ష్యం చేయడానిక్కాదు అని చివాట్లు వేయడానికా? అలా చేయరు. మరి ఎందుకో. ఏదన్నా కొత్త మెటీరియల్ వచ్చిందా? అలా కొత్త మెటీరియల్ వచ్చినపుడల్లా దానిగురించి అనూషతో తప్పకుండా డిస్కస్ చేస్తాడాయన. ఆమె ఆలోచనల్లో ఉండగానే ఛీఫ్ ఛాంబర్ సమీపించింది.

ఆయన ఒక్కడే కూర్చుని ఉన్నాడు చాలా ఖాళీగా. ఏదో మెడికల్ జర్నల్ తిరగేస్తున్నాడు. అనూషకి కొంచెం భయం వేసింది. ఇంత ఖాళీగా కూర్చుని తనని పిలిచాడంటే చాలా ముఖ్యమైన వ్యక్తిగత విషయం మాట్లాడడానికే అయి ఉంటుంది. నిజానికి ఆమెనెవరూ విమర్శించకపోయినా, పెళ్ళి చేసుకున్నాక కొన్నిరోజులు లీవుపెట్టి దాంపత్యజీవితం గడపడం అనేది ఆమెకి ఆమే బాధ్యతారహితంగా ప్రవర్తించానేమో అనుకుంటోంది. అందుకే, ఆయన ఆ విషయం మాట్లాడడానికే పిలిచాడేమో అనిపించింది.

"మే ఐ కమిన్ డాక్టర్" అనూష స్వరం వినిపించగానే ఆయన తలెత్తి చూశాడు. ఆయన మొహంలో వెలుగు కనిపించింది. రిలీఫ్‌గా నిట్టూర్చింది అనూష.

"కబురు చేశారుట"

"నీతో ఓ ఇంపార్టెంట్ విషయం మాట్లాడడానికి పిలిచాను అనూషా"

"చెప్పండి" కుతూహలంగా చూసింది.

"ఏం లేదు. ఆగస్టులో లండన్‌లో ఇంటర్నేషనల్ మెడికల్ కాన్ఫరెన్స్ జరగబోతోంది. ఇండియాలోని ఒక్కో స్టేట్‌నుంచి ఒక్కొక్కరిని నామినేట్ చేస్తున్నారు. ముంబాయినుంచి డాక్టర్ జోషి, ఢిల్లీనుంచి డాక్టర్ మెహతా, కలకత్తానుంచి డాక్టర్ ఛటర్జీ, చెన్నైనుంచి డాక్టర్ రాజన్ వెళ్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌నుంచి డాక్టర్ అనూషని నామినేట్ చేయాలనుకుంటున్నాను"

"సర్..." విస్మయంగా పిలిచింది.

"అవునమ్మా... నువ్వే... నిన్నే పంపించాలనుకుంటున్నాను. ఇవిగో ఇవన్నీ వేగంగా అభివృద్ధి చెందుతోన్న సైన్స్ తాలూకు జర్నల్స్. ప్రపంచవ్యాప్తంగా అద్భుతమైన ప్రయోగాలు చేస్తున్నారు కార్డియాలజీలో. అవన్నీ నువ్వు నేర్చుకుని, ఇండియాలోనే పెద్ద సర్జన్‌గా పేరు ప్రతిష్ఠలను సంపాదించాలి. అది చూసి నా శిష్యురాలు సాధించిన ప్రగతికి గర్వంతో పొంగిపోవాలి నేను"

అనూష అప్రయత్నంగా లేచి ఆయన కాళ్ళకు నమస్కరించింది.




"నో... నో. అనూషా. ఎవరికీ ఎప్పుడూ తల వంచకూడదు. కమాన్ మై డియర్ చైల్డ్. గెట్ రెడీ. పేపర్ ప్రెజెంట్ చేయడానికి కావలసిన మెటీరియల్ ఇదంతా. తీసుకెళ్ళి కష్టపడి మంచి పేపర్ తయారు చేయి. ఎప్పుడు, ఏ సమయంలో నా గైడెన్స్ కావాలన్నా ఫోన్ చేయి. ఓ. కే."

ఆనందంతో కళ్ళలో నిల్చిన రెండు కన్నీటిబొట్లు చెంపలమీదికి జారాయి. కృతజ్ఞతా భావం గుండెనిండా నిండిపోయి, మాట రావడంలేదు. ఉద్విగ్నంగా తల ఊపింది.

"ఆల్ ద బెస్ట్"

ఆయన దగ్గర సెలవు తీసుకుని వచ్చేశాక, ఇంక హాస్పిటల్‌లో కాలు నిలవలేదు. ఈ వార్త అర్జంటుగా ముందు భరణితో, తరువాత వీణతో పంచుకోవాలనిపించింది. త్వరత్వరగా పని ముగించి, ఇంటికి బయలుదేరాలనుకుంది. కానీ ఏవో ఒకటి రెండు ఎమర్జన్సీ కేసులు రావడంతో కుదరలేదు. సాయంత్రం త్వరగా ఇంటికి బయలుదేరింది.

ఆమె వెళ్ళేటప్పటికి భరణి ఇంట్లోనే ఉన్నాడు. అప్పుడే వచ్చినట్టున్నాడు. అనూష కారు దిగి లోపలికి వెళ్తూనే భరణి చేతులు పట్టుకుని గుండ్రంగా తిరిగింది.

"మేడమ్‌గారు చాలా సంతోషంగా ఉన్నట్టున్నారు. కారణం తెలుసుకోవచ్చా?"

తిరగడం ఆపి గలగలా నవ్వుతూ అంది, "నీ పేపర్‌కి అనూష గురించిన మరో హాట్ న్యూస్ దొరికింది"

"ఏంటది?"

అతడి మెడచుట్టూ చేతులు పెనవేసి, మురిపెంగా చెప్పింది. "డాక్టర్ అనూష ఆంధ్రప్రదేశ్‌నుంచి లండన్‌లో జరగబోయే కాన్ఫరెన్సుకి వెళ్ళబోతోంది"

"ఈజిట్? ఎన్నాళ్ళు?" అడిగాడు...

"తెలియదు.. బహుశా నెలరోజులు పట్టచ్చు వెళ్ళిరావడానికి.. మా ఛీఫ్ నా పేరు ప్రపోజ్ చేశారు.. భరణీ! నాకు చాలా ఆనందంగా ఉంది తెలుసా! అబ్బా ఈ సమయంలో వీణ ఉంటే ఎంత సంతోషించేది? ఫోనన్నా చేయచ్చుగా..."

"అనూ! నువ్వు లేకుండా నెలరోజులు నేను ఒక్కడినీ ఉండాలా?"

"ఏం పాపాయివా? నేను లేకుండా భయమా?" నవ్వింది.

"అదికాదు... నువ్వు వెళ్తున్నావంటే దిగులుగా ఉంది... జర్నలిస్టు భరణిగా ఈ వార్తకి స్పందించి పేపర్‌లో వేసేవాడినే... కానీ, నీ భర్తగా ఆనందంగా ఉన్నా అంగీకరించలేకపోతున్నాను..."

"పిచ్చి భరణీ! నువ్వు కళ్ళు మూసుకుని తెరిచేలోగా వచ్చేస్తాను.. శాశ్వతంగా ఉంటానేంటి?"

"నిజమే! కానీ, నాకెందుకో బెంగగా ఉంది..."

"బెంగా లేదు... ఏం లేదు.. పద, ఇవాళ మనం బైట భోంచేద్దాం... రెడీ అవు..." అంటూ లోపలికెళ్ళిపోతుంటే అన్నాడు...

"మరి ఊరికి వెడదాం టికెట్ తెమ్మన్నావుగా... తెచ్చాను..."

అనూష టక్కున ఆగిపోయింది... "సారీ! ఏవిటో మన ప్రయాణం అసలు ముడిపడడం లేదు... ఫర్వాలేదులే... మరోసారి వెడదాం... కాన్సిల్ చేయించెయ్..."

"అదేమిటీ?"

"ఏం చేయను చెప్పు... నేను కావాలని చేస్తున్నానా? అయినా, ఆనందం మన మనసులో ఉంటే చాలదూ! దానికోసం ఎక్కడికో ఎందుకు? ఇవాళంతా బైట తిరిగి ఎంజాయ్ చేద్దాం... సరేనా?" గోముగా అంది అతని చెంపలమీద మృదువుగా రాస్తూ...

అతనేం మాట్లాడలేదు...

ఆ రోజంతా ఎంతో ఉత్సాహంగా, సరదాగా గడిపింది... భరణిని రెచ్చగొట్టింది.. అల్లరి చేసింది... గారాం చేసింది.. ఆనందించింది.. ఆనందింపచేసింది...అయితే,

వీణకి ఈ విషయం చెప్పాలన్న తహతహ మాత్రం అలాగే ఉండిపోయింది..



మర్నాడు అనూష కోరిక తెలిసినట్టుగా.. వీణ దగ్గర్నించి మరో ఉత్తరం వచ్చింది.. అనూష రెండు, మూడుసార్లు మెయిల్ ఇచ్చింది.. కానీ, వీణ చూసుకోలేదేమో! రిప్లై ఇవ్వలేదు.. ఫోన్ చేస్తే తను దొరకడంలేదు.. వీణ వెళ్లి కూడా దాదాపు మూడు నెలలవుతోంది... సెలవులు కూడా అయిపోయాయి. ఇంకా రాలేదు... ఎక్కడుందో ఏం చేస్తోందో... ఆత్రంగా కవర్ చింపింది...

"అనూ!

నిన్ను వదిలిపెట్టి వెళ్లి మూడు నెలలవుతోంది.. నువ్వు ఖంగారు పడుతున్నావు కదూ ఈ శాల్తీ ఎక్కడ తిరుగుతోందా అని. దాదాపు భారతదేశంలోని ముఖ్యమైన స్థలాలు, చారిత్రాత్మక స్థలాలు చూశాను.. ప్రస్తుతం ఆగ్రాలో ఉన్నాను. హరిద్వార్, హృషీకేశ్ వెళ్లొచ్చాను... పుణ్యస్థలాలు ఎంత అందంగా ఉన్నాయో! రోప్ వే మీద అమ్మవారి ఆలయానికి వెళుతుంటే అనిపించింది 'దీనిమీద నుంచి నేను పడిపోతే... అనూషకి ఎలా తెలుస్తుంది?' అని. తిడుతున్నావుకదూ! తప్పదు.. ఇవన్నీ జీవిత సత్యాలు. తల్చుకోడానికి బాధెందుకు? రామ్‌ఝూలా, లక్ష్మణ్‌ఝూలా చూశాను. ఇక్కడ రామభక్తులు అడుగడుగునా కనిపిస్తారు. ఎక్కడ చూసినా రాముడి పేరే కనిపిస్తుంది. దేవుడిని నమ్మనివాళ్లు మూర్ఖులు అనిపిస్తుంది నాకు. ఎంత పెద్ద నాస్తికులైనా, ఏదో ఒకనాడు దేవుడి ఉనికిని నమ్మి తీరాలి. ఈ పవిత్ర స్థలాల్లో దేవుడు తిరుగుతాడేమో! అనిపిస్తుంది నాకు. నవ్వుకుంటున్నావా? అనూ! దేవుడిని నమ్మకపోతే, జీవితంలో ఇంతదూరం నడిచిరావడం జరిగేది కాదు.. అదిసరే... ముఖ్యంగా ఓ విషయం రాస్తున్నాను..

లాస్ట్ లెటర్‌లోనే నీకీ విషయం రాయాలనుకుని ధైర్యం సరిపోక రాయలేకపోయాను. కానీ నీకు ఈ సంగతి తెలియచేయకపోతే నాకు శాంతిలేదు. నీనుంచి ఇలాంటి కబురు వింటే గుడ్‌న్యూస్ అని సంబరపడిపోయి, స్వీట్స్ తిని, పార్టీ ఇవ్వమని నిన్ను వేధించి ఉండేదాన్ని. కానీ నానుంచి ఈ కబురు వినడం అసహజం. సమాజవిరుద్ధం. నేను... నేను తల్లిని కాబోతున్నాను. తండ్రి ఎవరు? అని అడక్కు. నా ఈ ప్రయాణంలో అనుకోకుండా అనారోగ్యం పాలయ్యాను. వాంతులు, కళ్ళు తిరగడాలు మొదలై ప్రయాణబడలిక అనుకున్నాను. బైట హోటల్స్‌లో తినడంవల్ల సరిపడలేదనుకున్నాను. కానీ డాక్టరు దగ్గరకి వెళితే తెలిసింది నాకు మూడో నెల అని. పీరియడ్స్ రాకపోతే నలభై వచ్చిందికదా, మెనోపాజ్ అనుకున్నాను కానీ నేను గర్భవతిని... యస్. నేను గర్భవతిని అనూ!"

అనూష ఉలిక్కిపడింది.

వీణ గర్భవతా? మైగాడ్ ఎలా? ఆమె కళ్ళు మిగతా అక్షరాలవైపు పరుగెత్తాయి.

"అనూ! మొదటిసారి తల్లి కాబోతున్న ఆడదాని మనోభావాలేంటో నువ్వు ఊహిం




చగలవనుకుంటా. నా కడుపులో ప్రాణం పోసుకుంటోన్న జీవి బైటపడ్డాక ఈ సమాజం ఆ జీవిని అక్రమసంతానం అని అవమానిస్తుంది. బాధిస్తుంది, వేధిస్తుంది. కానీ నాకలా అనిపించడంలేదు. అక్రమమైనా, సక్రమమైనా ఈ ప్రపంచంలోకి ఓ ప్రాణిని తీసుకురావడం స్త్రీకున్న మహత్తర వరం. ఆ వరం నాక్కూడా దక్కినందుకు ఆనందిస్తున్నాను. ఆ మహదావకాశం భగవంతుడు నాకు కల్పించినందుకు పొంగిపోతున్నాను. నాకు కొడుకు పుట్టినా, కూతురు పుట్టినా వాళ్ళని చరిత్రకారులుగా మిగిలిపోయేలా పెంచుతాను. సగర్వంగా, ఈ సమాజానికి పరిచయం చేస్తాను. అయితే చిన్న అనుమానం ఏంటంటే, ఓ జీవికి ప్రాణం పోసే సమయం స్త్రీకి పరీక్షసమయం అంటారుకదా! ఆ సమయంలో నేను బతికి బైటపడతానో, లేదో ఒకవేళ బతక్కపోతే, నాకు పుట్టబోయే శిశువుకి నువ్వే ఆధారం. ఎందరికో ఆశ్రయం ఇచ్చి ఎందరికో బతుకునిచ్చిన దేవతా... ముందుగా నీ దగ్గర మాట తీసుకుని ఈ సృష్టిభారం ఆనందంగా మోయాలని ఉంది. అనూ! మాట ఇస్తావుకదూ! నేను ఇక్కడ ఇంకా వారం ఉంటాను. ఆ తరువాత ఓపిక ఉంటే బొంబాయి వెడతాను. ఎప్పటినుంచో గోవా చూడాలని నా కోరిక. నా హోటల్ అడ్రస్ ఇస్తున్నాను. జాబు రాయి. భరణి ఎలా ఉన్నాడు? కొంచెం మొండివాడు కదూ! పైగా అనుకున్నంత ఉన్నతుడు కూడా కాదు. అయినా ఫర్వాలేదు. మగవాళ్ళు పూర్తిగా ఉన్నతులు కాలేరు. సహజసిద్ధమైన కొన్ని బలహీనతలు పుట్టుకతోటే వాళ్ళ రక్తంలో జీర్ణించుకుపోయి ఉంటాయి. కాబట్టి ఏదన్నా తప్పుచేసినా క్షమిస్తుండు. ఎందుకంటే ఈ వయసులో మరో పెళ్ళి చేసుకోలేవుగా. జీవితం అమూల్యమైంది అనూ! పూర్తిగా అనుభవించాలి" అంటూ ముగించింది.

అనూషకి గుండెల్ని తన్నుకుంటూ ఉవ్వెత్తున దుఃఖం పొంగుకొచ్చింది. వీణా... వీణా! ఎందుకే చేతులారా జీవితం నాశనం చేసుకుంటున్నావు? ఎందుకే...? జీవితం ఎంత విలువైందో నాకు చెప్పావు కానీ నువ్వెందుకు తెలుసుకోలేకపోతున్నావు?

అలాగే... చాలాసేపు ఏడుస్తూ ఉండిపోయింది. తరువాత తేరుకుని. వీణకి లెటర్ రాసింది...

"వీణా!

నీ లెటర్ అందింది. నువ్వు ఈ సమయంలో ఇలా ప్రయాణాలు చేయడం క్షేమంకాదు. వెంటనే హైదరాబాద్ వచ్చేయ్. మిగతా విషయాలు పర్సనల్‌గా మాట్లాడుకుందాం..."

లెటర్ రాజుకిచ్చి పోస్ట్ చేయించింది. రాజు వెడుతుండగా భరణి వచ్చాడు.

వస్తూనే బాగా వాచిపోయి ఉన్న అనూష కళ్ళు చూసి ఖంగారుగా అడిగాడు.

"ఏం జరిగింది అనూ, ఎందుకు ఏడ్చావు?"

అనూష తట్టుకోలేకపోయింది. చటుక్కున అతని గుండెలమీద వాలిపోయి వెక్కి వెక్కి ఏడ్చింది.

అతనికేం అర్థం కాలేదు. అనూష కూడా ఏడుస్తుందా? ఈమెక్కూడా కన్నీళ్ళు ఉన్నాయా? అయితే, ఈ కన్నీళ్ళకు కారణం ఏమిటి? ఆ కారణం ఎంతటి విషాదకరం అయి వుండాలి? ఈ గంభీర, ధీరవనితను కదిలించిన కారణం ఏమిటో?

కాస్సేపటికి సర్దుకుంది అనూష.

"అనూ! వెళ్ళి మొహం కడుక్కురా" మృదువుగా అన్నాడు.

ఆమె వెళ్ళి మొహం కడుక్కుని వచ్చింది.

అప్పటికే భరణి టీపాయ్‌మీద ఉన్న వీణ ఉత్తరం చదివాడు. అతని మనసంతా వీణ పట్ల జుగుప్సతో నిండిపోయింది. ఏం మనిషి? అసలు ఆడదేనా? ఛీ... సిగ్గులేకుండా ఈవిడకి ఉత్తరం రాసింది. అది

చదివి ఈవిడ శోకాలు పెడుతోంది. స్వయంకృతాపరాధం... ఇప్పుడు ఏడ్చి ఏం లాభం? విచ్చలవిడిగా తిరిగేటప్పుడు ఇవన్నీ గుర్తుకు రాలేదా? ఆమె అక్రమసంతానాన్ని అనూష పెంచాలా? చచ్చినా తను అంగీకరించడు. వాడిని కూడా ఏ చెత్తకుండీలోనో పడేస్తే సరి. అతనలా ఆలోచిస్తుండగా అనూష మొహం కడుక్కుని టవల్‌తో మొహం తుడుచుకుంటూ వచ్చింది.

"సారీ భరణీ! నిన్ను ఖంగారుపెట్టాను కదూ" అంది.

"ఖంగారు సరేగానీ, అనవసరమైన విషయాలకి నువ్వు ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చి నీ మనసు, ఆరోగ్యం కూడా పాడుచేసుకుంటున్నావనిపిస్తోంది. ఆవిడ చేసిన తప్పుకి నువ్వెందుకు బాధపడడం?"

"ఉత్తరం చదివావా?" సీరియస్‌గా అడిగింది.

"ఇక్కడే ఉందిగా. నువ్వు ఏడవడానికి కారణం ఏంటా అని ఆలోచిస్తుంటే ఉత్తరం కనిపించింది"

"చదివావు. సరే ఇది వీణ ఉత్తరం కాబట్టి చదివావు. ఇక ముందు అలా నా పేరుమీద ఉన్న ఉత్తరాలు చదవద్దు"

"నేనెందుకు చదువుతాను? అయినా ఇహ నుంచీ ఆవిడ మనింటికి రావడం, ఆవిడతో మన స్నేహం కంటిన్యూ అవడం నాకిష్టంలేదు"

"అవన్నీ మాట్లాడుకోవద్దు భరణీ! వీణ పర్సనల్ మాటర్ తప్ప నువ్వేం మాట్లాడినా నేనేం అనుకోను"

"సరే. మన విషయం మాట్లాడతాను విను. ఆవిడ పిల్లల్ని పెంచుతానని అదనీ ఇదనీ వాగ్దానాలు చేయకు"

"అసలా ఆలోచన ఎందుకు రావాలి? వీణ చావు నేను కోరుకోవడంలేదు. నువ్వీ విషయంమర్చిపో ఇంకా" అంటూ అక్కడి నుంచి లోపలికెళ్లిపోయింది.

భరణికి కోపం ఉవ్వెత్తున లేచినా అది సమయం కాదని అణిచేసుకున్నాడు.

అనూష టీ తాగి పుస్తకాలు ముందేసుకుని కూర్చుంది. కానీ మనసు లగ్నం చేయలేకపోయింది. వీణ గర్భవతి అన్న వాస్తవం జీర్ణించుకోలేకపోతోంది. ఆలోచనలు వదిలించుకుని పుస్తకాలు చేతిలోకి తీసుకునేటప్పటికి భరణి వచ్చాడు.

"భోజనం చేద్దామా? ఆకలేస్తోంది" అన్నాడు.

"ఆ అరగంటాగి తిందాం... కాస్త పేజీలు తిరగేస్తాను. పేపర్ తయారు చేసుకోవాలి. వచ్చింది సువర్ణావకాశం. వదులుకుంటే దొరకదు" అంది పుస్తకాల్లోకి చూస్తూ.

భరణికి ఈ సమయంలో అనూష లండన్ వెడితే తన పనులేవీకావని భయం పట్టుకుంది. పైగా అతనిప్పుడు ఆమెకి భర్త. భర్తగా ఆమె ఉన్నతిని హృదయపూర్వకంగా ఆహ్వానించలేకపోతున్నాడు. ఎలాగైనా ఈ ప్రయాణం ఆపాలని ఉంది. కానీ ఎలా?

అనూష సీరియస్‌గా హరిశ్చంద్రగారిచ్చిన జర్నల్స్ చదవడం, తీరిక దొరికినప్పుడు లైబ్రరీకి వెళ్లి కావలసిన పుస్తకాలు తెచ్చుకోవడం అవన్నీ రెఫర్ చేయడంలో ఎప్పటికన్నా బిజీగా ఉంది. ఒక్కోరోజు నిద్రకూడా పోకుండా హాస్పిటల్ నుంచి వచ్చి పుస్తకాలు చదువుతూ కూర్చుంటోంది. భరణిలో రానురానూ అసహనం ఎక్కువ అవుతోంది. ఇలా వదిలేస్తే భర్తనీ, కాపురాన్నీ కూడా మర్చిపోయేలా ఉంది అనుకున్నాడు.

ప్రేమానురాగాలతో ముంచెత్తి ఆమెని లొంగదీసుకోడానికి నిశ్చయించుకున్నాడు. రోజూ ఆమె చదువుకోడానికి కూర్చోడం, తను కళ్లు మూసుకుని నిద్రపోవడం చాలా చిరాగ్గా ఉందతనికి. ఏంటి? ఈ పనిష్మెంటు అనిపిస్తోంది. వయసైపోతోందని అసలే దిగులుగా ఉంది. అసలే లేట్ మారేజ్. మధ్యమధ్య ఈవిడ ప్రజాసేవ.





అదీగాక ఇప్పుడు ఈ గొడవ. విసుగ్గా అని పిస్తోంది. ఈ వయసులో చదువేంటసలు? లాభంలేదు. ఊరుకుంటే మరీ ఎక్కువవు తోంది. పెళ్లి చేసుకున్నది ఇలా వింటరిగా పడుకోడానికి కాదు.

భరణి మంచం మీద కాస్సేపు అటూ ఇటూ అసహనంగా కదిలాడు. నెమ్మదిగా లేచి ఆమె కూర్చున్న దగ్గరకి వచ్చి వెనుక నుంచి ఆమె భుజం మీద చేయివేశాడు.

ఉలిక్కిపడింది అనూష. "నువ్వా? అబ్బా ఉలిక్కిపడ్డాను. నిద్రపట్టలేదా? " అడిగింది పుస్తకంలోంచి మొహం ఎత్తకుండా.

"ఎలా పడుతుంది? నాకింకా ఎన్నాళ్లీ విరహం? "

తల తిప్పి అతని మొహంలోకి చూసింది. "అప్పుడప్పుడు విరహం ఉంటేనే ప్రేమలో ఘాటు పెరుగుతుంది"

"ఏంటి అనూ! ఇప్పటికే సగం వయసు కరిగిపోయింది. ఇంకా ఈ విరహం ఏవిటి? " అంటూ మారాం చేయసాగాడు.

"ఏంటి భరణీ! చిన్నపిల్లాడివా? కొంచెం నిగ్రహంలేదా? నన్ను చదువుకోనివ్వ వేంటి? అంత పెద్ద కాన్ఫరెన్సులో నేను పేపర్ ప్రెజెంట్ చేయకపోతే ఎంత అస హ్యంగా ఉంటుందో తెలుసా! నా పరువు కాదు నా పేరు ప్రపోజ్ చేసినవాళ్ల పరు వుపోతుంది"

"చేసుకోవచ్చులే. అయినా ఇప్పటినుంచీ మొదలుపెడితే నువ్వు లండన్ వెళ్లి వచ్చిం దాకా నాకీ పస్తులు తప్పవు. నీకిది న్యాయంగా ఉందా? "

"నాకొచ్చిన మంచి అవకాశం దీనికోసం పాడుచేయడం నీకు న్యాయంగా ఉందా? "

"నేనేం పాడుచేయడంలేదు. కాస్సేపు నాతో గడిపినంత మాత్రాన నీ అమూల్యా మైన కాలం వృధా అయినట్టా? "

"లండన్ వెళ్లొచ్చాక విసుగొచ్చిందాకా ఎంజాయ్ చేద్దాం భరణీ! ప్లీజ్... ఇంటర్ నేషనల్ కాన్ఫరెన్సు. బ్లాంక్‌గా వెళ్లడం అస హ్యంగా ఉంటుంది. నన్నిలా డిస్టర్బ్ చేయడం నీకు ధర్మంకాదు"

భరణి విసుగ్గా అన్నాడు. "నీ లండన్ ప్రయాణం కోసం నా కోరికలు చంపుకో వాలా? భార్యగా నీ ధర్మం ముందు నెర వేర్చు తరువాత వెళుదువుగాని కాన్ఫరెన్సుకి"

"అంటే నీతో ప్రతిరాత్రీ ఎంజాయ్ చేస్తేనే నేను భార్యగా నా ధర్మం నెరవేర్చినట్టు అవు తుందా? "

"కాదా? వివాహం చేసుకోవడం అంటే గృహస్థధర్మాన్ని ఆచరించడం"

ఆమె మెడమీదకివంగి జడలో ఉన్న చమేలీపూలు వాసన చూస్తూ మత్తుగా అన్నాడు. "నా వల్లకాదు అనూ! ఎదురుగా గులాబ్‌జామ్ పెట్టి తినద్దని శాసిస్తున్న ట్టుగా ఉంది. ఇంతకాలం అవలంబించిన బ్రహ్మచర్యం సరిపోలేదా? అయినా చదువు కోడానికి కాపురం వదులుకుంటారా? ప్లీజ్ రా అనూ"

ఆ స్వరంలోని మత్తుకి ఆమె లొంగిపో యింది. అతని అల్లరి చేష్టలకి కరిగిపో తున్న మనసుని కంట్రోల్ చేసుకుంటూ అంది "ప్లీజ్ భరణీ! కొంచెం కోపరేట్ చేయి. నేను పైకిరావడం నీకిష్టంలేదా? "

"అదేం మాట. నీ ఉన్నతి నా ఉన్నతి కాదా? డాక్టర్ అనూష భర్తగా నేనెంత గర్వంగా ఫీలవుతానో నీకు తెలియదు. కానీ అందుకోసం నన్నిలా బాధపెట్టడం బాగుందా? ఆడపిల్లలైతే భర్తకి ఇలాంటి విషయాల్లో కోపరేట్ చేయడానికి పుట్టింటికి వెళతారు కొంతకాలం. కానీ నేనెక్కడికి వెళ్లను? వెళ్లలేనుకదా! అలాగని ఋష్య శృంగుడిలా ఉండలేను. కాస్సేపు నా పక్కన పడుకుని తరువాత చదువుకోవచ్చుగా"

ఇంక అనూష చదువుమీద దృష్టి పెట్టలేక పోయింది. అతని చేతుల్లో ఒదిగిపోతూ మంచం దగ్గరికి నడిచింది.

దాదాపు ప్రతిరోజూ అలాగే సాగింది.

ఆమె చదువుకోడానికి పుస్తకాలు పట్టుకోడం అతను వచ్చి అల్లరి చేయడం మారాం చేయడం ఆమెని పరవశింపచేయడం.

ప్రతిరోజూ హరిశ్చంద్రగారు ఎంతవరకొచ్చింది అని అడుగుతోంటే ఏం చెప్పలేక సిగ్గుతో చచ్చిపోతోంది.

ఓ రోజురాత్రి ఆమెను దగ్గరికి తీసుకుని ఎంతో ఆర్తిగా అడిగాడు భరణి.

"అనూ! మన పెళ్లై ఏడాదికావస్తోంది. నాకింతవరకు నువ్వు గిఫ్ట్ ఏం ఇవ్వలేదు"

"ఏం గిఫ్ట్ కావాలి? నువ్వేదడిగితే అది ఇస్తూనే ఉన్నాగా" అతని మీసం మీద మృదువుగా రాస్తూ అంది.

"అవికాదు స్పెషల్ గిఫ్ట్"

"ఏంటది? "

"చెప్పనా? "

"ఊ..."

"నాకు బాబుకావాలి. అమ్మానాన్న కూడా లెటర్ రాశారు మనవడు కావాలిట వాళ్లకి" ఒక్కసారిగా ఆమె చేయి అతని మీసం మీదనుంచి జారిపోయింది. వెల్లకిలా పడుకుంది.

"చెప్పు ఇస్తావా? " దగ్గరికి లాక్కుంటూ అడిగాడు.

"నా వయసు పిల్లల్ని కనే వయసా? "

"ఏం తప్పేముంది? నువ్వా స్టేజ్ దాటలేదుగా"

"కావచ్చు కానీ పిల్లల్ని కని పెంచి పెద్ద చేసే ఓపిక తీరిక నాకు లేవు భరణీ! ఆ వయసు దాటిపోయాను"

"కానీ నేను దాటలేదు. కోరికా చావలేదు నాకు పిల్లలు కావాలి"

కొంచెం ఆవేశంగా అన్నాడు. అతని ఆవేశానికి నిర్విణ్ణురాలై చూసింది.

"ఎందుకంత ఆవేశం? ఈ ప్రపంచంలో ఎందరో అనాథలున్నారు. వాళ్లంతా మన పిల్లలుకారా? "

"ఛీ నాకేం ఖర్మ? నేను మగాణ్ణికాదా? "

"భరణీ ఆవేశపడకుండా ఆలోచించు. ఇప్పుడు నాకు నలభై రెండేళ్లు. నీకు బహుశా నలభై వచ్చి ఉండచ్చు ఇప్పుడు పిల్లల్ని కని వాళ్లు పెరిగి పెద్దయేటప్పటికి మనకి అరవై వస్తాయి. అసహ్యంగా ఉండదూ! మనవళ్లని మనవరాళ్లని ఎత్తుకోవాల్సిన వయసులో పిల్లల్ని కనడం..."

"ఉండదు... లేట్ మ్యారేజ్ చేసుకున్న వాళ్లెందరో ఉన్నారు. వాళ్లంతా పిల్లల్ని కనడంలేదా? "

"కానీ నాకంత తీరికలేదు, ఆ కోరికా లేదు"

"నీకు లేకపోతే నేనెందుకు నా కోరిక చంపుకోవాలి? "

"అంటే! నీకోరిక తీర్చుకోడం కోసం నేను కని ఇవ్వాలా? "

"అవును... నా భార్యవి... అది నీ డ్యూటీ"

"భరణీ! ప్లీజ్ నన్నర్థం చేసుకోడానికి ప్రయత్నించు"

"నో ఇప్పటికి చాలా అయాయి. అన్నీ భరించాను. ఎక్కడికెళ్లేదీ చెప్పవు, ఎప్పుడొస్తావో చెప్పవు, నన్ను అడక్కుండా ఏవేవో పనులు చేస్తుంటావు. ఇల్లు ఒక పోర్షన్ ఇవ్వమంటే ఇవ్వలేదు, ఎన్నని సహించను? కోరి చేసుకున్నందుకు అన్నీ భరిస్తున్నాను. ఇంక నావల్లకాదు. నాకు పిల్లలు కావాలి. దట్సాల్" భరణి చివ్వున మంచం దిగి వెళ్లిపోయాడు.

అనూష ప్రాన్పడిపోయింది. ఎన్ని మాటలన్నాడు! ఎంత ద్వేషం దాచుకున్నాడు! యధాలాపంగా తను చేసిన కొన్ని పనులను నేరాలుగా భావించి లెక్కకట్టాడు. దాదాపు ఆరేడు లక్షలదాకా అతని పత్రిక్కి ఇచ్చింది. అదేం మాట్లాడలేదు. పెళ్లి అయిన దగ్గర్నించీ తనే అతడిని పోషిస్తోంది. అతను ఉన్న ఇల్లు, తినే తిండి, అనుభవించే భోగాలు అన్నీ తను సమకూర్చినవే. కానీ ఇప్పుడు తనని దోషిగా చేసి




మాట్లాడుతున్నాడు.

ఛీ, భరణికి ఏమైంది? ఈ మనిషి స్వభావమే ఇంతా? లేక పెళ్లి అయాక తనమీద ప్రేమ, వ్యామోహాలతో ఇలా మారాడా?

అనూషకి ఇంక ఎంత ప్రయత్నించినా చదువుమీదకి దృష్టి మళ్లలేదు. అతడి మాటలే చెవుల్లో మోగుతూ ఆవేదన రగుల్కొలుపుతున్నాయి.

అనూషకి బాగా ఏడుపొచ్చింది. కానీ తనని తను కంట్రోల్ చేసుకుని లేచి తరువాత పుస్తకాలు చేతిలోకి తీసుకుంది. కానీ మనసు లగ్నం చేయలేకపోయింది. భరణి మాటలు చెవుల్లో మోగుతున్నాయి.

ఏదిఏమైనా ఇలాంటి పరిస్థితుల్లో తను కాన్ఫరెన్సుకి వెళ్లడం అసాధ్యం... ఎలా ఎలా చెప్పాలి హరిశ్చంద్రగారికి? అనూష కాన్ఫరెన్సుకి ప్రిపేర్ అవలేకపోయింది. భరణి ప్లాను సక్సెస్ అయింది. ప్రయాణం తేదీ దగ్గరపడింది.

ఆ రోజు హరిశ్చంద్రగారు కబురు చేశారు. గుండె గుభిల్లుమంది. తాను ప్రిపేర్ అవలేదని వీసా క్యాన్సిలు చేయించమని చెప్పడానికి ధైర్యం సరిపోలేదు. కారణం ఏం చెప్పాలి? అవును కారణం ఏం చెప్పాలి? భరణి చదువుకోనివ్వలేదని చెప్పాలా? తను ఇప్పుడు మానసికంగా బలహీనురాలైందని చెప్పాలా? తనిప్పుడు పరాధీన అని, స్వంతంగా తీసుకునే నిర్ణయాలు సక్సెస్ అవవని చెప్పాలా? ఏం చెప్పాలి? భయం భయంగా వెళ్లింది.

"ఏమ్మా! ఎలా సాగుతోంది వర్కు?" అడిగాడాయన.

అనూష ధైర్యం కూడదీసుకుంది. "సర్! నేను... నేను..."

ఆయన అనుమానంగా చూశాడు "చెప్పు"

"నేను... వేను... ఈసారికి వెళ్లలేను. నా ఆరోగ్యం బాగాలేదు"

"ఐసీ! యూ మీన్"

"అయామ్ ఇన్ ఫ్యామిలీ వే"

"మైగాడ్! ఇది కూడా గుడ్ న్యూసే. కానీ యూ ఆర్ మిస్సింగ్ ఏ వెరీగుడ్ ఆపర్చూనిటీ. ప్రికాషన్స్ తీసుకుని జాగ్రత్తగా వెళ్లి రామ్మా"

"లేదుసార్. వెళ్లలేను. అసలు బాగా లేదు. మార్నింగ్ సిక్‌నెస్ ఎక్కువగా ఉంది. గిడ్డీనెస్, పేపర్ ప్రెజంట్ చేయాలంటే కుదరకపోవచ్చు... సారీ"

"ఎనీవే కంగ్రాట్స్. నేను మాట్లాడతాలే. వీసా క్యాన్సిలు చేయిస్తాను"

గుండె పగిలినట్టైంది. సువర్ణావకాశం చేతులారా వదులుకుంటోంది. ఎందుకిలా జరిగింది? తనెందుకు భరణిని ప్రతిఘటించలేకపోయింది. అతనిమీద ప్రేమా? నిస్సహాయతా? లేక తానుకూడా మానసికంగా బలహీనురాలై ఇంతకాలంగా కోల్పోయిన జీవనమాధుర్యాన్ని వదులుకో లేకపోయిందా? తనలో భర్త మాట కాదనలేని బానిసత్వం ఉందా? అది ఇంతకాలం నిగూఢంగా ఉండి ఇప్పుడు అతడి సమక్షంలో బైటపడుతోందా? భరణి నిజంగా ప్రేమతో తనని గెల్చుకుంటున్నాడా? తన ఉన్నతి భరించలేక ప్రేమ నటించి భర్తగా సాధిస్తున్నాడా? తను ఓడిపోతోందా? నోనో అలా జరక్కూడదు.

ఆ రాత్రి చాలాసేపు ఏడుస్తూ ఉండిపోయింది. ఆమె ప్రయాణం క్యాన్సిలు అయినందుకు హాయిగా నిట్టూర్చాడు భరణి. అదేమీ గమనించలేకపోయింది అనూష.

ఒక అబద్ధం చెప్పినపుడు అది కప్పిపుచ్చుకోడానికి మరో అబద్ధం చెప్పాలి. హరిశ్చంద్రగారితో చెప్పిన అబద్ధం కప్పి పుచ్చడానికి మరో నెల తరువాత మరో అబద్ధం చెప్పి తనకి అబార్షన్ అయిందని చెప్పి లీవు పెట్టింది. ఎందుకో అనూషకి జీవితంలో మొదటిసారిగా తను బాగా దిగజారిపోయాననిపించింది. దీనికి కారణం అయిన భరణి మీద ఓ విధమైన జుగుప్స కలగసాగింది. అనుకోకుండానే అతడికి దూరంగా

ఉండడం ప్రారంభించింది. అది గమనించిన భరణి ఆమెని ప్రసన్నురాలిని చేసుకోడానికి చాలా కష్టపడాల్సివస్తోంది.



ఆ రోజు మార్కండేయులు దగ్గరనుంచి ఫోన్ వచ్చింది. అనూషే రిసీవ్ చేసుకుంది.

"ఏమ్మా ఎలా ఉన్నావు? మావాడేమన్నా బాధపెడుతున్నాడా?" అడిగాడాయన.

అనూష విరక్తిగా నవ్వుకుంది. "లేదండీ. మీరెలా ఉన్నారు?" అడిగింది.

"మాకేం నిక్షేపంగా ఉన్నాం. నువ్వేంటి? అస్తమానం హాస్పిటల్ అంటూ ఆరోగ్యం నిర్లక్ష్యం చేస్తున్నావుట. డాక్టర్‌వి నీకు నేను చెప్పడం బాగుండదు. కానీ ఆరోగ్యం తరువాతే అన్నీ. జాగ్రత్తగా ఉండాలి. వేళకి భోంచెయ్"

"అలాగేనండి... చేస్తున్నాను"

"మీ అత్తయ్య మాట్లాడుతుందిట" అంటూ ఫోన్ ఆవిడకి ఇచ్చాడు.

ఆవిడ లైన్లోకి వచ్చింది. "ఏమ్మా అనూషా! ఎలా ఉన్నావు?"

"బాగానే ఉన్నాను. మీరెలా ఉన్నారు?"

"మాకేం కానీ, మాకు మనవడినిచ్చేదుందా?"

అనూష చేతిలో రిసీవర్ కంపించింది. గట్టిగా పట్టుకుని పేలవంగా నవ్వింది.

"మా ఇంట్లో పాపాయి తిరగాలని ఉందమ్మా. నీకు టైం ఉండదని కనడం మానేసేవ్ నేను పెంచుకుంటాను. మాకు మనవడు కావాలి. నెల తప్పితే కబురు చేయి వస్తాను సరేనా?"

ఆ తరవాత ఆవిడ మాటలు వినిపించుకోలేదు.

భరణి అడిగితే తేలిగ్గా తీసుకుంది. అత్తగారి కోరికకూడా అదే. బహుశా పెళ్లి అనగానే పిల్లల్ని కనడం అనేది రివాజేమో. ఎలా? తనకి పిల్లలు పుడతారా? అనుమానమే. పీరియడ్స్ చాలా ఇర్రెగ్యులర్ అయాయి. ఎప్పుడో రెండు నెల్లకో, మూడు నెల్లకో అవుతోంది.

తనకింకా ఫెర్టిలిటీ కెపాసిటీ ఉందా? ఒకవేళ లేకపోతే...

అనూషకి గాభరాగా అనిపించింది.

కొన్ని రోజుల తర్వాత అనూష తనకి బాగా తెలిసిన గైనకాలజిస్టు డాక్టర్ ప్రమీల దగ్గరకి వెళ్లింది. ఆమెని చూడగానే ప్రమీల సాదరంగా ఆహ్వానించింది.

"రారా, అనూషా! ఇంతకాలానికి నా అవసరం వచ్చిందా? ఎన్నో నెల?" అడిగింది.

"అదేం లేదు. చెకప్ కోసం వచ్చాను"

"ఐసీ రా పరీక్ష చేస్తాను. స్క్రీన్ వెనక్కి వెళ్లాక పరీక్ష చేస్తూ అడిగింది. పీరియడ్స్ రెగ్యులర్‌గా ఉన్నాయా?"

"లేదు... చాలా గ్యాప్ వస్తోంది"

అరగంటసేపు పరీక్ష చేశాక చెప్పింది ప్రమీల. "సారీ అనూ! యూ ఆర్ రీచింగ్ టు మెనోపాజ్. నీకా అవకాశంలేదు"

అనూష మొహం పాలిపోయింది. అనుకున్నంతా అయింది. తనకే అనుమానం వచ్చింది. ఒక్కసారి గైనకాలజిస్టుతో కన్‌ఫర్మ్ చేసుకోడానికి వచ్చింది.

"పిల్లలు కావాలని ఉందా అనూ!" అడి





గింది జాలిగా.

"అబ్బే లేదు. అదేం లేదు" ఖంగారుగా అంది.

కాసేపు ఆవిడతో మాట్లాడి నేరుగా ఇంటి కొచ్చి పడుకుండిపోయింది.

తను చాలా పెద్ద పొరపాటు చేసింది. ఇన్నేళ్లూ ఎంతో బలంగా నిలుపుకుంటూ వచ్చిన సిద్ధాంతాలను ఒక బలహీనక్షణంలో సడలించుకుని పెళ్లికి ఒప్పుకుంది. అదీ తన కన్నా చిన్నవాడైన భరణితో.

అతనిది వ్యామోహమో! ఆరాధనో! పిచ్చో తన వెంటపడ్డాడు. పెళ్లి చేసుకుంటాన న్నాడు. రాయబారాలు పంపాడు. ఎందుకు ఆకర్షింపబడ్డాడో తననించి ఏం ఆశించాడో తెలియకుండా ఒప్పుకుంది. ఒప్పుకునే ముందు తనకి పిల్లల్ని కనడం ఇష్టంలేదన్న సంగతి చెప్పాల్సింది. చెప్పలేదు. ఆ ఆలో చన రాలేదు. పిల్లలు ఇష్టమైనా కనే స్థితి లేదు. కానీ అతనికా అవకాశం ఉంది. ఇప్పుడీ సంగతి తెలిస్తే ఇద్దరిమధ్యా నిప్పు రాజుకుంటుంది. అసలే కల్లోలం చెలరేగిన నదిలో అస్తవ్యస్తంగా ప్రయాణిస్తున్న నావలా ఉంది ఈ సంసారం. ఇప్పుడు ఏం జరుగుతుంది? ఆలస్యంగా పెళ్లి చేసుకుని ఏడాది కూడా దాటకుండానే ఎడమొహం, పెడమొహంగా ఉన్నారని తెలిస్తే వీణా, శ్యామలా చాలా బాధపడతారు. అత్తగారు, మావగారు ఏమంటారు? చదువుకున్న దానివి నువ్వు కూడా ఇంత సలక్షణంగానా కాపురం చేసేది అంటారేమో!

అనూషకి ఆలోచనలతో తల పగిలిపోతు న్నట్టనిపించింది.

ఈమధ్య తామిద్దరిమధ్యా బాగా గ్యాప్ వచ్చింది. లండన్ ప్రయాణం క్యాన్సిల్ అవ డంతో భరణిపట్ల తనకి ఒకవిధమైన విరక్తి కలిగింది. ఇదివరకులా అతనితో ప్రేమగా మాట్లాడలేదు. పక్కన పడుకోడంలేదు. అతను కూడా ఒకటి రెండుసార్లు బతిమాలి ఊరుకున్నాడు. నిర్లక్ష్యమో, కోపమో మాట్లా డడంలేదు.

భరణి బాగా పొద్దుపోయి వచ్చాడు. అన్నం తినకుండా వెళ్లిపడుకున్నాడు. అత నలా నిర్లక్ష్యంగా ఉండడం అనూషకి బాధ కలిగించింది. ఏదన్నా సమస్య వస్తే ఇద్దరూ చర్చించుకుని సానుకూలంగా పరి ష్కరించుకోవాలి. కానీ ఇతను అస్తమానం అలుగుతాడు. ప్రతిసారీ తనే బతిమాలాలి. సారీ చెప్పాలి. ఎంతకాలం ఇలా? తన స్వభావానికి విరుద్ధమైన పని చేస్తోంది. కేవలం ఈ సంసారం నిలుపుకోడానికే. ఈ బంధం కాపాడుకోవడానికే. ఎలాగా కెరి యర్ పాడైంది. కనీసం సంసారం అన్నా నిలుపుకోవాలి. నలుగురిలో అపహాస్యం పాలవకూడదు. పంతంకన్నా కోపంకన్నా ఆమె సంస్కారం గెలిచింది.

నెమ్మదిగా వెళ్లి భరణి పక్కన పడుకుని అతనిమీద చేయి వేసింది. "భరణీ!" మృదు వుగా పిలిచింది. అతను మాట్లాడలేదు. బిగదీసుకున్నాడు.

"భరణీ! ఇటు చూడు నువ్విలా ప్రతి నిమిషం చిన్నపిల్లాడిలా అలిగితే ఎలా చెప్పు? సమస్య వచ్చినపుడు పరిష్కారం వెతుక్కోవాలి"

"నేనేం వద్దనలేదే. నువ్వే నాతో సరిగా ఉండడంలేదు"

"సారీ... ఏవిటో మనసు పాడైంది. పోనీలే మర్చిపోదాం. జీవితం ముఖ్యం కదా!"

"పోనీ ఆ సంగతి ఇప్పుడన్నా తెలిసింది" చటుక్కున దగ్గరికి లాక్కున్నాడు.

అతని స్పర్శలో ఇదివరకటి అనుభూతి కలగలేదు. నిర్వికారంగా శరీరం అప్పచె ప్పింది.

అరగంట తరువాత ఆమె గుండెలమీద తలపెట్టుకుని పడుకుని, "మనిద్దరిమధ్యా ఈ గొడవలు పోవాలంటే చిట్టిగాడు

రావాలి. ఎప్పుడొస్తాడో... ఏంటి నాకు తెలియకుండా ఏవన్నా ఫ్యామిలీ ప్లానింగ్ పిల్స్ తీసుకుంటున్నావా? డాక్టరువికదా!" అడిగాడు.

ఆమె గుండెలో రాయి పడ్డట్టైంది.

"మాట్లాడు... ఏం చేస్తున్నావు?"

"నీకు పిల్లలంటే అంత ఇష్టమా?"

"నా పిల్లలంటే నాకు ఇష్టం... ఇష్టం సంగతి అలా ఉంచు. పెళ్ళి అయి ఏడాది దాటుతోంది. పిల్లలు లేకపోతే జనానికి నా మగతనంమీద అనుమానం రాదూ!"

అనూషకి అర్థంఅయింది. పిల్లలమీద ప్రేమకన్నా తన మగతనంమీద ప్రేమ ఎక్కువన్నమాట.

అప్రయత్నంగా దూరం జరిగి పడుకుంది.

"నీకు నీ కెరియర్ మీదున్న శ్రద్ధ సంసారంమీద లేదు. ఇంకా ఎంతకాలం కెరియర్ అంటూ కూర్చుంటావు? ఇంకా ఏం సాధించాలి? సాధించింది చాలదా? పిల్లా, పాపా లేకుండా జీవితం కూడా ఓ జీవితమేనా? నిజం చెప్పు... ఎందుకు వద్దంటున్నావు? నీకు వయసు దాటిపోయిందా?" సూటిగా అడిగాడు భరణి లేచి కూర్చుని.

అనూష మాట్లాడలేదు.

"చెప్పు... మాట్లాడవేం?"

"అదే నిజమైతే ఏం చేస్తావు?" నింపాదిగా అడిగింది.

భరణి కొన్ని క్షణాలు నిశ్శబ్దం తరువాత అన్నాడు. "మళ్ళీ పెళ్ళి చేసుకుంటాను"

"షటప్" గట్టిగా అరిచి లేచి కూర్చుంది.

"బుద్ధి ఉండి మాట్లాడుతున్నావా? నేను పిల్లల్ని కనివ్వగలనా? లేదా? అని ముందు ఆలోచించుకోలేదా? కంటికి నచ్చగానే వెంటబడి వేధించావే... చెప్పావా ఆరోజు నాకు. పిల్లలు కావాలి, కనిస్తావా? అని అడిగావా?"

"నువ్వు చెప్పావా నాకు పిల్లలు పుట్టరు అని"

"నేనా విషయం ఆలోచించలేదు కాబట్టి చర్చించలేదు. కావాలనుకున్న నువ్వు అడగాలి"

"నాకేం తెలుసు... నీకింత వయసు దాటిందని"

"నాన్సెన్స్... నీకప్పుడే చెప్పాను నా వయసు"

"నలభై ఏళ్లకే అన్నీ అయిపోతాయనుకోలేదు. చూడ్డానికి చిన్నపిల్లలా ఉన్నావు కదా అని మనసు పడ్డాను"

"హు... అందం, చదువు, హోదా, అంతస్తు చూశావు. కావాలనుకున్నావు, పెళ్ళయాక పిల్లల్ని కనక ఏం చేస్తుందిలే అనుకున్నావు. భార్యంటే పిల్లల్ని కనే యంత్రం అనుకున్నావు. అవునా?"

"అవన్నీ నీ ఆలోచనలు. నాకలాంటి ఆలోచనలు రావు"

"హు..." నిరసనగా అనూష అక్కడి నుంచి లేచి వెళ్ళిపోయింది.

ఎంత దగా! ఎంత మోసం! భరణి... పెద్ద జర్నలిస్టు. స్త్రీ సమస్యలు చర్చించుకోడానికి తన పత్రికలో నాలుగు పేజీలు కేటాయించి స్త్రీవాదిగా కబుర్లు చెప్పే హిపోక్రాట్... మగాడా! నీ విశ్వరూపం ఇదా? ప్రేమంటూ, ఆరాధన అంటూ వెంటబడి, వేధించి, పెళ్ళిచేసుకునేది నచ్చిన ఆడదాన్ని నీ కట్టుబానిసగా మార్చుకోడానికా? అనూషకి గుండెని ఎగదోసుకుంటూ దుఃఖం వచ్చింది.

మర్నాడు భరణి తల్లితండ్రులకి లెటర్ రాశాడు. అది ప్రత్యేకంగా అనూషకి చూపించాడు.

"నీనుంచి విడాకులు తీసుకోడానికి ఇది




మొదటి మెట్టు. మా నాన్న, అమ్మ నన్ను తప్పు పట్టకుండా వాళ్ళకి విషయం తెలియచేస్తున్నాను"

అనూష ప్రమాన్పడిపోయింది. మండిపడుతూ అంది.

"నీ ఇష్టంవచ్చినట్టు విడాకులు తీసుకోడానికి ఇదేం బొమ్మలపెళ్ళికాదు"

"ఏ పెళ్ళో త్వరలోనే తేలుస్తాను" విసురుగా వెళ్ళిపోయాడు.

అన్యమనస్కంగా హాస్పిటల్ కి వెళ్ళింది కానీ ఏం చేయలేకపోయింది.

వీణ పదేపదే గుర్తు రాసాగింది. మెయిల్ ఇచ్చింది వీణకి.

తన బాధ చెప్పుకోడానికి ఎవరూ లేరు. భరణి తనని దోషిని చేస్తున్నాడు. తను దోషికాదని చెప్పేవాళ్లెవరున్నారు? భోరున ఏడవాలనిపించింది అనూషకి.

ఇలాంటి ఆలోచనలతోటే సగటు స్త్రీలంతా తాగుబోతుల్ని, శాడిస్టుల్ని, దుర్మార్గుల్ని, ఇంపొటెంట్స్‌ని భర్తలుగా భరిస్తూ, వాళ్ళు పెట్టే చిత్రవధలు మౌనంగా అనుభవిస్తుంటారు. కానీ తను సగటు స్త్రీ కాదే. మరి ఎందుకు ఇంత దూరం పెరిగినా ఈ కాపురం కావాలనుకుంటోంది?

ఆ రాత్రంతా ఏడుస్తూ పడుకుంది. వెంటనే వెళ్ళి శ్యామల ఒడిలో సేద తీరాలనిపించింది.

★ ★ ★

మరునాడు తెల్లవారకుండానే లేచి కారు తీసుకుని ఆశ్రమానికి వెళ్ళింది.

కారు ఆశ్రమం సమీపించింది.

ఆవరణలో అడుగుపెడుతూనే ఏదో మార్పు కనిపించింది. పచ్చటి మొక్కలన్నీ ఎండిపోయాయి. ఉదయాన్నే పెరట్లో మొక్కలకి నీళ్ళు పెడుతూ, పూలు కోస్తూ కనిపించే శారద, శ్యామల కనిపించలేదు. ఈ మధ్య తనొచ్చి చాలారోజులైంది. శ్యామలని డిశ్చార్జి చేసి పంపించాక రానేలేదు. భరణి ఆశ్రమ వ్యవహారాలు చూసుకుంటుండడంతో ఇదివరకటిలా పట్టించుకోలేదు. ఇవాళ ఈ వాతావరణంలో ఏదో అపశృతి కనిపిస్తోంది.

అనూష హాల్లోకి వచ్చి "శ్యామా!" అని పిలిచింది.

లోపలినుంచి శారద వచ్చింది. బాగా చిక్కిపోయింది. కళ్ళు లోతుకుపోయాయి.

"శారదా?" ఆమెని చూస్తూనే విచలితంగా పిలిచింది.

శారద ఒక్క పరుగున వచ్చి అనూషని కౌగలించుకుని బావురుమంది.

"ఏమైందమ్మా? ఏమైంది?" ఆత్రంగా అడిగింది అనూష.

సుశీల కూడా పరిగెత్తుకుంటూ వచ్చింది. ఆమె వెనకాలే సుశీల కొడుకు... మిగతా వాళ్లు అందరూ ఏడుస్తూ వచ్చారు. వెక్కుతూ చెప్పింది శారద, "శ్యామల... శ్యామల ఆస్పత్రిలో ఉంది"

"ఏ ఆస్పత్రి?" నివ్వెరపోతూ అడిగింది అనూష.

"ఇక్కడే... ప్రైవేటు ఆస్పత్రి. సడన్‌గా మొన్న రాత్రి మళ్ళీ ఎటాక్ వచ్చింది. పక్షవాతం కూడా వచ్చింది. కాళ్ళూ, చేతులూ పడిపోయాయి"

"మరి... మరి నాకెందుకు ఫోన్ చేయలేదు?"

"చేశాను... భరణిగారు మాట్లాడారు. మీకు మెసేజ్ ఇవ్వమని చెప్పాను. చెప్పలేదా?"

అనూష పెదాలు లేదే! అనబోయి ఆగిపోయాయి. "సారీ! చెప్పాడు. కానీ నేనే సరిగా వినలేదు. మామూలుగా చూసివెడదామని వచ్చాను. పద హాస్పిటల్‌కి వెడదాం" గిరుక్కున తిరిగి కారు దగ్గరకి నడిచింది. శారదా అనుసరించింది.



వీళ్ళు వెళ్లేటప్పటికి నీరజ బాగా ఏడుస్తోంది. అనూషని చూడగానే గట్టిగా కౌగలించుకుని వెక్కిళ్ళు పెట్టసాగింది.

"ఎలా ఉంది?" ఏడుపు నిగ్రహించుకుంటూ అడిగింది అనూష.

"కోమాలోకి వెళ్ళిపోయింది"

"నో!" అనూష వెర్రిగా అరిచింది. అప్పటికప్పుడు డాక్టర్‌తో మాట్లాడి ఫీజు చెల్లించి, అంబెలెన్సులో శ్యామలని పంపించమని చెప్పింది. అప్పటికప్పుడే అంబులెన్సు రెడీ అయింది. అనూష గురించి విని ఉండడంతో డాక్టర్లు ఎదురు చెప్పలేదు. ఆమె కోరిన సౌకర్యాలు సమకూర్చారు. అంబులెన్సు ఉస్మానియావైపు బయలుదేరింది. కారులో అనూష అనుసరించింది. ఆమె కళ్ళముందు శ్యామల, తన కర్తవ్యం తప్ప మరేం కనిపించడంలేదు. వేగంగా కారు నడిపిస్తోంటే నీరజా, సుశీలా భయంగా కూర్చుండిపోయారు.

భరణి తనకి ఆశ్రమం నుంచి ఫోన్ వచ్చిందని కూడా చెప్పలేదంటే ఎంత మొండివాడై ఉంటాడు? తన ప్రాణానికి ప్రాణం అయిన శ్యామలకి ఇంత సీరియస్ అయిందని ఒక్క ముక్క చెప్పకూడదా? ఆరోజు శ్యామల బతకడానికి కోపరేట్ చేశాడని ఎంతో సంతోషించింది. కానీ ఇవాళ.

కారు హాస్పిటల్‌లో చేరింది. అంబులెన్సులోంచి శ్యామలని స్ట్రెచర్ మీద ఐ.సి.సి.యు.కి తీసికెళ్లింది.

సుశీలా, నీరజా కారిడార్‌లో ఊపిరి బిగపట్టుకుని కూర్చున్నారు. అనూష శ్యామలని బతికించడానికి తపస్సు చేస్తోన్న రుషిలా మౌనంగా, గంభీరంగా ఉంది. చాలా మంది డాక్టర్స్ వస్తున్నారు. డాక్టర్ హరిశ్చంద్ర కూడా వచ్చారు. ఇరవైనాలుగ్గంటలు గడవాలి. అందరూ జీవకళ కోల్పోయిన మొహాలతో శిలల్లా కూర్చున్నారు. అనూష శ్యామల మంచం దగ్గరనుంచి కదల్లేదు.

సరిగ్గా తెల్లవారుజామున నాలుగ్గంటలకి శ్యామల శాశ్వతంగా వెళ్ళిపోయింది. గొల్లుమన్న నీరజనీ, శారదనీ వదిలేసి అనూష కుప్పకూలిపోయింది.

ప్రాణస్నేహితురాలి ఒడిలో సేదతీరి, తన మనోవేదన చల్లార్చుకోడానికి వస్తే, ఆమే తనని వదిలేసి, శాశ్వతంగా వెళ్ళిపోయింది. అవమానంతో, వేదనతో అల్లాడుతోన్న ఆ గుండెల్లో బడబాగ్నిలాంటి విషాదం నింపి, ఆమె ఖర్మానికి ఆమెని వదిలి వెళ్ళిపోయింది. ఇంకెవరున్నారు తనకి? ఎందుకోసం పెళ్ళి చేసుకుందో, అదే విషయం ఈ రోజు ఓ ప్రశ్నార్థకంలా ఆమెముందు వికృతంగా నవ్వుతూ నిలబడింది.

శ్యామల డెడ్‌బాడీ ఆశ్రమానికి చేరింది. దహనసంస్కారాలు పూర్తయ్యాయి. సుశీల కొడుకు తలకొరివి పెట్టాడు.

అనూషకి జీవితసారం అప్పుడే బోధపడినట్టుగా అనిపించసాగింది. భర్త, పిల్లలు లేకుండా ఎవరినో తనవారిగాభావించుకుని బతికిన శ్యామల చివరిరోజుల్లో నన్నెవరు చూస్తారు? అనుకుందా? అనుకుని ఉంటే ఏం చేసేది? ఇప్పుడు ఎవరు చూశారు? ఎవరో రక్త సంబంధంలేని వాళ్ళు చూశారు. ఏం బంధం ఉందని వీడు ఆమెకి తలకొరివిపెట్టాడు. భగవంతుడా! మేధావిగా పేరుపొందిన అనూష జీవితంలో ఎందుకు ఓడిపోయింది?

ముందు భరణి సంగతి చూడాలి. ఇంత దారుణానికి కారకుడు భరణి. శారద ఫోన్ చేసినప్పుడు తనకి శ్యామల సంగతి చెప్పి ఉంటే తప్పకుండా బతికేది.

శ్యామల మరణానికి కారకుడు భరణి.

అనూష రక్తం సలసల మరిగింది.




శారద దగ్గర సెలవు తీసుకుని ఇంటికి బయలుదేరింది.



హఠాత్తుగా అనూష కనిపించకపోవడంతో భరణికి కొంచెం కలవరంగా అనిపించింది. ఎక్కడికెళ్ళింది? చెప్పకుండా వెళ్ళింది. చెప్పకుండా వెళ్ళడం అలవాటేగా, కనీసం ఫోన్ చేయవచ్చుగా. ఎందుకు చేస్తుంది? తను మాట్లాడడంలేదుగా. పైగా విడాకులిస్తానని బెదిరించాడు కూడా ఇంకెందుకు తనని లక్ష్యపెడుతుంది.

భరణి ఆమెని విడాకులిస్తానని బెదిరించాడు కానీ, అతనికి భయంగానే ఉంది. విడాకులు తీసుకుంటే తనకే నష్టం. పైగా ఇప్పుడిప్పుడే తన కలలు నెరవేరబోతున్నాయి. ఈ సమయంలో ఆమెతో గొడవ పెట్టుకుంటే బాగా నష్టపోతాడు. ఇన్ని రోజులనుంచీ ఆమే బతిమాలుతుందిలే అని బింకంగా ఉన్నాడు. కానీ ఈసారి అనూష బతిమాలలేదు సరికదా! మూడు రోజుల నుంచి కనిపించడంలేదు. కొంపతీసి విరక్తి పుట్టి ఆశ్రమానికి వెళ్ళిందా? ఆశ్రమానికి వెళ్ళిందంటే కొంపలంటుకుంటాయి. తనసలు అక్కడి విషయాలు పట్టించుకోడంలేదు. ఆ మధ్య అక్కడినుంచి ఫోన్ వచ్చినా చెప్పలేదు. అనూష ఆశ్రమం గురించి మర్చిపోవాలని కోరుకున్నాడు. నిజంగా ఆమె అక్కడికే వెడితే, తన గొయ్యి తను తవ్వుకున్నట్టే.

అప్పటికి ఆమె కోసం భరణి హాస్పిటల్ కీ, ఆశ్రమానికీ ఫోన్లు చేశాడు. విషయం తెలిసింది. ఆమె ఎవరో చచ్చిపోతే, మొగుడిని వదిలేసి కనీసం విషయం కూడా తెలియచేయకుండా, అలా రోజుల తరబడి అనూష ఇంటికి రాకపోవడం, తన గురించి పట్టించుకోకపోవడంతో భరణి నిలువెల్లా దహించుకుపోసాగాడు.

కానీ తననితాను కంట్రోల్ చేసుకుని ఆమెతో మంచిగా ఉండాలని నిశ్చయించుకున్నాడు. ఆమెని కన్సోల్ చేసి, ఇంటికి తీసుకురావడానికి బయలుదేరుతుండగా అనూష కారు వచ్చి ఆగింది.

అనూష కారు ఆగగానే ఎదురొచ్చిన భరణి, ఆమె వాలకం చూసి అవాక్కైనాడు. దాదాపు స్పృహ తప్పుతోన్న ఆమెని పట్టుకుని లోపలికి తీసికెళ్ళి మంచంమీద పడుకోబెట్టాడు.

రెండురోజులదాకా ఆమె మంచంమీద నుంచి దిగలేదు. నూటరెండు, నూటమూడు డిగ్రీల జ్వరంతో అపస్మారకంలో ఉండిపోయిన ఆమెని చూసుకోడానికి శారదని పిలిపించక తప్పలేదు భరణికి. ఆమె పరిస్థితి చూస్తుంటే అతనికి కొంచెం భయం వేసింది. ఏం చేయాల్లో, ఎలా చేయాలో తోచలేదు.

ఆశ్రమానికి ఫోన్ చేశాడు. బిల్లుకట్టలేదని డిస్కనెక్ట్ చేసినట్టు రికార్డెడ్ వాయిస్ వినిపించింది.

ఏం చేయాలో తోచలేదు. ఇప్పుడు ఈమెకి ఏదన్నా అయితే తనకే నష్టం. డాక్టరుకి ఫోన్ చేయబోతుండగా శారదే ఫోన్ చేసింది.

గబగబా అన్నాడు. "మీరు వెంటనే రండి. అనూష కండిషన్ బాగాలేదు. నాకు

భయంగా ఉంది"

సరిగ్గా గంట తరువాత శారద ఆటో లోంచి దిగింది.

ఆమెకి అనూషని అప్పగించి, నిశ్చింతగా నిట్టూర్చాడు.

మూడోనాడు కళ్ళు తెరిచింది. అనూషకి చారన్నం తినిపించింది శారద. గుండె పగిలేలా ఏడ్చింది అనూష. శారద ఆమెని ఓదార్చింది. "మీరే ఇలా అయిపోతే మాకు మాత్రం ఇంకెవరున్నారు? ప్లీజ్ ఏడవకండి" అంటూ తానూ కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

అనూష ఆమెని దగ్గరకి పొదుపుకుని కుమిలికుమిలి ఏడ్చింది.

ఆరోజు సాయంత్రానికి శారద వెళ్ళిపోయింది.

భరణి అనూష పక్కన కూర్చుని ఆప్యాయంగా పిలిచాడు. "అనూ!"

ఎర్రబడ్డ కళ్లతో తీవ్రంగా చూసింది. "అనూ! జాతస్య మరణం ధృవం అన్నారు కదా! అన్నీ తెలిసిన నువ్వే ఇలా అయిపోతే ఎట్లా? ఎంతో ధైర్యస్థురాలివి ఇంత బెంబేలు పడితే మిగతా వాళ్ళ సంగతేంటి? "

"శ్యామలకి సుస్తీ అని హాస్పిటల్లో అడ్మిట్ చేస్తున్నాం అని నాకు చెప్పమని ఆశ్రమంనుంచి ఫోనొచ్చిందా? " సూటిగా అడిగింది.

భరణి కలవరపడ్డాడు "లే... లేదే... ఏమో గుర్తులేదు"

"నిజం చెప్పు...గుర్తులేదూ!"

అతనేం మాట్లాడలేదు.

"చెప్పు... మాట్లాడవేం? " పులిలా గర్జించింది.

అతని పురుషాహంకారం దెబ్బతింది. "ఏంటి? నిలేస్తున్నావు? వచ్చింది... అడ్డమైన వాళ్ళ సేవలు చేస్తూ నువ్వు నన్ను నిర్లక్ష్యం చేస్తున్నావని చెప్పలేదు. ఏం తప్పా? " గట్టిగా అన్నాడు.

"భరణీ! నీలో నీ మాటే నెగ్గాలన్న పంతం ఎంతగా ఉందో నేను బాగా అబ్జర్వ్ చేశాను. అందుకే చిన్నచిన్న విషయాలక్కూడా అలుగుతావు. నేను మాట్లాడించిందాకా మాట్లాడవు. నేను నచ్చచెప్పి, బుజ్జగించి, నువ్వు కోరింది ఇస్తే మళ్ళీ మామూలుగా అయిపోతావు. అదంతా చిన్నపిల్లాడి తత్వం అని సరిపెట్టుకున్నాను. కానీ నువ్వు కోరుకున్నది పొందాలన్న పంతం అనీ, ఆ పంతం నెరవేరడంకోసం నువ్వు ఆడే నాటకం అనీ తెలుసుకోలేకపోయాను. ఆ పంతంతోటి శ్యామలని హాస్పిటల్లో చేర్చామని ఫోన్ చేస్తే నాకు చెప్పలేదు. ఆ మాట చెబితే నువ్వు ఓడిపోతావని అనుకున్నావు. అవునా? ఛీ, నీలో ఇంత కుత్సితం ఉందని గ్రహించలేకపోయాను. ఎంత మొండితనం, మూర్ఖత్వం నీలో ఉన్నాయి. నీవలన... నీవలన నేను నా ప్రాణస్నేహితురాలు, నేనే సర్వస్వం అనుకుంటూ బతికిన నా శ్యామలని చివరిక్షణాల్లో ఆదుకోలేకపోయాను. శ్యామలని నేనే చంపాను. నేనే చంపాను" అనూష తలకొట్టుకుంటూ గట్టిగా ఏడవసాగింది.

"ఏవిటా ఏడుపు? అసలా శ్యామల ఎవరు? ఎవరో అనాథ. ఆశ్రయం ఇచ్చావు. ఇంతకాలం చూశావు. ఏం కావాలన్నా చేశావు. వయసు అయిపోయింది. చచ్చింది. దానికోసం నేను చచ్చినట్టు ఏడుస్తావేంటి? " కోపంగా అరిచాడు.

అనూష రకీమని ఏడుపాపింది. "ఏం అన్నావు? శ్యామల అనాథా? మరి నువ్వు, నువ్వెవరివి? నువ్వు అనాథవి కాబట్టి నా ఇంట్లో ఉంటున్నావు. నా తిండి తింటున్నావు. నా డబ్బుతో బతుకుతున్నావు. నీ సంపాదన అంటూ ఒక్కరూపాయి నాకు చూపించావా? తీసుకోడమేకానీ, వందరూపాయలు నాకిచ్చావా? నీ చేతుల్తో నాకు మంచి చీర కొన్నావా. మగాడివి కాబట్టి నీ ప్రమాదకరమైన తెలివితేటలతో, నా బల




హీనతని జయించి, మొగుడిగా నా జీవితంలోకి ప్రవేశించావు. హక్కుగా అన్నీ అనుభవిస్తున్నావు. కానీ చూడూ నీదినాదీ ఏడాది బంధమే. అది కూడా కలతలతో. కానీ నాదీ శ్యామలదీ పదిహేనేళ్ల బంధం. మామధ్య ఏనాడూ గిల్లికజ్జా కూడా రాలేదు. మా అనుబంధం గురించి నీకేం తెలుసు? "

భరణి మండుతున్న అగ్నిగోళంలా చూశాడు. "నన్ను పట్టుకుని ఇన్ని మాటలని ఇన్సల్టు చేస్తావా? సరే చూస్తాను. నిన్ను ఇన్సల్ట్ చేయడం నాకు చేతకాదా? వయసుడిగిన దానివనీ, సంసారానికి పనికిరావనీ, విడాకులకి దావా వేస్తాను. అది చాలదూ నీకు అవమానింపబడడానికి? "

అనూష నిశ్చేష్టురాలైంది.

భరణి విసురుగా వెళ్ళిపోయాడు.

★ ★ ★

హాస్పిటల్‌కి వెళ్ళి వారం రోజులైంది. హాస్పిటల్‌నుంచి ఫోన్ వస్తే ఊరు వెళ్ళానని చెప్పమంది పనికుర్రాడితో.

భరణి రెండురోజులుగా ఇంటికి రావడం లేదు. ఎక్కడో ఇల్లు కట్టిస్తున్నాడని తెలిసింది.

డబ్బెక్కడినుంచి వచ్చింది ఇల్లు కట్టడానికి, అర్థంకాలేదు అనూషకి.

శారదా వాళ్లెలా ఉన్నారో అని ఆశ్రమానికి ఫోన్ చేసింది.

"మేడమ్! మీరెలా ఉన్నారు? " అడిగింది శారద.

"నా సంగతి సరేనమ్మా... మీరెలా ఉన్నారు" అడిగింది.

"మేడమ్! మా దగ్గర డబ్బులు అయిపోయాయి. సుశీల డబ్బు వాడుతున్నాం"

"డబ్బు అయిపోయిందా? అదేంటి భరణికి రెండు లక్షలిచ్చి, అక్కడ బ్యాంకులో డిపాజిట్ చేయమన్నానే. బ్యాంకులో అడిగావా? బాలన్సు ఎంతుందో"

"అడిగాను. ఏం లేదు"

"నిజంగానా? నీరజ ఏం చేస్తోంది? "

"నీరజ...నీరజ" నసిగింది.

"ఏమైంది? "

"నీరజ వెళ్ళిపోతుందిట"

అదిరిపడింది అనూష "ఎక్కడికి? "

"తెలియదు. చాలా బాధపడుతోంది. తనిక్కడ ఉంటే మీకు అన్యాయం జరుగుతుందిట"

"అంటే... శారదా... నీరజని మాట్లాడమను"

కొన్ని క్షణాల తరువాత "మేడమ్! మీతో మాట్లాడడానికి భయపడుతోంది. భరణిగారు"

"ఆ భరణి ఏం అన్నాడు"

"నీరజని పెళ్ళిచేసుకోమని వేధిస్తున్నారట"

అనూష చేతిలో రిసీవర్ పడిపోయింది. చేష్టలుడిగి నిలబడిపోయింది. భరణి నీరజని... మైగాడ్! ఆలస్యం చేయకుండా బ్యాంకుకి వెళ్ళింది. ఆమె అకౌంట్లో కేవలం యాభైవేలుంది. అంటే! భరణి డబ్బు డ్రా చేశాడు. మరి ఏం చేశాడు. ఆమె కారు బంజారాహిల్స్‌వైపు సాగిపోయింది. తన స్థలం దగ్గరకి వచ్చి ఆగిపోయింది.

డబుల్ స్టోరీడ్ బిల్డింగ్ దాదాపు గోడలు లేచాయి.

"ఎవరు కట్టిస్తున్నారు? " అడిగింది మేస్త్రీని.

"పేపరు నడిపే సారు. పేరేందో తెల్వదు" అన్నాడు మేస్త్రీ.

అక్కడినుంచి భరణి ఆఫీసుకి వెళ్ళింది. భరణి లేడు.

రాగానే ఇంటికి రమ్మని చెప్పి, మేసేజ్ ఇచ్చి, ఇంటివైపు పోనిచ్చింది కారుని. ఇంట్లో అడుగుపెట్టేటప్పటికి భరణి ఇంట్లో ఉన్నాడు.

"భరణీ!" పులిలా గాండ్రించింది.

నివ్వెరపోయి చూశాడు.

"డబ్బేం చేశావు"

"ఏం డబ్బు?" నిర్లక్ష్యంగా అడిగాడు.

"ఆశ్రమానికివ్వమని నేనిచ్చిన చెక్కు తాలూకు డబ్బు డ్రా చేసి ఏం చేశావు?"

"లెక్కలు చెప్పాలా? నా ఇష్టం వచ్చినట్లు చేస్తాను"

"షటప్... అది నా డబ్బు. నీ ఇష్టం వచ్చినట్టు చేయడానికి నీకేం హక్కుంది? ఆశ్రమం వాళ్ళ కడుపుకొట్టి బిల్డింగ్ కట్టిస్తున్నావా? అదీ నా స్థలంలో, నా పర్మిషన్ లేకుండా"

"హు... నీ స్థలం, నీ ఆస్తి, నీ డబ్బు... ఆశ్రమం పేరుతో అపాత్రదానం చేయడం లేదా? నీ మొగుడిని నాకు హక్కెందుకు లేదు?"

"ఛీ... సిగ్గులేదూ నీకు? నీకసలు ఆత్మాభిమానం లేదా? ఏదో సాయం చేస్తున్నావని నమ్మి ఆశ్రమం బాధ్యత అప్పగిస్తే దగాచేసి, నన్ను ఫూల్‌ని చేసి, వాళ్ళ ముందు నన్ను దోషిగా నిలబెడతావా? పైగా నీరజని... నీరజని... ఛీ... పెళ్ళి చేసుకోమని వేధిస్తావా?"

"ఓ! ఆ సంగతి కూడా తెలిసిందా? అయితే ఇంకేం? విను చెప్తా... నాకు పిల్లలు కావాలి. నువ్వు పిల్లల్ని కనలేవు. నాకు డబ్బు కావాలి. నువ్వు డబ్బు ఇస్తావు. అందుకే పిల్లలకోసం నీరజని పెళ్ళి చేసుకుంటాను. డబ్బుకోసం నిన్ను ఉంచుకుంటాను"

"భరణీ!" ఆవేశంగా అరిచింది. "ఛీ! నీచుడా, నువ్విలాంటివాడివా? ఇంత ఛండాలంగా ఆలోచిస్తావా? అనూషతో ఇలా మాట్లాడడానికి నీకెంత ధైర్యం? నీకు పిల్లల్ని కనివ్వకపోవడం నా నేరమే అని భావించి నీనుంచి విడిపోడానికి నేనెప్పుడో సిద్ధపడ్డాను. కానీ ఈమధ్యలో జరిగిన దురదృష్టకర సంఘటనలతో కొంతకాలం వాయిదా వేయాల్సి వచ్చింది. కానీ నువ్వు నాకు చేసిన ద్రోహానికి, వంచనకీ నిన్ను నేను ఎన్నటికీ క్షమించను. నీకు విడాకులివ్వను. నీతో కలిసి బతకను. ఇకనుంచీ నీకూ, నాకూ సంబంధంలేదు. తక్షణం ఇంట్లోంచి వెళ్ళు వెళ్ళిపో... ప్లీజ్ గెటవుట్. భరణీ! ఫో... నువ్వు వెంటనే నా ముందునుంచి వెళ్ళిపో" అనూష వెర్రిగా అరిచి, వెక్కి వెక్కి ఏడుస్తూ మంచంమీద వాలిపోయింది.

భరణి ఆవేశంలో అన్నాడేకానీ, అన్న వెంటనే అతని అంతరంగంలో భయం మొదలైంది. అనూషతో ఇలా మాట్లాడేనేంటి? అనుకున్నాడు.

అపరకాళిలా ఉన్న ఆమె అవతారం, ఆ కళ్ళు చూస్తుంటే భయం వేసింది.

కొద్దిక్షణాలు చేష్టలుడిగి నిలబడ్డాడు. తరువాత నెమ్మదిగా అక్కడినుంచి నిష్క్రమించాడు.

★ ★ ★

ఆ ఇంట్లో ఇంతకాలంగా ఎన్నడూ చూడని స్మశాన నిశ్శబ్దం. డాక్టరమ్మగారి విషాదవదనం చూసిన పనివాళ్ళు ఆమె స్థితికి కదలిపోయారు. కన్నతల్లికన్నా, ఎక్కువగా కష్టసుఖాలు విచారించే అమ్మగారిని ఈ స్థితికి తీసుకొచ్చిన భరణిమీద విపరీతమైన కోపం వచ్చింది వాళ్ళందరికీ. ఏం చేయాలో, అమ్మగారినెలా ఓదార్చాలో తెలియక బిక్కుబిక్కుమంటూ కూర్చుండిపోయారు.

తిండీ, నీళ్ళూ లేకుండా బెడ్‌రూంలో జీవచ్ఛవంలా పడుకుని ఉన్న అనూషని పలకరించే సాహసం ఎవరికీలేదు. ఎన్నడూ చవిచూడని ఓటమితో కృంగిపోయిన అనూష కుప్పకూలిపోయింది. భరణి ఎంతమాట న్నాడు. అనూషని ఉంచుకుంటాడా? ఆమె అణువణువూ దహించుకుపోసాగింది. ఎంత ధైర్యం. ఒక మగవాడి తోడు కోరుకుని మూడుముళ్ళకోసం తల వంచినందుకు తనింత చులకనైపోయిందా?

జర్నలిస్టుగా తనతో మాట్లాడడానికి భయపడిన రాస్కెల్ మొగుడై ఇలా అవ




మానిస్తాడా. తను మగవాడి పొందుకోసం మొహం వాచిపోయిందనుకుంటున్నాడా? ఉంచుకుంటాడా? !

అవమానంతో, ఆవేశంతో ఆమె మనసు భగభగా మండసాగింది.

ఇంతకింతా ప్రతీకారం తీర్చుకోవాలి. అనూష అంటే ఏమిటో తెలియచేయాలి.

వాడికి అనూష గురించి తెలియదు. తెలియచేస్తాను.

వీణ కూడా దగ్గర లేకపోవడంతో ఆమెని ఓదార్చేవాళ్ళు లేక ఆ దుఃఖం అలా ఉబుకుతూనే ఉంది. ఆ దుఃఖంలో తల్లి, తండ్రి, మణి, ప్రశాంత్, వీణ, శ్యామల... అందరూ గుర్తొస్తున్నారు. ఏమిటీ జీవితం? ఎందుకిలా అయ్యింది?

తిండీ, నీళ్ళూ సయించడంలేదు. ఆ ధ్యాసే లేకుండా అలా మంచంమీద పడుకుని ఉండిపోయింది.



డాక్టర్ వసుధ పెళ్ళి నిశ్చయమైంది. వెడ్డింగ్ కార్డ్ తీసుకుని అనూష కోసం వచ్చింది. ఆమె వారంనుంచీ హాస్పిటల్‌కి రావడంలేదని డ్యూటీ డాక్టర్ చెప్పాడు.

"వారంనుంచీ రావడంలేదా? ఎందుకని? లీవు పెట్టారా?" కొంచెం గాభరాగా అడిగింది.

"తెలియదు. నేనూ ఇవాళే వచ్చాను. లీవులో ఉన్నాను" అన్నాడతను.

అనూష వారంనుంచీ హాస్పిటల్‌కి రావడంలేదన్న వార్త వసుధకి వింతగా అనిపించింది. ఎప్పుడో తప్ప అనూష లీవు పెట్టదు. అదీ, ఒకరోజు లేదా రెండురోజులు... అలాంటిది వారంనుంచీ రావడం లేదా? ఆమెకి తోచలేదు.

డ్యూటీ అన్యమనస్కంగా చేసింది. సాయంత్రం ఆరు కాగానే, వెహికల్ తీసుకుని అనూష ఇంటికి బయల్దేరింది.

ఆమె వెళ్ళేటప్పటికి పని కుర్రాడు, వాచ్‌మాన్ బిక్కుబిక్కుమంటూ వాకిట్లో కూర్చుని ఉన్నారు.

"డాక్టరమ్మగారు లేరా?" వెహికల్ పార్క్ చేసి, లోపలికి నడుస్తూ అడిగింది.

"ఉన్నారమ్మా... అమ్మగారికి ఆరోగ్యం బాగాలేదు" బెంగగా చెప్పాడు.

"ఆరోగ్యం బాగాలేదా?" వసుధ ఖంగారుగా లోపలికి నడిచింది. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది.

ఆమె సందేహంగా అనూష బెడ్‌రూంలోకి అడుగుపెట్టింది.

"మేడమ్" కంపించే స్వరంతో పిలిచింది.

అనూష కళ్ళు తెరిచింది.

వసుధని చూడగానే అణగారిన దుఃఖం ఉధృతంగా పెల్లుబికింది. బోర్లా పడుకుని వెక్కివెక్కి ఏడవసాగింది.

"మేడమ్! ఏం జరిగింది?"

అనూష ఏడుపు ఉధృతం అయింది.

"మేడమ్! పదిమంది దుఃఖాన్ని తీర్చే మీకు దుఃఖం కలగచేసిన వాళ్ళెవరోకానీ వాళ్ళు క్షమార్హులుకారు... ఏం జరిగింది నాకు చెప్పరూ ప్లీజ్"

అనూష చాలాసేపు ఏడ్చి నెమ్మదిగా లేచి బాత్‌రూంలోకి వెళ్ళి మొహం కడుక్కుని వచ్చింది.

"నేను నా పెళ్ళికి పిలవడానికి వచ్చాను.

మీరింత దుఃఖంలో ఉంటే నాకేం తోచడం లేదు. ఏం జరిగింది? "

"ఏం లేదు..." బలవంతంగా నవ్వి, "ఎప్పుడు పెళ్ళి" అంది.

"25 తారీఖు. కానీ, మీరు"

"వసుధా, నేను... నేను ఉద్యోగానికి రిజైన్ చేస్తున్నాను"

"వాట్? నో" గట్టిగా అరిచింది వసుధ.

అనూష పెదవులు బిగించి దుఃఖం ఆపుకుంటూ అంది. "బాగా అలసిపోయాను. కొంతకాలం విశ్రాంతి తీసుకోవాలనుకుంటున్నాను... అందుకే".

"కాదు... కాదు... మీ మనసెవరో గాయం చేశారు. మిమ్మల్ని బాధపెట్టారు. చెప్పండి ఎవరు వాళ్ళు? చెప్పండి మేడమ్"

"నన్నెవరూ బాధపెట్టలేదు వసుధా! నన్ను నేనే బాధపెట్టుకుంటున్నాను. నేనే తప్పు చేశాను. అందుకు నాకు నేనే శిక్ష వేసుకుంటున్నాను..."

"మేడమ్...!" వసుధ ఇంక ఏడుపు ఆపుకోలేకపోయింది. గట్టిగా ఏడ్చేసింది.

"వసుధా! ఏడవద్దు. పెళ్లికూతురివి కాబోతున్నావు. తప్పు. ఏడవకు. వెళ్లు. నీ పనులు చూసుకో. నామాట విను. వెళ్లు. చూడూ! ఈ సంగతి హాస్పిటల్లో ఎవరితోనూ చెప్పకు"

వసుధ మాట్లాడలేకపోయింది. నోటికి చెంగు అడ్డం పెట్టుకుని అక్కడనుంచి పారిపోయింది.

కానీ, అనూష కోరినట్టు ఆమెనలా వదిలేయలేకపోయింది. ఎలాగైనా ఈ విషయం కనీసం హరిశ్చంద్రగారికన్నా తెలియచేయాలి. ఏ అఘాయిత్యం జరక్కముందే ఆయనకి తెలిస్తే, మేడమ్‌ని కాపాడతారు... అనుకుంది. మరునాడు హరిశ్చంద్రగారితో మాట్లాడాలని నిశ్చయించుకున్నాక, తెల్లవారడంకోసం ఆదుర్దాగా ఎదురుచూసింది.

  

ఆరోజు ఉదయాన్నే ఫోన్ మోగింది. పని కుర్రాడు ఫోన్ తీశాడు. వీణ స్వరం వినిపించింది. "డాక్టరమ్మగారున్నారా? నేను లాయరమ్మని మాట్లాడుతున్నాను" అంది.

"అమ్మా..." రాజు బావురుమన్నాడు.

"ఏమైందిరా? అమ్మలేదా? " గాభరాగా అడిగింది.

వాడు జరిగిందంతా క్లుప్తంగా, ఏడుస్తూ చెప్పాడు. "మీరు వెంటనే రండమ్మా" అన్నాడు.

సాయంత్రం నాలుగు గంటలకి వీణ వచ్చింది. బాంబేనుంచి ఫ్లైట్‌లో వచ్చింది. ఎయిర్‌పోర్ట్‌నుంచి నేరుగా అనూష ఇంటికి వచ్చింది. అనూషని చూసి స్థాణువైంది.

"అనూ...!" ఆప్యాయత నిండిన ఆ పిలుపుకి అనూష కళ్ళు తెరిచింది. "అనూ!" వీణ చేతులు చాచింది. అనూష చివ్వున లేచి గట్టిగా కౌగలించుకుంది. ఇద్దరూ వెక్కి వెక్కి ఏడవసాగారు. "ఏమైంది అనూ? ఏమైంది? నువ్వేంటి ఇలా అయ్యావు. ఎంతో సుఖంగా ఉంటావనుకుని కొంతకాలం మిమ్మల్ని ఒంటరిగా వదిలేయాలని అక్కడక్కడా తిరుగుతూ గడిపాను. అనూ! ఏమైందమ్మా? "

అనూష వెక్కుతూ జరిగిందంతా చెప్పింది.

అంతా విన్న వీణ ఆవేశంతో ఊగిపోయింది.

"ఇడియట్! ఇంతగా హెరాజ్ చేస్తున్నాడా నిన్ను. సింహంలాంటి అనూష, ఆఫ్టాల్ మొగుడనే ఓ దగుల్బాజీ వంచనతో ఈ స్థితికి దిగజారిందా? నో! నేను తట్టుకోలేను. వాణ్ణి కోర్టుకీడ్చి ముప్పుతిప్పలు పెట్టి, మూడు చెరువుల నీళ్ళు తాగించకపోతే నా పేరు వీణ కాదు"

అనూష విరక్తిగా నవ్వింది. "అందువలన నాకేం ఒరుగుతుంది? అతని కోరికా సమంజసమేగా? హి నీడ్స్ చిల్డ్రన్. నాలాగా అందరూ సమాజసేవ చేయలేరు. ప్రతి





వాళ్ళూ నావాళ్ళు అనుకునే అవసరం అత నికేం ఉంది?"

"అవసరం కాదే. విశాలహృదయం. అలా అనుకోడానికి సంస్కారం కావాలి. ఉన్నత మైన ఆశయాలుండాలి. గొప్ప మనసుం డాలి. అవన్నీ అతనికేవి? అయినా నేనొక ఫూల్‌ని. నీలాంటి ఉన్నతమైన భావాలున్న స్త్రీని ఓ సామాన్యుడి భార్యగా బతకమని వేధించాను. పెళ్ళే జీవితానికి పరమావధి అనీ, ఆనందానికి పరాకాష్ఠ దాంపత్యజీవితం అనీ నూరిపోశాను. ఓ తుచ్ఛమైన, ఆనం దంకోసం వివాహం అనే ఉచ్చు నీ మెడకి బిగించాను. అనూ! నువ్వొక మహా వృక్షా నివి. ఎందరికో నీడనిస్తూ, ఫలాలనిస్తూ ఆశ్రయం కల్పిస్తూ, కీర్తిప్రతిష్ఠలనే కొమ్మ లతో శాఖోపశాఖలుగా విస్తరించిన ఈ మహావృక్షాన్ని సంసారం అనే కుండీలో పాతి, బోన్సాయ్‌గా పెరగమని ఆదేశిం చాను. బోన్సాయ్ అందానికీ అలంకారానికే కానీ పదిమందికీ ఉపయోగపడలేదు. అనూ! లే... ఈ బంధాన్నించి, ఈ ఊబి నుంచి బైటకిరా. ఇదిగో..." వీణ తన పొట్ట చూపించింది. "ఇలాంటి అనాధలకు మరి కొందరికి నువ్వు తల్లివి కావాలి. నీ ఒడిలో మరెందరో మేధావులు తయారుకావాలి. ఎందరికో నువ్వు నీడనివ్వాలి. తోడువి కావాలి. ఈ మహావృక్షం మంచి వాతావర ణంలో ఏపుగా, ఆరోగ్యంగా, శాఖోపశాఖ లుగా విస్తరించాలి. అవును ఈ ప్రపంచం మొత్తం విస్తరించాలి. లే అనూ!"

వీణ ఆవేశంగా అంటూ చేయి అందిం చింది.

ఆమె మాటలు ఇస్తోన్న కొత్త శక్తితో, అనూష నెమ్మదిగా లేచి, అడుగులో అడుగు వేసుకుంటూ బైటికి వచ్చింది. అప్పుడే నిండు చందమామ ఆకాశంలో విహారానికి వచ్చి వెలుగునవ్వులు పండిస్తున్నాడు.

ఆ వెలుగులో విశాలవిశ్వం మరెంతో తేజోమయంగా కనిపించింది ఆమె కళ్ళకి.

మెరుస్తున్న కళ్ళతో వీణవైపు చూసింది. నిండు గర్భంతో, విశ్వగోళాన్ని మోస్తున్న భూమాతలా కనిపించింది.

అప్పుడే ఫోన్ మోగింది.

వీణ ఫోన్ అందుకుంది. ఖంగారుగా "ఆ... సార్! ఒక్క నిమిషం" అంటూ రిసీ వర్‌కి చేయి అడ్డంపెట్టి "అనూ! హరిశ్చంద్ర గారు"

అనూష రిసీవర్ తీసుకుంది.

"అనూ! అమ్మా అనూషా! నేను హరిశ్చం ద్రని... ఏమ్మా కులాసానా? ఎలా ఉన్నావు? నాకు వసుధ చెప్పింది. రిజైన్ చేస్తానన్నావుట. అలాంటి పిచ్చి పనులు చె య్యకు. ఆఫ్టాల్ ఒక మగాడికి నువ్వు అక్క ర్లేనంత మాత్రాన నువ్విలా అయిపోవడం నేను తట్టుకోలేను. ఈ సమాజానికి నీ అవ సరం చాలా ఉంది. నువ్వు ఎంతో ధైర్యవం తురాలివి" అన్నారు.

ఆయన మాటలకి, ఆ మాటల్లోని ఆప్యా యతకీ అనూష హృదయం పులకించిపో యింది. ఆ ఆప్యాయత, ఆదరణ ఇస్తోన్న స్ఫూర్తితో మెల్లిగా అంది, "లేదు డాక్టర్! నేను కోలుకుంటున్నాను. ధైర్యం తెచ్చుకుం టున్నాను. రేపట్నించి హాస్పిటల్‌కి వస్తు న్నాను"

"వెరీగుడ్! వెరీగుడ్...!" అని ఆయన ఫోన్ పెట్టేశాడు.

వీణ అనూషకి చేయి అందించింది.

వాచ్‌మాన్, పని కుర్రాడు, అప్పుడే వచ్చిన భారతమ్మ ఆనందంగా కళ్ళు తుడు చుకున్నారు.



**అంకితం**

కష్టాల్లోనూ, సుఖాల్లోనూ బ్యాలన్స్‌డ్‌గా ఉండడం నేర్పిన మా నాన్నగారు కీ.శే. ఏ.ఎల్. నరసింహరావుగార్కి.

# ఏరినముత్యాలు

★ నింద పడనివాడు లోకంలో ఎవడూ లేడు.

– గౌతమబుద్ధుడు

★ ఎలాగో జీవించడం కాదు గొప్ప. మన స్వల్ప జీవితంలో మనం ఏం సాధించామనేది ముఖ్యం.

– జవహర్‌లాల్ నెహ్రూ

★ మూఢాచారాలనుంచి ముక్తుడైనవానికి మృత్యుభయం ఉండదు.

– గురునానక్

★ మన అభివృద్ధికి బద్ధ విరోధి అసహనం.

– డా॥ సర్వేపల్లి

★ సోమరితనం శరీరపు మూర్ఖత్వం. మూర్ఖత్వం మనసు సోమరితనం.

– హ్యూమ్

★ ఎప్పుడూ జయమే సాధించే ఎదురులేని అస్త్రం ప్రేమ.

– కన్ఫ్సలటా

★ మానవనైజంలో మార్పుకు ప్రథమ సోపానం ఆత్మావలోకనం.

– థామస్ మాన్

★ ఇతరులకు బాధ కలిగించే బదులు మనం బాధపడడం మంచిది.

– శామ్యూల్ జాన్సన్

★ దేముడు ఇంకా గొప్ప విషయాల కోసం మనలను మలిచేందుకు వాడే పరికరాలు కష్టాలు.

– హెచ్. డబ్ల్యు. బీచర్

★ సంతోషం కొనుక్కోలేవు. దానిని నీవు కష్టపడి గడించుకోవాలి.

– హారోల్డ్ జి. హోపెన్

★ ఉద్ఘంధాలకంటే ఉత్తేజకరమైనది నిశ్శబ్దం.

– జె.బి.ఎస్ హాల్డేన్

★ పరులకు సౌభాగ్యం సాధించడంలో సాయపడేవాడే ఆదర్శవాది.

– హెన్రీఫోర్డ్

★ అజ్ఞానానికి ఐశ్వర్యం తోడైతే ఇక అడగక్కర్లేదు.

– షోపెన్ హోవర్

★ మనలో ఉత్సాహం కొరవడినప్పుడే పరులపట్ల మనం ఉదాశీనంగా ఉంటాం.

– హాజీవిట్

★ తన్ను తాను విమర్శించుకోవడం వివేకం. ఇతరులను విమర్శించడం అవివేకం.

– జిల్లెళ్ళమూడి అమ్మ

సేకరణ : ఏ.ఎల్. సువర్చల

# 'మజిలీ' పై సమీక్షలు

జూన్ చతురలో ప్రచురితమైన వి. నాగరత్న నవల 'మజిలీ' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## చలివేంద్రాలు

*(మొదటి బహుమతి రూ. 100/– పొందిన సమీక్ష)*

"నిర్ణయించుకున్న ఒక లక్ష్యాన్ని సాధించడం లేదా అనుకున్న ఆ గమ్యాన్ని చేరడం మాత్రమే జీవితం కాదు. అలా సాధించడంలో చేసే ప్రయాణం పొడుగునా ప్రతిక్షణం రసాస్వాదన చేయగలగడమే జీవితం" అంటారు ప్రముఖ నటి నందితాదాస్.

చావుపుట్టుకల మధ్య జీవనయాత్రలో ప్రతి మజిలీ అటువంటి రసాస్వాదనకు 'చలివేంద్రం'లాంటిది. దాహార్తిని తీర్చుకొని, తప్తహృదయాలకు రవంత విశ్రాంతినిచ్చి నిస్త్రాణమైన మనసును పునః చైతన్యవంతం చేసి మరో మజిలీకి దిశనూ, స్ఫూర్తినీ, శక్తినీ ఇచ్చే చలివేంద్రాలే ఈ మజిలీలు.

'స్థితప్రజ్ఞతకు, ప్రాపంచిక జ్ఞానార్జనకు అక్షరజ్ఞానం తప్పనిసరిగా అవసరంలేదు' అన్న నగ్న సత్యానికి ప్రతిరూపాలే శారదమ్మ, వీరయ్య, మంగమ్మ, వెంకటయ్య, అరుంధతమ్మలు. వీరందరూ ఆఖరి మజిలీలో ఉన్నారు. అటువంటివాళ్ల మనోభావాలను, నిస్వార్థమైన వారి ప్రేమాభిమానాలను... గౌరవప్రదంగా, ఆదరణపూరితంగా తమ మరణం ఉండాలన్న అత్యంత స్వల్పమైన ఆకాంక్షలను ఒక అసాధారణమైన కోణంనుంచి మననం చేసి తన నిజజీవితంలో రాబోయే మహత్తరమైన మజిలీని దృష్టిలో పెట్టుకొని ఆ మజిలీలో తన తోడుగా నిలిచే మరొక ఆదర్శ పురుషుడితో




తర్కించి, ఒప్పించి ఆత్మ విశ్వాసంతో ముందడుగు వేయనుంది బిందు. స్వచ్ఛమైనది, నిష్కల్మషమైనది, ప్రాణాధారమయినది హిమం అయితే ఆ హిమ బిందుకి చేతనం ఇచ్చిన హరి ఆ 'రవి' లాంటివాడు. ఆ ప్రవాహానికి ఇక అవరోధాలు ఏముంటాయి?

వివాహపూర్వ కలయికలు కేవలం భౌతికాలే అని ఊహించుకొని వాటిని వీలయినంత వరకూ నిషేధించాలని వాదించే ఈ తరపు సభ్య సమాజం కూడా ఒక క్షణం ఆగి అటువంటి కలయికల వల్ల ఆ దాంపత్యం మరింత శోభిల్లుతుందనీ

తద్వారా సమాజం మరింత పురోభివృద్ధి చెందగలదని సూచిస్తున్నట్లుగా ఈ నవలని మలిచారు రచయిత్రి. సాహిత్యం సామాజిక స్పృహను కలించేదానిలా ఉన్నపుడు ఆ సాహితీ కర్తలు ధన్యులు. 'నాగరత్న' కూడా ఆ కోవలోకి చేరారు ఈ నవల ద్వారా.

**–మంగళంపల్లి వెంకట సీతారామయ్య**

హైదరాబాద్-500043

## హాస్యపు జల్లులు

*(రెండవ బహుమతి రూ.75/– పొందిన సమీక్ష)*

మృగశిర కార్తె ప్రవేశంతో కూడా పూర్తిగా చల్లబడని వాతావరణంలో జూన్ నెలలో మా చేతుల్లో కొచ్చిన వి.నాగరత్న మజిలీ నవల మా మీద హాస్యపు చినుకుల్ని కురిపించింది. కథలో చెప్పదల్చుకున్న విషయం చిన్నదే అయినా ఆద్యంతం రచయిత్రి నడిపించిన కథనం ఎంతో ఆసక్తికరంగా సాగింది. కథలో ఇద్దరు ప్రేమికులు ప్రధాన పాత్రలుగా ఉన్న మామూలు ధోరణికంటే విభిన్నంగా వారిని చిత్రించిన తీరు ప్రశంసనీయంగా ఉంది. సాధారణంగా ప్రేమికులు చెట్టాపట్టాలేసుకుని ఐస్‌క్రీం పార్లర్ల చుట్టూ తిరిగే అమాంబాపతు ప్రేమికులుగా కాక ఒక ఉదాత్తమైన ఆశయంతో పరిణతి కలిగి తమ తమ హద్దుల్లో ఉంటూ కొనసాగిన వారి ప్రేమ వ్యవహారం హృద్యంగా సాగింది.

పెద్దవారిపట్ల ఆదరణ, అయినవారిపట్ల ఆప్యాయత చూపించాలన్న ఆలోచనే యువతలో మృగ్యమౌతున్న ఈ రోజుల్లో దాన్ని గుర్తుచేసే దిశలో నడిచిన ఈ నవల రచయిత్రిలోని మానవతా విలువల్ని స్పష్టం చేస్తుంది.

ఇలాంటి రచనలు ఒక తరంలో వచ్చినా ఇప్పటి టీవీ మీడియాతో దారీతెన్నూ లేకుండా పోతున్న యువతకు స్ఫూర్తిదాయకంగా మజిలీ నవల సాగటం మమ్మల్ని ఆకట్టుకుంది. ఏమైనా మజిలీలాంటి నవలను అందించిన వి.నాగరత్నగారికి, సంపాదకులకు, ఈ నవలలోని బొమ్మల్ని గ్రాఫిక్స్ స్టయిల్లో సహజత్వం ఉట్టిపడేలా చేసిన బలరాంగారికి అభినందనలు తెలుపుకుంటున్నాం.

**–యం.యస్. రాణి**

హైదరాబాద్-4

## 'మజిలీ' ఎట్లైనా మనుమా సుఖాన

*(మూడవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

సమస్య ఎంత సున్నితమైనదీ మరెంత కీలకమైనదీ అని సమస్య పరిష్కారానికి ముందే పరిశీలించడం సహజం. అయితే నవల చివరి మజిలీ వరకు సమస్య ఆవిష్కృతమే కాలేదు. నవ్వుల పంట పండిస్తున్న సంభాషణా చతురోక్తుల నడుమ చింతపల్లి వరకు శ్రీహరి, హిమబిందులతో పాటు పాఠకులను కూడా నడిపించిన ఘనత నాగరత్న గారిదే! ఆహ్లాదకరమైన గ్రామీణ వాతావరణం, మనం మరచిపో తున్న మన మూలాలను గుర్తుచేసినా అభివృద్ధికి నోచుకోని పల్లెలు మనల్ని ఆశ్చర్యంతోపాటు వేదనకూ గురిచేస్తాయి. పాత తరానికి ప్రతినిధి శారదమ్మ. తన పాజిటివ్ దృక్పథంతో కష్టాల కడలిని అవలీలగా ఈదిన ఇల్లాలు. ఈ తరపు ఆలోచనలకు స్త్రీవాద దృక్పథంతో మరింత బలాన్నిస్తూ, అబలలంకాము సబలలమేనన్న సంగతిని అడుగడుగునా గుర్తుచేస్తూ హరిని జాగృత పరిచే బిందు నేటి అమ్మాయిల మనోగతాన్ని తేటతెల్లం గావించింది. ఇక వీరయ్య, అరుంధతమ్మ, వెంకటయ్య,





మంగమ్మ పాతికశాతం పేజీలలోనే తమ ఉనికిని నిలుపుకున్నా నవల ఉత్తరార్థంలో బిందు తీసుకున్న నిర్ణయానికి మూలకారకులై నిలిచారు. పిల్లల చదువులు, పరీక్షలు, ఉద్యోగాల గురించి పడే చింతనకు అత్యధిక సమయాన్ని కేటాయించి అసలు ఈ పనీ పాటా లేని పెద్దవాళ్ల గురించి ఇంత తలలు బాదుకోవాలా, అసలే బిజీగా ఉన్న మనకు సమయమేదీ అని వృద్ధ తల్లిదండ్రులకు తిలోదకాలిచ్చే సంతానం ఉన్నంతవరకు ఈనాడు వీధికొక బడి వెలసినట్లు వీధికొక వృద్ధాశ్రమం వెలసినా ఆశ్చర్యపోనక్కరలేదు. చక్కటి నిర్ణయం తీసుకున్న బిందును ఆమె తల్లిదండ్రులు, అత్తమామలు ఆశీర్వదిస్తారో లేదో అనే శంక పొడచూపినా మనకు మాత్రం మజిలీ ఎట్లైనా మనుమా సుఖానా అని బిందును ఆశీర్వదించాలనిపిస్తుంది. వృద్ధుల సమస్యకు ఆశ్రమాలే సబబు అనే ధోరణిని పెంచే ప్రమాదం కూడా ఈ నవలలో గోచరించినా శారదమ్మ, వీరయ్య, అరుంధతమ్మ, వెంకటయ్య, మంగమ్మల సంతానంలో పరివర్తనను చూపించి ఉంటే సామాజిక విలువలకు నైతిక మద్దతు పెరిగి ఆవిరైపోతున్న అనుబంధాలను ఘనీభవింపచేయగలిగేది.

–సి.ఉమాదేవి
హైదరాబాద్-73

## 'నాడు-నేడు'ల వారధి మజిలీ

*(నాలుగవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

ఆంధ్రుల గ్రామీణ జీవితానికి అద్దం పట్టిన నవల మజిలీ. నవల ఆద్యంతం సరదాగా నడుస్తూ మంచి సందేశాన్ని, స్ఫూర్తిని అందించింది. నన్ను, నా ఆలోచనల్ని 45 సం. వెనక్కు నడిపించిందీ నవల. నా జన్మభూమి కూడా చింతపల్లిలాంటి కుగ్రామమే. కనీస సౌకర్యాలుకూడా లేక సుమారు 4 మైళ్లు నడిచి వచ్చి బస్సెక్కి పట్నం చేరి చదువుకొనే రోజులు జ్ఞప్తికి వచ్చినాయి. ఉదయం పూట వాగు వెంబడికి కాలకృత్యాలు తీర్చుకోవడం కోసం చేరే దృశ్యాం గుర్తుకు వచ్చి నా పెదాలపై చిరునవ్వు వెలిసింది. అలాంటి సజీవ దృశ్యానికి 'మజిలీ' ఒక మచ్చుతునక.

'నవలా నాయిక హిమబిందు ఆధునిక స్త్రీ మూర్తికి ప్రతిరూపం. 'ఫెమినిజం' అనే భావానికి సజీవ సాక్ష్యం. సరదాగా జీవితాన్ని ఎంజాయ్ చేసే ఆమెలోని స్త్రీ మూర్తిని మేల్కొల్పి ఆమెలో సంఘర్షణ రేపిన తీరు అత్యద్భుతం. మధ్యతరగతి కుటుంబంలోని స్థితిగతులను మంగమ్మ కథలో విని చిగురుటాకులా వణికిపోయింది. విదేశీ వ్యామోహంతో అమెరికా చేరిన శేఖరం, శంకర్‌లు పల్లెటూరిలోని తమ తల్లిదండ్రులైన వెంకటయ్య, అరుంధతమ్మలను పట్టించుకోకపోవడం విని దయనీయమైన స్థితి చూసి ఆమె మనసులో ఆలోచనా తరంగాలు పెల్లుబికాయి. ఒక ఆదర్శవంతమైన నిర్ణయాన్ని తీసుకోవడానికి పూర్వరంగాన్ని ఇలా చక్కగా తీర్చిదిద్దారు నాగరత్నగారు. ఆ ఆలోచనా తరంగాల నుండి ఉద్భవించినదే వృద్ధాశ్రమ స్థాపన.

'సొంతలాభం కొంత మానుకొని పొరుగువాడికి తోడుపడవోయ్' అన్న గురజాడ సూక్తి ఆదర్శమైతే యువత ఆలోచనలలో క్రొంగొత్త దృక్పథం మొదలవుతుంది. ప్రతి ఒక్కరు సంస్కర్తలు కానవసరంలేదు కానీ తనకు చేతనైనంతలో వ్యధార్త జీవులను ఆదుకొంటే అదే ఉత్తమమైన మార్గం.

శారీరకమైన ఆకర్షణే ప్రేమ అని భ్రమపడుతున్న నేటి సమాజంలో మానసికమైన ప్రేమకు శ్రీహరి పాత్ర సజీవ సాక్ష్యం. స్త్రీ హృదయం అర్థం చేసుకొని

ఆమె చేసే పనికి మనస్ఫూర్తిగా తన వంతు సహకారం అందించడం అభినంద నీయం.

శారదమ్మ, రాఘవయ్య పాత్రలు నాటి సామాజిక జీవితానికి ప్రతినిధులు. బాల్య వివాహం చేసినా కుటుంబ భారాన్ని మోయాల్సి వచ్చినా తన వాళ్ల చెంత చేరక ఆత్మస్థైర్యంతో స్వతంత్ర జీవితాన్ని గడిపిన ఆ దంపతులు ఆదర్శప్రాయులు. నేటి యువతకు మార్గదర్శకులు.

హిమబిందులాంటి వ్యక్తులు ఆడపిల్లను అనే భావాన్ని వదిలి సామాజిక శ్రేయస్సు కోసం తనకు చేతనైనంత చేయడం అభిల షణీయం. అయితే ఒక్క విషయంలో మాత్రం రచయిత్రి సాంప్రదాయక మార్గం నుండి బయటకు రాలేకపోయిందేమో అని పిస్తుంది. లోకంలో కుమారులంతా తల్లిదం డ్రులను పట్టించుకోని దుర్మార్గుల్లా చూపిం చడం పాతమూసలో పోతపోసినట్లుగా అని పిస్తుంది. దీనికి సమాంతరంగా మంచివా ళ్లైన కొడుకులను ప్రస్తావిస్తే బాగుండేదేమో అనిపిస్తుంది.

ఆపకుండా చదివించడం మజిలీ నవ లకు ప్రాణమైతే కథాగమనం సెలయేటి ప్రవాహంలా పరుగులు తీయడం విశేషం. 'నీ ఇంటిని నీవు బాగు చేసుకొంటే ఊరు దానంతట అదే బాగుపడుతుంద'నే సామె తను ఈ నవల ఋజువు చేస్తుంది. నా స్మృతిపథంలో కలకాలం గుర్తుండిపోయే నవల 'మజిలీ'. రచయిత్రి నాగరత్నగార్కి అభినందనలు.

–చెన్నారెడ్డి శేషయ్య
ఒంగోలు

## ఆ 'లోచన'

*(అయిదవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

పల్లెసీమలు దేశానికి పట్టుకొమ్మలు అని చిన్నప్పుడెప్పుడో చదివినట్లు గుర్తు. కారణం బహుశా ఆనాటి మర్రివృక్షంలా విస్తరించుకొన్న ఉమ్మడి కుటుంబ వ్యవస్థ కావచ్చు. కానీ ఈనాడు, కడుపులు చేతబ ట్టుకొని చదువుకు తగ్గ ఉద్యోగంకోసం లేదా మరో ఉపాధికోసం ఆ మర్రివృక్షంలో కొన్ని శాఖలు పల్లెల్ని వదలి పట్నాలకు వలస పోవడం వల్ల ఇకముందు పల్లెసీ మలు దేశానికి పట్టుకోల్పోయిన కొమ్మలు అని చదువుకోవలసి రావచ్చు. పల్లెలను వదలి ఈ విధంగా విడిపోయిన తర్వాత మిగిలిన శాఖల్లో స్వార్థపరత్వం చోటుచే సుకొని పల్లెల్లో చుట్టరికాలు అంతంత మాత్రంగా మిగిలిపోయాయి, పోతు న్నాయి. ఆనాటి పల్లెలకు ఈనాటి పల్లె లకు అసలు పోలికలు లేవు.

ఈ నేపథ్యంలో ఈ నెల చతుర నవల మజిలీ ఓ కొత్త ఊపిరిపోసింది. కానీ ఆ మిగిలిన అభాగ్యులను కూడా పట్నాలకు తరలించి వారికేదో సాయపడదామనే ఉద్దేశం... బాధ్యతలేని పిల్లల్లోని స్వార్థపు ఆలోచనలకి మరింత ప్రోత్సాహాన్నిచ్చిన ట్లైంది. అదే నాకు నచ్చలేదు

– యస్.హరనాథబాబు
హైదరాబాద్-500044



Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: SITARA, Telugu Film Weekly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Chennai: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 20904; Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78